# భా

## అర్భకుల ఆత్మకథ
సత్యనారాయణశాస్త్రి

## తేజో౽వతరణం
నాగభూషణం

## నవ్వీన నాపచేను
దిలావర్

S

శ్రీని

## ఉపనిషత్తు

శివరామశాస్త్రి

## జీబ్రా

జాతశ్రీ

ఇంకా రాంబాబు, వెంకటసుబ్రహ్మణ్యమ్, రమేష్‌బాబు, సోమరాజు, కామేశ్వరరావు, శేషగిరిశర్మ, గోపాలకృష్ణ, హరినాథ్, శ్రీనివాసులు, కేవస్వీ, సూర్యనారాయణ, సంపత్కుమారాచార్య, జవహరలాలు, పరబ్రహ్మశాస్త్రి, ప్రమీలారెడ్డి ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

జనవరి 1980

సంపుటము : 57 సంచిక : 1

విడిప్రతిక వెల రూపాయిన్నర

# స్వవిషయం

తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండడమే "భారతి" ధ్యేయం. తెలుగువారు భారతీయులు దేశంలో వచ్చే పరిణామాల ప్రభావం వారిమీద ఉండకుండా ఎలాగ ఉంటుంది? 1977 లో కేంద్రంలో కాంగ్రెసు పేరుకల పార్టీనడిపే ప్రభుత్వం పడిపోయి జనతా పేరుకల పార్టీ ప్రభుత్వం వచ్చింది. నిజానికి జనతాపార్టీలో ఎన్నో రాజకీయ పక్షాలు, వర్గాలు ఇమిడి ఉండేవి. ప్రధానమయిన కొన్ని వేరుపడిపోవటంతో జనతా బలహీనం అయిపోయింది. 1980 లోకసభ ఎన్నికలలో కాంగ్రెసు (ఇందిర) పార్టీ బాగా గెలిచింది. భారతదేశంలో 1975 జూన్ నుంచి కొన్ని నెలలపాటు వ్యక్తి స్వాతంత్ర్యాలు కొన్ని కుంటుపడి ఆతరువాత కోలుకున్నాయి. ఇది శ్రీమతి ఇందిరాగాంధీ అధికారంలో ఉన్నప్పుడు జరిగింది. 1980 ఎన్నికల ఫలితాలు ఎటువంటి పరిస్థితులకి దారితీస్తాయో చెప్పటం కష్టంకాని ఇంత గొప్ప దేశంలో స్వేచ్ఛ ఎంతోకాలంపాటు అధికారంలోఉన్న కొందరి అదుపులో ఉండిపోలేదు. స్వేచ్ఛ లేనిదే ఉత్తమ సాహిత్యం వెలువడలేదు. సమాజాన్ని మౌలికంగా మార్చివెయ్యాలని చాటే సాహిత్యాభిమానులు కూడా వ్యక్తి స్వాతంత్ర్యాల విలువని గుర్తించగలరని ఆశించాలి.



# విషయానుక్రమణిక

## జనవరి. 1980





# అర్భకుల ఆత్మకథ

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

అనఁగ ననఁగ మా కథ యిది : వెనుక నెపుడొ
వ్యోమపథమున శ్యామ పయోద మొకఁడు
కన్నె మెఱపులు మెఱయు లొల్కరిని చినుకు
చిందులుగ వసుంధరకు వచ్చితిమి మేము.

తొలుదొలుత ధాత్రి పరిదీనగళమునెత్తి
పలుకరించెను సోష్మల స్వాగతముగ;
తనువు మై నార్ద్ర హృదయ కేదారజనని
పొలుపుఁబొత్తిళ్ల నారు మొల్కలము మేము.

చిటి చిట్టి కెరటాల చేతుల మునివ్రేళ్ల
వటపత్ర శయను కూఁకటులు దువ్వి
తరళమ్ములైన దృక్కిరణ కోణములతో
ధ్రువ వలయమ్ము ప్రాఁజవులు పట్టి
చదువుల సర్వస్వసారమౌ ప్రహ్లాద
సాధూక్తి మాధురీస్వాద మెనసి
తొలికబ్బపుంబాట కలన రాల్కరఁగించు
కవ కుశీలవుల సంగడముచేసి

యుగ యుగమ్ములుగాఁ బ్రపంచోత్సవములఁ
బాల్గొనుచు నాడుకొనుచును బాడుకొనుచు
నిభృతరీతి వినోదించు నిర్విషాద
లలితజీవుల మేలి బంతులము మేము.

మా చిన్ని కనుల దోఁబూచులాడితిరేని
బృందావనులు పల్లవించినట్లు
మా చివుర్పెదవులు మనసిచ్చి కదపుచోఁ
గ్రోలవచ్చును పిల్లఁగ్రోవి తేనె
జిలిబిలి కాళ్ల గజ్జెలు మాకుఁ గట్టుచో
నుల్లముల్ గుజ్జనగూళ్లవోవు
మొగమిచ్చి మాతలల్ మూర్కొందు రేనియు
ననుభవంబున కందు నాత్మకళలు

కాకపక్ష మనోజ్ఞావికములు మావి
తేరి తిలకించు మనసు జ్యోతిస్సరస్సు;
ఫలము కడుపారఁగొన్న పిందెలము మేము
కలములు కదల్చు చిట్టడుగులము మేము.

పసరు మొగ్గలు మా బుగ్గపయిని చిదుమ
విక్క విరిసి క్రొందావులు వెల్వరించు
బ్రతుకు టడవుల జీర్ణపర్ణములు డుల్చి
దిమ్మరించెద మమృత వర్షమ్ము దెసల.

గజిబిజిగ నల్లుకొను తాకికంపుగూడు
తొలఁగి బలపడు తలఁపుఱెక్కలము మేము
పరమ భావుకులగు కవీశ్వర గణంబు
చెలఁగి తలఁదాల్చు బాలచంద్రులము మేము.

మిపుల మము నామతించి బుజ్జవము వెఱపు
నలఘుమతులు పెద్దలపేరు నిలుపఁగలము;
నెనరు విడనాడి కఱ్ఱపెత్తనము సేయు
పెద్దలకు చిన్నతనము రప్పింపఁగలము.

బాలకులమని జోలలు పాడి మమ్ము
నిద్రపుచ్చుట కింత యత్నింతు రేని
చెప్పకయ నోటితో రెండు చెవులుపిండి
కోరికలనెల్లఁ దీర్పించుకొందు మేము.

బిరుదములు పెండెరమ్ములు పెట్టఁగోర
మొగిఁ జిరంజీవు లనుట మా కుత్సవంబు;
అభ్యుదయకాంక్షులుగ మమ్ము నాదరించి
ప్రేమ నెఱపుట యొకఁడె శ్రీరామరక్ష.

# తేజోఽవతరణం

## శ్రీ కాసల నాగభూషణం

నీలో,
  నడిరాతిరి నిశ్శబ్దంలో
ఏ అందం ఉందని,
ఏ అనుభూతుల పాటల పల్లవి వినబడుతుందని
ఎదురుచూస్తున్నానో నేనిన్నాళ్ళూ
ఒళ్లంతా కన్నులుగా !
దిగంతాలు వీనులుగా !
మనసు మూలల గుబులు తలపుల రెల్లుపొదల్లో
నా జాలినవ్వను గుడ్డిపువ్వది ఒక్కటయినా పూచినట్టే లేదు.
కాగిపోయిన పేదబ్రతుకుల నేలవాలుల్లో
నీ చూపుచినుకుల తడిసిరేగిన కమ్మతెమ్మెర వీచినట్టే లేదు.
కాని కాలం
క్షణాలనుంచి దినాలలోకి చల్లగా జారుకుంటోంది.
నా అస్తిత్వం
బిందువులోంచి అనంతంలోకి మెల్లగా చేరుకుంటోంది.
కాంక్షారుణమైన పూర్వసంధ్యాప్రభలు కాలి కాలి
ఈ దినమధ్యంలో
విశ్వమంతా వెలిబూదిగా ఆవరించింది
ఎండిన నా కన్నుల కాంతిగోళాలు పెటిల్లున ప్రేలి ప్రేలి
ఈ నిశాప్రకృతిని
వీగిపోని వెన్నెలల మత్తుగా ఆవహించింది.
అయినా ఏం లాభం ?
ఎక్కడ దొరికిందని నాకా
రసమయ దివ్యానుభవానర్ఘరత్నం ?
చీకటి కడుపున పెరిగే
చక్కని వెలుతురు పాపవి నువ్వు.
గాలి తరగల తేలివచ్చే
తేట తెనుగు పల్లెపదానివి నువ్వు.

నిన్ను
నా కంటిపాపల కలుపుకోవాలనీ,
నా పెదవి చివరల నిలుపుకోవాలనీ
ఎంత వెర్రిగా ఆరాటపడ్డానో నేను
అంత దూరంగానూ వెళ్లిపోయావు నానుంచి
దిక్కుల అంచుల్లో
కరిగి కరిగి కన్నీరై జారె నీలిమలోకి,
జారి జారి మున్నీటను కలిసే
అచ్చమైన మంచుబిందువులోకి.
అట్లని
నువ్వింక రానేరావని
ఇంతటితో
ఈ ఎదురు తెన్నుల్ని మానుకోలేను నేను.
ఇక్కడ కూచుని
ఎక్కడో దూరంలో నువ్వున్నావని
వెదకడం పారంభించను.
ప్రేలిన నా కన్నుల గోళాల్లో
నీ అందాన్ని ఆవిష్కరించి,
సాగిన నా పెదాల కదలికలో
ఆ ఆనందాన్ని ఆలాపనగా సాగించి
నిరాశా నిశామగ్న మానవాళికి
నీ ఉనికిని నిజమనిపిస్తాను.
ఆ అరుణారుణ ప్రభాతరాగం
తెలివెలుగుగా
వారి ఎదతలుపుల తెరిచేలా చేస్తాను !
యజ్ఞంలో సమిధలా
ఈ నిండుబ్రతుకు ఆహుతి కానీ ...
ముందు తరాలవారి ముంగిలిలోనయినా
నాకు నీ అవతరణం ముఖ్యం !



## శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# పట్టవర్ధని వంశము

తెలుగు జాతి సంస్కృతికి, భాషకు ఎనలేని గౌరవ ప్రోత్సాహము లందించిన వేంగీ చాళుక్య రాజులను సుస్థిర రాజకీయశక్తిగా ఆవిర్భవింపజేసి కుంతల భూభాగముల నుండి తెలుగునాటికి గొని వచ్చిన ఖ్యాతి నిస్సందేహంగా వారి విజయ యాత్రలదే. అజేయమైన రణపాండిత్యమే వీరిని రణవిక్రముడైన రెండవ పులకేశి కాలమున వేంగినాటికి తరలించి తెచ్చి సుమారు ఆరు వందల యేండ్ల ఆంధ్రావనికి సుస్థిరమైన పాలన కల్పించి తెలుగు సంస్కృతికి పునరుజ్జీవన మొసంగినది. దేవసేనానియైన మహాసేనుని వీరి ప్రశస్తుల్లో పేర్కొనటం, "స్వభుజ విక్రమాక్రాంత మహీభుజమ్" అని శాసనాల్లో చెప్పుకోవటం వీరి రాజ్యవిస్తరణా కాంక్షని సూచిస్తుందంటే అసమంజసం కాదు. అటువంటి యుద్ధ పరంపరల్లో సహాయభూతులుగా వీరికి కొన్ని సామంత కుటుంబాలు తోడ్పడినట్లును, వీరి సహాయ బలసంపత్తులే వేంగీ చాళుక్య సామ్రాజ్యమునకు పెట్టని కోటలని చెప్పుకొనవచ్చును. రాజవంశంలో తఱచుగ నేర్పడే దాయాదుల కలహాల్లో, అంతర్యుద్ధాల్లో యీ సామంత ప్రభువుల పాత్ర గణనీయమైంది. ఉదాహరణకు, మంగళేశుని అంత్యకాలములో రెండవ పులకేశి రాజ్యప్రాప్తికై పెనుగులాడే సమయంలో అతని నా ప్రయత్నమున కృతకృత్యుని చేసినది సామంతులైన ఆనిమహా బప్పర వంశపు రాజులు.[1] అదే విధంగా కుబ్జ విష్ణువర్ధనుడు తెలుగునాట రాజ్యస్థాపనచేయు సందర్భమున ఎన్నో సామంత కుటుంబాల తోడ్పాటు అవసరమైంది. తనతోపాటుగా నతడెందరినో యోధులను, సేనానులను గొనివచ్చి వారి తోడ్పాటుతో వేంగీ రాజ్యస్థాపన మొనరించినట్లును, పిమ్మట వారి వారి సేవకు, ప్రభుభక్తికి ప్రతి చిన్న చిన్న రాజ్య భాగములకు వారి నధిపతుల నొనరించి సత్కరించినట్లును తెలుస్తోంది. ఈ పద్ధతిలో గౌరవింపబడ్డ కుటుంబాల్లో దుర్జయులు, మత్స్యులు మున్నగు వారిని పేర్కొనవచ్చు. గిరి పశ్చిమ సీమలతో దుర్జయుల పాలన క్రింద డెబ్బైమూడు గ్రామాలుంచబడ్డాయి.[2] అదే విధంగా మత్స్య కులాన్కి చెందిన అటవీ దుర్జయుణ్ణి ఒడ్డాది ప్రాంతాల్కి అధిపతిని చేసివుంటారని వూహించటాన్కి అవకాశం వుంది. అటువంటి విశ్వాసయోధ కుటుంబాల్లో పేరు కెక్కిందీ, శాసనాల్లో ప్రముఖంగా కీర్తింపబడ్డదీ—పట్టవర్ధనీ వంశము.

పట్టవర్ధనుల మూలపురుషుడైన కాలకంపుడు, ప్రప్రథమంగా వేంగీ సామ్రాజ్య స్థాపకుడైన కుబ్జ విష్ణువర్ధనుని కాలంలోనే కన్పిస్తాడు. రాజునకు ప్రియానుచరుడైన యీ వీరసేనాని తన ప్రభుని యానతి మేరకు గుజరాతు ప్రాంతమందలి వల్లభరాజ వంశపు దద్దరుని జయించి సంహరించెను.[3] తర్వాతి దశల్లో కుబ్జ విష్ణువర్ధనుడు ఆ ప్రాంతములు వదలి తూర్పునకు తరలవచ్చి తెలుగు సీమలో చాళుక్య పాలనకు శ్రీకారము చుట్టినపుడు కాలకంపుడును తనజేని ననుసరించివచ్చి వేంగినాట స్థిరపడెను. అప్పటి నుండి రాజానుగ్రహ గౌరవమందిన యీతని వంశము కీలకమైన రాజకీయ బాధ్యతలను విశ్వాసముతో నిర్వర్తించుచు తమ ప్రభువుల శ్రేయోభిలాషులై వారి సర్వతోముఖాభివృద్ధికి పాటుపడ జొచ్చిరి.

కాలకంపుని తర్వాత సుమారు మూడు శతాబ్దముల వరకు పట్టవర్ధన వంశము నిర్వహించిన పాత్రల తీరుతెన్నులు స్పష్టముగా తెలియవు. కొయర్తి గండడైన నాల్గవ విజయాదిత్యుని కాలమున కుంతాదిత్యు డనబరగు పట్టవర్ధని బండనాదిత్యు డొకడు ప్రస్తావింపబడినాడు.[4] యుద్ధ రంగములలో వీరవిహారము సల్పి ప్రభువు మన్ననలకు పాత్రుడైనాడు. "ఉగ్ర వెలగాడు"[5] బిరుదముతో పాటుగ మొదటి అమ్మరాజ విష్ణువర్ధనునిచే సేనానిగా పట్టము కట్టబడి 'కీర్తి ప్రతాపాలయునిగా' సన్మానితుడైనాడు. ఈతడు పైన పేర్కొనబడిన కాలకంపుని వంశమున బుట్టిన సోమాదిత్యుని మనుమడు; ప్రిథ్వియరాజు కుమారుడు. ఈ సోమాదిత్యుడు గుణగ విజయాదిత్యుని కాలమునందును, ప్రిథ్వియరాజు మొదటి చాళుక్య భీముని కొలువునందును నియోగాధిపతులై యుండినట్లు తెలియుచున్నది.

కొయర్తిగండ విజయాదిత్యుని మరణానంతరము రాజ్యాధిపత్యము కొరకు వేంగీ రాజ్యమున దాయాదుల పోరు ప్రారంభమై దశాబ్దము పైగా ఏకరవుగా సాగినది. సింహాసన మధిష్ఠించి రాజమహేంద్ర బిరుదాంకితుడైన ప్రథమఅమ్మరాజ విష్ణువర్ధనుని ధిక్కరించి యాతని పినతండ్రియైన రెండవ విక్రమాదిత్యుడు పొరుగువారైన రాష్ట్రకూటుల ప్రేరణతో కొందరి దళాధిపతులను లోబరచుకొని వారి సాయమున రాజ్యమునకై పెనుగులాడసాగెను. ఈ విషయమును అమ్మరాజు శాసనములు బలపరచుచున్నవి. కాని యీ సమయములో స్పష్టముగా నేమి జరిగినదో యూహించుకొను నవకాశము లేదు, కాని ఒక అంతర్యుద్ధము రాజ్యమున ప్రజ్వరిల్లి, అవిశ్వాసపాత్రులు, ద్రోహబుద్ధులునైన సామంతులు, కొందరు దళాధిపతులు శత్రుమూకలతో కల్సి అమ్మరాజు నెదిరించి యుండవచ్చును. కొందరు చరిత్రకారులు పైన పేర్కొనబడ్డ పట్టవర్ధన బండనాదిత్యుని కూడ యీ అస్థిర రాజకీయ పరిస్థితిలో ఎదురుబాటొనరించి శత్రువులతో చేతులు కలిపియుండునని భావించుచున్నారు.[6] కాని యిట్లని చెప్పుటకు నవకాశములు లేవు. పట్టవర్ధన

వంశస్థు లెన్నడును రాజద్రోహమునకు పాల్పడిన ఘట్టములు కన్పింపవు. తమ యేలికల సంకల్పమును పూనికతో నెరవేర్చుటలో ప్రాణములనైన గణనసేయని వీరినట్లు శంకించుట కాస్కారము లేదు. అందును భండనాదిత్యుడు తన తాతతండ్రుల నుండి ప్రభుసేవలో లగ్నమనస్కుడై విశ్వాసపరుడైన యనుచరునిగ చెప్పబడినవాడు. ఈతడు ఏ అమ్మరాజునకు ద్రోహమొనరించి యుండునని పై చరిత్రకారు లూహించిరో ఆ ప్రభువే తన శాసనములో భండనాదిత్యుని యాతని వంశమును ప్రస్తుతించినాడు.[7]

''......... . ............। అస్మత్కుల కల్యాణ ప-
రంపరా నియోగాధికృత పట్టవర్ధని వంశాగ్రణ్యా! కోట(?) కంపైతి విశ్రుతే-
న కుబ్జ విష్ణువర్ధనాను చరేణ సంగ్రామే తదానుజ్ఞాయా। దుర్ధర్ష బలం దట్టర నా-
మానవ్ వినిహత్య త చ్చిహ్నానియేన జగ్రిహిరే! తత్కుల ప్రసూత సోమాదిత్యస్య సూను ర-
నేక యుద్ధ లబ్ద ప్రతాపః ప్రిథివీయ రాజః। తత్సూనుస్స కలారాతి మదచ్ఛేద కరా-
యుధః సేవకో విజయాదిత్య కలియత్యాంక భూభుజః ఆథైషర్ భండనాదిత్యం దృష్ట్వా-
ప్రీతి ముపార్జనం! ప్రాప్తముజ్వలగన్యాకవ్ యంపరే యమ సన్నిభవ్। యోహి। శత్రూణాం
తుములేషు వీరపటహం సంశ్రావ్య జిత్వాబలం కుంతాది త్యేశ్రు తాంకిత మహా-
కీర్తి ప్రతాపాలయః। మచ్చిత్తం పరితోష్య భృత్య సదవీం లబ్ధ్వా ప్రసాదగంటః స్ఫితా-
నేక బలారి భూప విజయాశ్రీ జన్మ బాహూన్నతిః। .. ... ....................''

— దీనినిబట్టి యా విపత్కర పరిస్థితులలో యీ పట్టవర్ధనులు తమ జేనికి బాసటగా నిల్చి దాయాదుల యాటోపమణగించి విప్లవ మణచి ప్రభుని గౌరవాదరములకు పాత్రమైరని తెలియు చున్నది. ఈ సందర్భముననే సంతుష్ట మనస్కుడైన అమ్మరాజు భండనాదిత్యుని తనసర్వ సైన్యాధ్యకుని నభిషేకించి, గుంటూరు నగరమునకు కందేరు వాటి విషయములోని మరి పన్నెండు గ్రామములను జతచేసి యాతని నధిపతిని జేసెను.

తరువాత, యీ భండనాదిత్యుని సంతతిని గూర్చి మనకేమియు తెలియదు. కాని మరల రెండవ అమ్మరాజు విజయాదిత్యుని కాలమున పట్టవర్ధని వంశ ఏకునిగ 'పమ్మవ' కుమారుడైన 'బల్లాలదేవ వేలభట బొడ్డియ' ప్రస్తావింపబడినాడు.[8] ఈతనికి కృష్ణానది తూర్పు తీరమున ప్రభువుచే కొన్ని భూములీయబడినవి. వీరును, భండనాదిత్యుడును ఒకే వంశస్థులైనను వారి పరస్పర సంబంధ బాంధవ్యము లెట్టివో చెప్పుట కాధారములు లేవు. బల్లాలదేవుని తల్లి 'పమ్మవ' యనుట తప్ప తండ్రి విషయము చెప్పబడలేదు. దీనినిబట్టి కొందరు చరిత్రకారులు 'పమ్మవ' అవివాహిత యనియు వంశానుగతముగ రాజాంతఃపురమున చరించు వార విలాసిని యగునని యూహించినారు.[9] అది సత్యమైనను కాకున్నను ఒక్క విషయము స్పష్టముగా తెలియుచున్నది. రెండవ అమ్మరాజు యీ బల్లాలదేవుని మిక్కిలి యాదరముతో గౌరవించుచుండెను. తన మచిలీపట్నపు శాసనములో యీ పట్టవర్ధని బల్లాలదేవుని యువరాజుగ నభిషిక్తు నొనరించినట్లు పేర్కొనెను. గజదళము పైనను, రెండువేల యాశ్విక దళముపైనను దండనాయకుని జేసెను. శ్వేతబలక పింఛాది నానావిధ రాజలాంఛనము లొసగి సత్కరించెను.[10] ఒక భృత్య కుటుంబమైన పట్టవర్ధనుల కిట్టి యనూహ్యమైన గౌరవము లభించుట అసాధారణమైన విషయము. ఈ బల్లాలదేవుడు అమ్మరాజ విజయాదిత్యుని శాసనముల కాజ్ఞప్తిగా నుండినట్లు శాసనములు తెల్పుచున్నవి.[11]

పట్టవర్ధనులు శౌర్యపరాక్రమము లందును, రాజకీయ గణతంత్రము నందును మాత్రమేగాక మతోద్ధరణ యందును, ఆలయ నిర్మాణాది కార్యములందును పేరెన్నికగన్న పాత్ర నిర్వహించుట గుర్తింపదగినది. అత్తిలి నాండు విషయములోని కలుచుంబఱ్ఱు గ్రామము అడ్డకలిగచ్ఛవెలహారి గణమునకు చెందిన అర్హనందియను జైన గురువునకు దానమీయబడినది. ఇది 'సర్వలోకాశ్రయ జిన భవన' మనబరగు జైనాలయమున కనుబంధముగా నుండిన అన్న సత్రపు బాగుసేతకై నిర్దేశించి యొసగ బడినదానము. దీనికర్త అర్హనంది శిష్యురాలైన, పట్టవర్ధని వంశసంభవయైన చామెకాంబ. సౌందర్య యౌవనవతియైన యీ చామెకాంబ, రెండవ అమ్మరాజ విజయాదిత్యుని ప్రియవారకాంత యని తెలియుచున్నది! ఈమెను గూర్చి శాసనములో —[12]

''......॥. శ్రీరాజ చాలుక్యాన్వయ పరివరిత పట్టవర్ధి కాన్వయ తి-
లక! గణికాజన ముఖ కమల ద్యుమణి ద్యులిరిహహి చామెకా —
ంబా భూత్సా॥ జిన ధర్మ జల వివర్ధన ... ... ... ... ...
... ... . ... ... ... ... ... ... ...''

— అని చెప్పబడినది. 'జైన శ్రావకి'గా మారుటకుముందు విలాస జీవనము గడిపియుండుననియు, 'అర్హనంది' బోధలచే శ్రావకియై 'కలుచుంబఱ్ఱు' గ్రామమును దానమిచ్చినట్లును తెలియు చున్నది.

బాదవుని 'ఆరుంబాక శాసనము'లో చందెనుని తల్లిగా నొక సామెకాంబ తెల్పబడినది.[13] ఈమె చామెకాంబ యగునేమో పరిశీలింపవలసి యున్నది. ఈమెయు చామెకాంబయు నొక్కరే యగు నెడల పట్టవర్ధన వంశ చరిత్రలో నీ ఆరుంబాక శాసనము కొన్ని క్రొత్త విషయములను బయల్పరచును. ఈ శాసనకర్త ప్రముఖ అస్త్రవిద్యా పారగుడైన గండ నారాయణుడు; కొల్లేరు ప్రాంతములు పాలించిన నృపకాముని కుమారుడు. ఈ గండ నారాయణుని సహో

దరియే అమ్మరాజ విజయాదిత్యుని భార్య.[14] ఈమె నృపకాను నాయమాంబల కుమార్తె. కాని కొందరు పరిశోధకులు ప్రమాదవశమున నాయమాంబయే అమ్మరాజు భార్యయని పొరపడిరి.[15] కాని నృపకామ, నాయమాంబల కుమార్తెయైన, గండ నారాయణుని సోదరియే అమ్మరాజ భార్య. ఈ నాయమాంబనైన పేర్కొనిన ఆరుంబాక శాసనములోని సామెకాంబకు తోబుట్టువు. ఈ సామెకాంబయు, కలుచుంబఱ్ఱు శాసనములోని చామెకాంబయు ఒకటిగ గుర్తించుట కభ్యంతరము లేనియెడల సరసీపుర రాజకుటుంబముతో వీరి సంబంధ మీరీతిగ నుండును.




—ఇట్లు చూచిన యెడల చామెకాంబ, అమ్మరాజ విజయాదిత్యునకు చిన్నత్త గారగుచున్నది. కాని కలుచుంబఱ్ఱు శాసనమున రాజునకు ప్రియకాంతయని చెప్పకొన్నది. అందుచే యీ చామెకాంబ, సామెకాంబ లొక్కరగుదురో, కాదో సంశయగ్రస్తమైన విషయము. కాని యీ భండనాదిత్య, చందెనలు తమ కత్యంత సన్నిహిత బంధువైన అమ్మరాజును రాజ్యభ్రష్టు నొనరించి తుదముట్టించుటలో ప్రముఖ పాత్ర నేంవహించిరో, ఏ కుటుంబ కలహములు వారినీ విధముగా మార్చినవో తెలియదు.

పట్టవర్ధనులకు లలితకళ లందభిరుచియు, గాంధర్వ నాట్యవిద్యలందు ప్రావీణ్యమును కలవని తెలియుచున్నది

''సమస్త గాంధర్వ విద్యావేదిః'' యగు 'చెల్లవ'యను వారవిలాసిని యొకతె చాళుక్య భీముని యాస్థానమున వర్తిల్లెనట.[16] సంగీత నాట్యములందెనలేని మేటియైన యీమె తుంబురు సమానుడైన మల్లపుడను సంగీతవిద్వాంసుని కుమార్తె; అసమాన సౌందర్యరాశియని గణుతికెక్కిన 'తుండక'కు మనుమరాలు ఈమె పట్టవర్ధని వంశమునకు చెందినదగునో, కాదో శాసనములందు ప్రస్తావింపబడలేదు. కొందరు పరిశోధకులు మాత్రము వీరిని పట్టవర్ధని వంశమునకు చెందిన వారిగా గుర్తించినారు.[17] అట్లు గుర్తించుటకు వారికున్న ఆధారములు తెల్పబడలేదు. ఇట్టిదే చాళుక్యభీముని దాదియైన 'నాగిపోతి' విషయము కూడ. ఈమె చాళుక్య భీముని సైన్యాధ్యక్షుడైన 'మహాకాలుని' తల్లియైన 'గామకాంబ' తల్లి. చాళుక్య భీముడు గామకాంబతోపాటుగా నాగిపోతి స్తన్యము గ్రోలెడివాడట. బహుశః యీ పెంపుడుతల్లి పైనున్న గౌరవాదరముల తోడనే మహాకాలుని అట్టి యున్నత పదవికి గొని తెచ్చియుండును.

కాని అది కేవల ప్రేమానుగ్రహము కాదేమో. మహాకాలుని ... సమర్థతతో సాహసమే ... గ్రహించి రాజకుటుంబ ... అంతరంగికు డయ్యెను. చాళుక్య భీముని జీవితానంతరము కూడ మహాకాలుని సేవలు స్మరింపబడినవి. ఈతని ప్రభుభక్తి ... అమ్మరాజ విష్ణువర్ధనుడితనికి దుర్జారు గ్రామమును ప్రదానంచెను.[18]

ఇట్లు పట్టవర్ధనులు వేంగీ చాళుక్య చరిత్రలో ప్రతి ఘట్టమందును ఒక ప్రత్యేక పాత్ర వహించి, అపరిమిత స్వామిభక్తి ప్రభువులను సేవించి వారి మన్ననలకు పాత్రులైనారు. ఈ వంశ పురుషులు, సైన్యాధ్యక్షులుగను, యోధులుగను ... సామ్రాజ్య విస్తరణకు, సుస్థిరతకు పాటుపడితే, స్త్రీలు సంగీత నృత్యాల్లో వాసిగాంచి రాజులలో కప్పమెప్పి మత ... నిర్మాణాదులకు కారణభూతులయ్యేవారు. భక్తి శ్రద్ధలతో వీరు తమని సేవించిన విధాన్ని చాళుక్య చక్రవర్తులెవ్వరూ మరువలేదు. వేంగీ చాళుక్యల విజయ పరంపరకి, సుస్థిర పాలన ..., సమున్నతమైన రక్షణ కల్పించే యోధులందరిలో పట్టవర్ధనులు ... కంగా తమ కభిమాన పాత్రులని అమ్మరాజు ... నిజంగా, తెలుగు నేలలో సుస్థిరపాలన కల్పించి, సాహిత్య సంస్కృతి రంగాల్లో తెలుగు భారతికి పునరుజ్జీవనం ప్రసాదించిన చాళుక్య ప్రభువుల చరిత్రలో అంతర్లీనమైన పట్టవర్ధనులు తమ ప్రభువుల ఆదర్శాల కోసం ముందునిల్చి సేవించిన ధన్యులు.

## అధోజ్ఞాపికలు

1. ''వేంగీ చాళుక్యుల చరిత్ర''—భావరాజు వేంకట కృష్ణారావు పే. 77.
2. ఎపిగ్రాఫియా ఇండికా. వాల్యూం VI. పే. 268.
3. ఎపిగ్రాఫియా ఇండికా. వాల్యూం. VII. పే. 177.
4. ఇండియన్ ఏంటిక్వరీ. వాల్యూం. XIII పే. 51.
5. ,, ,, ,, II. పే 175.
6. తెలుగు సంస్కృతి. వాల్యూం III పే.157; వేంగీచాళుక్య చరిత్ర...(N. V. రమణయ్య) పే 189; వేంగి చాళుక్య చరిత్ర...(B. V. కృష్ణారావు) పే. 234.
7. ఇండియన్ ఏంటిక్వరీ వాల్యూం. XIII. పే. 51.
8. ,, ,, ,, VIII పే. 74; ఎపిగ్రాఫియా ఇండికా . వాల్యూం. V పే. 139.
9. వేంగీ చాళుక్య చరిత్ర...(B. V. కృష్ణారావు) పే. 280
10. ఇండియన్ ఏంటిక్వరీ...వాల్యూం. XIII. పే. 213.
11. ,, ,, ,, XIII. పే. 248.
12. ,, ,, ,, VII. పే. 177.

13 ఎ. ఆర్. ఇ. నెం. 16. సం. 1920-21; ఎపిగ్రాఫియా ఇండికా...వాల్యూం XIX. పే. 137.

14 ఇండియన్ ఏంటిక్వరీ . వాల్యూం. XIII. పే. 249.

15 తెలుగు సంస్కృతి వాల్యూం. III. పే. 158.

16 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. వాల్యూం. II. పే. 241.

17 వేంగీ చాళుక్య చరిత్ర (B. V. కృష్ణారావు) పే. 294.

18 ఇండియన్ ఏంటిక్వరీ. వాల్యూం. VIII. పే. 77; ఎపి గ్రాఫియా ఇండికా. వాల్యూం V. పే. 131.

# "హెచ్చుతరగతి ప్రయాణీకులు వేచియుండు గది"

## శ్రీ ఆత్మకూరి కామేశ్వరరావు

గ్రీవుదు కక్కుతున్న కాలకూట విషంలా
వర్షం కారులోంది కారుమేఘాల్లోంచి.
పద్దెనిమిది గంటలా పదినిముషాలకు రావాల్సిన రైలు
'ఎనిమిది గంటలు లేటు' అని
నోటీసు బోర్డులో రాయబడింది.
'హెచ్చుతరగతి ప్రయాణీకులు వేచియుండుగది'లో
చికెన్ జాయింట్లు మునిపళ్ళతో చీల్చి నంజుకుంటూ
సేర్వాలో ముంచుకొన్న చపాతీలు తింటున్నారు
ధనలక్ష్మి గారాబు బిడ్డలు.
ఆలస్యంగా రాబోయే రైలుకు టిక్కెట్లివ్వనందున
ప్లాట్‌ఫారం టిక్కెట్లు కొనుక్కోలేక
అండర్‌గ్రౌండ్‌వేలో పై కండువాలు పరుచుకొని
వెన్నెముకల కంటుకుపోయిన పొట్టలపైన'
చేతులు పెట్టుకొని నిద్రపోతున్నారు
పెద్దమ్మ సంతానాలు.
పెద్దమ్మ బిడ్డల జేబుల్ని
తమ స్వంతం చేసేసు కుంటున్నారు
వాళ్ళ వేలు విడిచిన మేనమామ కొడుకులు.
మేనమామ కొడుకుల సంపాదనలో
వాటాలు కుదరక అత్తగారింటికి రమ్మంటున్నారు
అశోకుని ధర్మచక్రాల టోపీలు ధరించిన చట్టరక్షకులు.
రావాల్సిన రైలు రానేలేదు.
కొత్త రైలేదో రాబోతోందని
అందులో టిక్కెట్టు లేకుండానే అందరూ ఎక్కిపోవచ్చని
సామాన్లుమోసే కూలీలు అందర్నీ కేకలేస్తున్నారు.
అందరూ ప్లాట్ ఫారం మీదికి చేరుకున్నారు.
రైలొచ్చి ఆగింది.
బోగీలమీద తరగతులపేర్లు రాసియుండబడలేదు.
బిలబిలా అందరూ అన్ని పెట్టెల్లోనూ ఎక్కేశారు
హెచ్చు తరగతి ప్రయాణీకులు
తామెక్కవలసిన హెచ్చు తరగతి కంపార్టుమెంటు కనబడక
అటూ యిటూ పరుగు లెత్తారు
తమ ప్రత్యేక బోగీలను రద్దుచేసిన రైల్వేవాళ్ళను
తిట్టుకుంటూ.

గార్డు పచ్చలైటు వూపాడు.
రైలు కదిలింది.
కలవరపడ్డ హెచ్చుతరగతి ప్రయాణీకులు
పరుగెత్తి పరుగెత్తి ఏ పెట్టెలోనూ ఎక్కలేక
కళ్ళు తేలేసి ప్లాట్ ఫారంమీదే నిలబడిపోయారు.
కరెంటుపోయింది.
మళ్ళీ వొచ్చింది.
హెచ్చుతరగతి ప్రయాణీకులు ఉసూరుమంటూ
వెనక్కిమళ్ళారు హెచ్చుతరగతి ప్రయాణీకులు
వేచియుండు గదికి —

కాని
ఆ గదికి తాళం వేయబడింది.

శ్రీ ధర్మపురి శేషగిరిశర్మ

# పౌరాణిక దిలీపునకు కాళిదాసుని అలంకారము

పద్మపురాణము షష్ఠోత్తర ఖండము ఉత్తరార్ధమున 202, 203 అధ్యాయములలో సూర్యవంశ క్షత్రియులందు సుప్రసిద్ధుడైన దిలీపమహారాజు చరితము కలదు. దానియందు దిలీపునకు అపుత్రత—వసిష్ఠు నాశ్రయించుట—అతడు ధ్యానముచే సంతతి, ప్రతిబంధమును కనుగొనుట—తత్పరిహారముగ కామధేను సేవను నియమించుట—దిలీపుని గోసేవ—మాయా మృగేంద్రమును సృష్టించి దిలీపుని పరీక్షించుట అతని చిత్తస్థైర్యము నందిని యనుగ్రహమున పుత్రోత్పత్తి—ఈ విషయములు పద్మపురాణమున పై రెండధ్యాయములందు సుమారు 150 అనుష్టుప్పులలో వ్రాయబడినవి.

ఈ యంశములనే తీసికొని రఘువంశ కావ్యములో మహాకవి కాళిదాసు ప్రథమ సర్గయందు 85 అనుష్టుప్పులను, ద్వితీయసర్గయందు 75 ఉపజాతి వృత్తములను, తృతీయ సర్గయందు 13 వంశస్థ వృత్తములను రసభావ బంధురముగా చిత్రించెను. హితైషియగు మిత్రునివలె పురాణము ఒక ఇతివృత్తము నందించును. దానిని చదువరియందు కలిగెడి హృదయ పరివర్తనమును అతనికే వదలివేయును. కావ్యము అటులకాదు. ఈ విషయమునే రసభావములతో రంగరించి, అలంకారములలో అందగించి ఇంపగు పద బంధముతో మధుర ధ్వనితో చతుర వాగ్విలాసములో ప్రియురాలివలె పఠిత కందించును. సహృదయుడైన పఠిత తద్వాక్యములకు తలయొగ్గి తదుపదేశమును శిరసావహించును. మహాకవి కాళిదాసు పద్మపురాణమును పద్మాకరముగ నెట్లు మలచెనో పరికింతము.

**202 అధ్యా. పద్మ పురాణము**

వైవస్వత మనోర్వంశే
దిలీపో భూభుజాం వరః।
ఆసీత్ప్రాచీన బర్హిస్సు
స్వాయంభువ మనోరివ॥

**రఘువంశము 1 సర్గ**

వైవస్వతో మనుర్నామ
మాననీయో మనీషిణామ్।
ఆసీన్మహీక్షితామాద్యః
ప్రణవశ్ఛందసామివ॥
తదన్వయే శుద్ధిమతి
ప్రసూతశ్శుద్ధిమత్తరః।
దిలీప ఇతి రాజేన్దు
రిన్దుః క్షీరనిధావివ॥

'స్వాయంభువ మనువునకు ప్రాచీన బర్హి జన్మించినటుల వైవస్వతమను వంశమున దిలీపుడను రాజచంద్రు డుదయించెను' అని ఒక సాధారణమైన ఉపమానములో దిలీపుని పుట్టుకను పద్మపురాణము అందించెను.

రసాలంకార నిర్మాణ చతుర చతురాననుడు శ్రీ కాళిదాసు మనోహరములైన రెండు ఉపమానములతో దిలీపుని జన్మకథను నివేదించెను. పండితులకు పూజనీయుడైన వైవస్వతుడను మనువు ఉండెను. వేదములకు ఓంకారమువలె అతడు రాజులలో మొదటివాడు. ఇచట ప్రణవదృష్టాంతము అనేక పవిత్ర భావములను స్ఫురింపజేయును. సహజముగ పవిత్రమైన ఆ వంశమునందు మిక్కిలి పవిత్రుడైన దిలీపుడు క్షీరసముద్రమునుండి చంద్రునివలె ఉదయించెనట. సూర్యవంశము క్షీరార్ణవమువలె పరిశుద్ధము, అందుండి ఉదయించు చంద్రుడు అతి పవిత్రుడు. అట్టివాని పోలినవాడు దిలీపుడు అని వర్ణించిన కాళిదాసుని ఉపమానము సర్వతో ముఖ సుందరము.

మగధ రాజపుత్రిక సుదక్షిణాదేవి అతని పట్టపురాణి. ఆమె యింద్రునకు శచీదేవివలె భక్తిమతియై యుండెను. కథాకథనము ప్రారంభించెనే కాని పద్మపురాణము దిలీపుని వర్ణింపలేదు. కాని కాళిదాసు చేపట్టిన రాజును ఊరక విడుచునా? ఎంత మనోహరముగ వర్ణించెనో చూడుడు:—

"వ్యూఢోరస్కో వృషస్కంధః" అని మొదలుపెట్టెను. విశాలవక్షము, ఉన్నత భుజములు, అజానుబాహువులు, తగిన ఒడ్డూ పొడవూ కలిగి మూర్తీభవించిన క్షత్రధర్మమువలె ఉన్నట్లుండెను. ప్రతాపముచే భయంకరుడై, కరుణచే ప్రేమపాత్రుడైయున్న ఆ రాజు సముద్రునివలె ఉండెనట. సముద్రుని లోనయందున్న రత్నముల కొరకు సమీపింపదగి, జలజంతువుల వలన భయంకరుడుగా నుండును కదా! ఇది అనితర సాధారణమైన ఉపమానము. అతని పరిపాలనమున ప్రజలు ధర్మమును గీటుదాటరైరి. వారి వర్తనము చక్రపుగాటిలో బండ్లవరుస నడచినట్లుండెను. దిలీపుడు పన్నులు వసూలు చేయుట వేయిరెట్లు ఖర్చుపెట్టుటకే అదిచూడ సూర్యుడు గ్రీష్మమున పీల్చిన నీటిని వర్షాకాలమున వేయిరెట్లు వదలినట్లుండెను. జ్ఞానమున్నను మౌనము, త్యాగమున్నను ప్రశంసా విముఖత, శక్తియున్నను ఓర్పు ఇట్టి విరుద్ధ గుణములు అతనికి సహజముగా

నుండెను. ప్రజలకు విద్య రక్షణ పోషణ ఇచ్చుటవలన అతడే ప్రజలకు తండ్రియయ్యెను. దేహమిచ్చినవారు నామమాత్రపు తండ్రులైరి. అట్టి దిలీప మహారాజు కులపర్వతములు ప్రాకారమై, సముద్రము అగడ్తయై యున్న భూమండలములను ఒక్క పట్టణమువలె పాలించుచుండెను.

| ప ద్మ. | ర ఘు. |
|---|---|
| మగధాధిపతేః పుత్రీ<br>మహిషీ తస్య భూపతేః।<br>సుదక్షిణాఖ్యయాఖ్యాతా<br>శచీవాసేద్దివస్పతేః॥ | తస్య దాక్షిణ్య రూఢేన<br>నామ్నామగధ వంశ జా।<br>పత్నీ సుదక్షిణే త్యాసీ<br>దధ్వరస్యేవ దక్షిణా॥ |
| ఆ రాజునకు మగధరాజ పుత్రిక సుదక్షిణ పట్టమహిషి. ఆమె యింద్రునకు శచీదేవివలె అనురూపము నుండెను. | దిలీపునకు మగధవంశస్థురాలగు సుదక్షిణాదేవిభార్యయై యుండెను. దాక్షిణ్య గుణముచేత ఆమెపేరు సార్థకమయ్యెను. యజ్ఞపురుషునకు దక్షిణాదేవివలె ఆమె అతనికి అర్ధాంగి యయ్యెను. |

సుదక్షిణా వర్ణనము మూలమునలేదు. అనువాదమునను లేదు. దిలీపుడు సంతాన హీనతవలన దుఃఖపడుట, ఏ దోషమువలన కలుగలేదో దానిని త్రికాలజ్ఞులగు వసిష్ఠులే చెప్పగలరని తలంచుట పద్మపురాణములో—విపులముగా—

"ఏవం ధర్మార్థకామా మే యథాకాలం నిషేవితాః
మహిష్యాం కేన దోషేణ జాయతే మే న సంతతిః"

అని స్పష్టముగా వ్రాయబడినది.

దీనినంతయు కాళిదాసు —

"తస్యామాత్మానురూపాయా మాత్మజన్మ సముత్సుకః
విలంబితఫలైః కాలం స నినాయ మనోరథైః"

అను పద్యములో సూచించెను. ఇంకా చూతము ఇంకాచూతము అని చాల రోజులు గడపినట్లు ధ్వనించుచున్నది.

పిమ్మట దిలీప దంపతులు రథముపై కొన్ని దినములు ప్రయాణముచేసి వసిష్ఠాశ్రమము చేరిరని —

"కతివిద్వా సర్వైర్మార్గముల్లంఘ్యైక రథేస్థితే।
తా దంపతీ గురోస్సాయ మాశ్రమం ప్రాపతుశ్శుభః॥"

అని చెప్పినదే కాని పద్మపురాణము త్రోవలోని విశేషములను చూపలేదు. కాళిదాసుని కమనీయ కల్పనను చూతము :—

స్నిగ్ధగంభీర గర్జనముగల వర్షాకాలపు మేఘమును ఐరావతము విద్యుల్లత అధిష్ఠించినటుల గంభీర ధ్వనిగల యొకరథముపై కూర్చొని రాజదంపతులు వసిష్ఠాశ్రమమునకు పయనించిరని పది పద్యములుగల యొక "కులక"మును రచించెను. వారికి సోకిన మందమారుతము, బారులు తీరిన నెమలిపిండులు, తలయెత్తి నేత్రసాదృశ్యము చూచుచున్న లేళ్లగుంపులు, ఆకసమున తోరణముకట్టిన కొంగవరుసలు, పల్లెలనుండి కాచిన నేయి కానుకగా తెచ్చిన జానపదులు ఈ కులకములో మనోహరముగా వర్ణింపబడిరి. ఆశ్రమము చేరుట—వశిష్ఠుని కుశల ప్రశ్నములు సమానముగా నడచినవి. పిమ్మట—

"తమాతిథ్య క్రియాశాన్త రథక్షోభ పరిశ్రమమ్"

అని కాళిదాసు ఆతిథ్యముతో బడలిక తీరిన దిలీపుని ప్రశ్నించెనని చెప్పుచు ఆతిథ్యమునకు ప్రాధాన్య మీయలేదు. పద్మ పురాణమున "యోగ ప్రభావోప నల్తైః నృపంభోజ్యైర భోజయత్" అనుచు తపో మహిమచే లభించిన భక్ష్య భోజ్యములతో రాజున కాతిథ్య మిచ్చెనని వ్రాయబడెను.

పిమ్మట దిలీపుడు పుత్రహీనత వలన కలిగిన విషాదమును నివేదించుటలో కావ్య—పురాణ రీతులను చూతము.

| ప ద్మ. | ర ఘు. |
|---|---|
| కస్యేదం జగతీ రాజ్యం<br>భవిష్యతి గురో వద।<br>తస్మాదపత్య హీనస్య<br>రాజ్యేపి మమ తిష్ఠతః॥ | కింతు వధ్వాంత వైతస్యాం<br>అదృష్ట సదృశ ప్రజమ్।<br>నమామవతి సద్వీపా<br>రత్నసూరపి మేదినీ॥ |
| స్వామీ! నేనిప్పుడు రాజ్యమందుఉన్నను సంతాన హీనుడనుగాన ఇది ఎవరికి చెందునో కద! | స్వామీ! ఈ మీ కోడలియందు తగినసంతానము లేనందున సప్తద్వీప సమన్వితయై రత్నము లొసంగు భూమికూడ నన్ను రక్షింపకాలకున్నది. |

పద్మపురాణ వచనము సాధారణ ప్రశ్నవలె నున్నది. కాళిదాస వచనము ఆత్మీయతను కలిగించుచున్నది. తరువాత పుత్రహీనతను గూర్చి జాలి కలిగించునటుల ఆరు శ్లోకములను కాళిదాసు రచించెను. శిష్యవత్సలుడైన వసిష్ఠునకు అంతగా చెప్పబని వేడుకొని శ్రోతలకు కరుణరస ముదయించుటకై రసికాగ్రణియైన కాళిదాసు అటుల రచించెను. కావ్య—పురాణములలోని భేద మిట్టిదియే కద!

దిలీపుడు ఇంద్రుని యొద్ద నుండి వచ్చుచు నందినీ ధేనువు పట్ల చేసిన అపచారము సమానముగనే చెప్పబడినది. గో సేవను బోధించుచుండగనే నందినీధేనువు వచ్చెనట.

| ప ద్మ. | ర ఘు. |
|---|---|
| ఇత్యుక్తవతి తత్రర్షౌ<br>వసిష్ఠే సాతు నందినీ<br>తపోవనాత్సమాయాతా<br>వత్స స్నేహస్తు తస్తనీ | ఇతివాదిన ఏవాస్య<br>హోతు రాహూతి సాధనమ్।<br>అనింద్యా నందినీ నామ<br>ధేను రావవృతే వనాత్॥ |

దాని సేవించు విధానము రెంటియందు సమానముగనున్నను ఉక్తి వైచిత్ర్యము చూడదగినది.

| | |
|---|---|
| అథోషసి నరాధీశః | అథ ప్రజానా మధిపః ప్రభాతే |
| పూజితాం కుసుమాదిభిః | జాయాప్రతిగ్రాహిత గంధ |
| మహిష్యా నందినీ ధేనుం | మాల్యామ్. |
| నీత్వాఽరణ్యం జగామ సః | వనాయ పీతప్రతి బద్ధ వత్సాం<br>యశోధనో ధేనుమృషేర్ముమోచ |
| గచ్ఛంతీమనుతాం దేవీం<br>ఛాయేవ నృపతిర్యయౌ | స్థితఃస్థితా ముచ్చలితః<br>ప్రయాతాం |
| ఛాదన్తీ మనుశప్తాది<br>సోపి మూల్యాద్య భక్షయత్ | నిషేదుషీ మాసన బంధ ధీరః<br>జలాభిలాషీ జలమాద దానాం<br>ఛాయేవతాంభూపతి రన్వగచ్ఛత్॥ |
| తరుచ్ఛాయా ముపాసీనాం<br>అనుసోప్య పవిష్టవాన్<br>పి బన్తీమను పానీయం<br>రాజాపి సలిలం పపౌ | |
| సచరాజా మృదుగ్రాసైః<br>దంశాపనయనేన చ | ఆస్వాదవద్భిః కబళైస్తృణానాం<br>కండూయనైర్దంశనివారణైశ్చ। |
| కండూయనైః కామధేనుం<br>గురోరేవ మసేవత | అవ్యాహతైః స్వైరగతైశ్చ<br>తస్యాః<br>సమ్రాట్ సమారాధన తత్పరో<br>భూత్॥ |
| అథ ప్రత్యాశ్రమం సాయం<br>న్యవర్తత మహీపతేః।<br>ఉంగం పవిత్రయంతీ సా<br>ఖురోద్ధూతై రజఃకణైః॥ | సంచారపూతాని దిగంత రాణి<br>కృత్వాదినాంతేనిలయాయగంతుం<br>ప్రచక్రమే పల్లవ రాగతామ్రా<br>ప్రభావ తంగస్య మునేస్సధేనుః |

దిలీపుడు నందినికిఛాయవలె సంచరించినటుల ఇచటకావ్యము కూడ పురాణమునకు ఛాయవలె నున్నది. కాని అనుష్టుప్ శ్లోకము లను గానానుకూలమ్మైన ఉపజాతిలో రచించి నూతన శోభ తెచ్చెను. దిలీపుని యందు అలౌకిక మహిమాన్వి తత్వమును దర్శించుటకై కాళిదాసు పెంచిన వర్ణనము హృదయంగమము. అడవియందు దిలీపు డడుగిడిన వెంటనే —

''శశామ వృష్ట్యాపి వినా దవాగ్నిః
ఆ సీ ద్విశేషా ఫల పుష్పవృద్ధిః''

వర్షము కురియకయే కార్చిచ్చు చల్లారెను. లతా వృక్షములకు ఫల పుష్పములు వర్ధిల్లెను. ఇట్టి యుదాత్త వర్ణనము రఘు వంశము లోని ప్రత్యేకత. అచంచల దీక్షతో దిలీపుడు 21దినములు గోసేవ చేయగా ఆ దేవ గోవు రాజును పరీక్షించు ఘట్టము చూతము.

| పద్మ. | రఘు. |
|---|---|
| ఆరాధయతి తా మేవం<br>దిలీపేతు దృఢవ్రతే<br>ఏకాధికా వ్యతీయాయ<br>దినానాం (వైశ్య!) వింశతిః | ఇత్థంవ్రతంధారయతః ప్రజార్థం<br>సమం మహిష్యామహనీయకీర్తేః<br>సప్తవ్యతీయు స్త్రిగుణాని తస్య<br>దినాని దీనోద్ధరణో చితస్య॥ |
| అథ భూమిపతే స్తస్య<br>భావ జిజ్ఞాసయా తు సా<br>వివేశ నిర్భయ స్స్వాన్తా<br>సశష్పం హిమవద్గుహామ్. | అన్యేద్యురాత్మాను చరస్య భావం<br>జిజ్ఞాసమానా మునిహోమధేనుః<br>గంగా ప్రపాతాన్త విరూఢశష్పం<br>గౌరీగురోర్గ హ్వరమా వివేశ॥ |

పై దెల్పిన విషయము సమానమే కాని కావ్యశైలి మనోహరము.

పిదప మాయామృగేంద్రము పైబడుట, నందిని యాక్రం దనము చేయుట, దానిపై బాణము ప్రయోగింపబోవ దిలీపుని హస్తము స్తంభించుట ఇవియన్నియు చిత్రించిన కాళిదాసు పద్యములు పద్మపురాణమును తొంగి చూచుచున్నవి.

| పద్మ. | రఘు. |
|---|---|
| పశ్యతా హిమవత్సాను<br>శోభామథ మహీభృతా।<br>అలక్షితాగ మస్సింహో<br>బలాజ్జగ్రాహ నందినీమ్॥ | సాదుద్రుష్టధర్షా మనసాపి హింస్రైః<br>ఇత్యద్రి శోభా ప్రహితేక్షణేన।<br>అలక్షితాభ్యుత్పతనో నృపేణ<br>ప్రసహ్య సింహః కిలతాంచకర్ష॥ |
| తదాక్రందిత మాకర్ణ్య<br>తస్యాస్సా జగతీపతిః।<br>హిమవత్సాను సంలగ్నాం<br>నిజదృష్టిం న్యవర్తయత్॥ | తదీయ మాక్రందితమార్త సాధోః<br>గుహానిబద్ధ ప్రతిశబ్దదీర్ఘమ్।<br>రశ్మిష్వి వాదాయ నగేంద్ర సక్తాం<br>నివర్తయామాస నృపస్య దృష్టిమ్॥ |

ధేనువుపైనున్న సింహమునుచూచి దిలీపుడు వ్యథితుడై బాణమును తీయబోగా ''జడీభూత సమస్తాంగః'' అని సర్వావ యవములు మొద్దుపారెనని పురాణము చెప్పగా ''చిత్రార్పితారంభ ఇవావతస్థే'' బాణము తీయబోవుచున్నటుల గీచిన బొమ్మవలె నిలువబడిపోయెను అని కావ్యము హృదయంగమముగా ఆడించెను.

తరువాత సింహము తాను శంకరుని కింకరుడననియు తన పేరు కుంభోదరుడనియు, పార్వతీదేవి కుమారునివలె పెంచి యా దేవదారువును ఒక వనగజము రాచుకొనగ దీని బెరడు వలు గుట, ఆమెకు కోపమువచ్చి తనను కాపలా పెట్టుట, దీనిజోలికి వచ్చిన ప్రాణిని ఆహారముగా గొనుమని దేవి చెప్పుట ఇవి మానుష వాక్కుతో సింహముచే పలికించుట ఉభయమున తుల్యము. కాని కావ్యశైలి యన్యాదృశము. సింహవాక్య ప్రారంభముననే కావ్యమున—

''అలం మహీపాల! తవశ్రమేణ
ప్రయుక్త మప్యస్త్రమితో వృథా స్యాత్।
న పాదపోన్మూలన శక్తిరంహః
శిలోచ్చయే మూర్ఛతి మారుతస్య''

రాజా! శ్రమపడకుము. నీవు అస్త్రము ప్రయోగించినను వ్యర్థమే యగును. వాయువేగము వృక్షములను పెకలించునే గాని పర్వతము నేమిచేయును? అని అవహేళనముగా చెప్పెను. ఇరువారి సింహ వాక్యములు—దిలీపుని ప్రత్యుత్తరములలో విషయము తుల్యమే కాని కావ్యమందు ఉక్తి వైచిత్ర్యము వెలయుచున్నది.

"నిజం దేహం రక్ష సర్వార్థ సాధకమ్"

'నిఖిలార్థ సాధకమైన నీ శరీరమును కాపాడుకొనుము' అను పురాణ వచనమునకు కాళిదాసు ఎంత శోభ తెచ్చెనో చూడుడు—

"ఏకాతపత్రం జగతః ప్రభుత్వం
నవం వయః కాంతమిదం వపుశ్చ
అల్పస్యహేతోర్బహుహాతుమిచ్ఛన్
విచారహీనః ప్రతిభాసి మే త్వమ్"

ఏకచ్ఛత్రాధిపత్యముగల ప్రభుత్వము — నవయౌవనము— సుందర శరీరము వీనిని ఒక్క గోవునకై వదలుకొందువా? అల్ప వస్తువునకై గొప్ప వస్తువును పోగొట్టుకొను మందమతివలె కనిపించుచున్నావు? అను సింహవాక్యమునకు జవాబుగా దిలీపుడు కామధేను సంతతియైన నందినిని వదలి గురువుగారి యెదటి కెట్లు పోయెదను?

"తస్మాద్విముచ్య గామేనా మ్మయాకురు నిజాశనమ్
దదామి దేహమాత్మీయ మపకీర్తి మలీమసమ్"

కావున ఈ గోవును వదలి నా దేహములో నీవు పారణము చేయుము. నీ శరీరము అపకీర్తిచే మలినమైనది అను పద్మ పురాణ వాక్యములను కాళిదాసు—

"క్షతాత్కిలత్రాయత ఇత్యుదగ్రః
క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః।
రాజ్యేన కిం తద్విపరీత బుద్ధేః
ప్రాణైరుపక్రోశమలీమసైర్వా"

క్షత్రము అనగా నాశమునుండి త్రాణము (రక్షణము) చేయువాడు గనుక క్షత్రియుడని పేరు వచ్చెను. ఈ యర్థమునకు వ్యతిరేకముగ తన ప్రాణముల కొరకు దైన్యము వహించువానికి రాజ్యమెందులకు? అని చక్కని సమాధానము చెప్పెను. మరియు—

"కిమప్య హింస్యస్తవచే న్మతోఽహం
యశశ్శరీరే భవమే దయాళుః।
ఏకాంత విధ్వంసిషు మద్విధానాం
పిండేష్వనాస్థా ఖలు భౌతికేషు"

నన్ను హింసించుట నీ కిష్టము లేనియెడల ఆ కరుణను నా కీర్తి శరీరమునందు చూపుము. క్షణికములైన భౌతిక దేహములందు మా బోంట్లకు ఆసక్తి యుండదు లను దిలీపుని యభ్యర్థనలో ఈ అనిత్య కళేబరమును తీసికొని నిత్యమైన కీర్తిని ప్రసాదింపుమని ధ్వనించుచున్నది.

ఇట్లు చెప్పి దిలీపుడు తలవంచి తన శరీరమును సమర్పించుట పుష్పవృష్టి కురియుట రెంటియందు సమానము. పిమ్మట—

పుత్రోత్తిష్ఠేతి వచనం
శ్రుత్వా రాజా స ఉత్థితః।
జననీమివ తాం ధేనుం
దదర్శ న మృగాధిపమ్॥

ఉత్తిష్ఠ వత్సేత్యమృతాయమానం
వచో నిశమ్యోత్థిత ముత్థితస్సన్।
దదర్శ రాజా జననీమివ స్వాం
గామగ్రతః ప్రస్రవణీం న సింహమ్॥

కుమారా లెమ్ము అను మాట విని లేచి దిలీపుడు నందినిని తన తల్లివలె చూచెను. అక్కడ సింహములేదు. ఈ భావము రెంటిలో సమానము. శైలి—వృత్తము వేరు. ఇట్లే—

తం విస్మితము వాచేదం
నందినీ నృపసత్తమ!
మాయయా సింహరూపిణ్యా
త్వం మయాసి పరీక్షితః॥

తం విస్మితం ధేను రువాచ సాధో
మాయాం మయోద్భావ్య పరీక్షితోసి॥

అనగా—ఆశ్చర్యపడుచున్న ఆ రాజునకు నందిని యిట్లనెను. "రాజా! నేను మాయాసృష్టిచేసి నిన్ను పరీక్షించితిని" అను పై వాక్యములు రెంటను సమానములు. పిమ్మట సంతానార్థియగు రాజునకు పుత్రప్రాప్తి వరమిచ్చుటయు ఆకుదొన్నె లెమ్మని దానియందు క్షీరము స్రవింపచేయుటయు సమానము. పిమ్మట పాలు పిసికొని ధేనువువెంట ఆశ్రమమునకు వచ్చి గురునకు నివేదించుట, వారి యనుమతిపై పాలు త్రావుట సమానమే కాని ఉపమాలంకార కల్పనా విరించియగు కాళిదాసు క్షీరపానమును చక్కని యుపమానముతో వర్ణించెను.

"పసా వసిష్ఠేన కృతాభ్యనుజ్ఞః
శుభ్రం యశో మూర్తమివాతి తృష్ణః"

అనగా వసిష్ఠుని యనుమతిపొంది మూర్తీభవించిన సత్కీర్తియా యన్నట్టుల స్వచ్ఛముగానున్న ఆ క్షీరము త్రావెను. పిమ్మట వసిష్ఠుని యనుజ్ఞ తీసికొని రాజదంపతులు కృతార్థులై తమ రాజధానికి వెళ్లిరి.

పై విధముగా పురాణములలో కథాప్రధానముగనున్న ఘట్టములను ఆధారము చేసికొని వానిని రసభావ బంధురముగా తీర్చి మహాకావ్యములను, నాటకములను రచించి సహృదయలోకమును మహానంద సుధాంబుధిలో తేలియాడజేసిన మహాకవులలో శ్రీకాళిదాసు అగ్రగణ్యుడు.

# మనకు మనికి వేదనా నాదవేష్టితం

కే ఎ స్వీ

మనకు మనికి వేదనా నాదవేష్టితం
పూలను వలచిన బ్రతుక్కి
బూడిదే మిగిలింది
బూడిదైనా స్వంతమనుకొంటే
గాలి ఎగరేసుకుపోయింది
మనకు మనికి —

చెప్పొద్దు
ఆశా విశ్వాసాలు
చాలా చాలా విన్నాం
ఆ ఇంద్రజాలంలో
బ్రతుకు టోపీలోంచి
ఆనందపు కుందేళ్ళను తియ్యటం
చాలా సార్లు కన్నాం
షో ముగిసిం తర్వాత
మిగిలింది
తమాషా
స్నేహ
నమ్మకు
మనకు మనికి —

ఎవ్వరూ
లేరు
శరీరాలు శబ్దాలు స్పర్శలు
కళ్ళనూ చెవుల్నీ చర్మాన్నీ
మోసగించేందుకే
జగమే ఛాయ
లోపలి వెలుగు
ఎవరికీ ఎవరికీ ఎవరికీ
అక్కరలేదు
నేను కావాలా (అంటావా)
ఇది చదివి
పారేస్తావ్
మరచిపోతావ్
నీ సానుభూతి
నీకైనా వుండదు
నువ్వూ నేనూ
ఎవరం లేం కనుక
ఈ అక్షరాలు
వేదనే వుండటానికి గుర్తు
మనకు మనికి —

పులకింతలు
ఉపశ్రుతి
వాన మీటుతున్న
రాత్రి వేళ్ళకి
బ్రతుకంతా స్పందించనీ
పరవశం అబద్ధం
అయినా
ఆపద్ధర్మంగా గుడ్డిలో మెల్లగా
అదొక్కటే
నమ్మదగిన అబద్ధం
మనకు మనికి —

బోలెడు ఇంత చీకటి
చుక్కల్ని అద్దుకొంటున్న కప్పు
నాకు స్వప్నాల దుప్పటీ కప్పు
కప్పలేవు
నిజాల ఖనిజం నుంచి నాకు
ఇంత దయా సువర్ణం తీసివ్వు
ఇవ్వలేవు
నీ అనుభవాల బేయ్‌నుంచి
కొంచెం ఉపశాంతిని ఎరువివ్వు
ఇవ్వలేవు
పోనీ నే నిస్తా తీసుకో
ఈ వేప పూతల వాసనల్లోంచి
సింధు నాగరికత దినాల్లో
నూతిగట్టున
నువ్వూ నేనూ
వేటలో దొరికిన మృగం గురించి
కళ్ళూ చేతులూ తిప్పుతూ
సంభాషించుకొన్న ఆ సాయంత్రపు
జ్ఞాపకాన్ని
నీకొద్దు
కావలసినవి దొరకని ఈ
నొవే ట్రాఫిక్
? ? ? ?
ట్రాఫిక్
ఎందుకూలేదు ఎందుకూలేదు
ఒంటరి నిర్జన మార్గం
మనకు మనికి —

గతం మగత వదలదు
వలదన్నా
వదలదు
విదిలించినా కదలదు
తిరిగి తిరిగి చెడినా విడదు
తిరగేసి మరగేసినా
మాటలుగా దృశ్యాలుగా వాసనలుగా
ధూళుల వెనుక అస్తమయాలుగా
చీకట్లో టాటా ఫీరియోలుగా
నవ్వులుగా
అపార్థాలుగా అనుమానాలు అవమానాలుగా
ఖేదాలుగా విభేదాలుగా బరువులుగా
నీరసాలుగా గాయాలుగా
వదలదు
పీడగా
మగత గతం
మనకు మనికి —

ఆ ప్రాచీన శిల్పాల్లో
శిథిలాల్లో
ధూళిలో
నీ అడుగుజాడలున్నాయ్
నా అడుగుజాడలున్నాయ్
అక్కడి ఎన్నెన్నో అడుగుజాడల్లో
ఒకరినొకరు తెలిసిన వెన్ని ?
ఒకరికొకరు కలిసిన వెన్ని ?
అడుగులున్నంత దగ్గరగా
ఒకట్లో ఒకటిగా
లేక
రెండులో రెండుగా
నమ్మకంగా
హృదయాలుండవు
అసలు
హృదయాలుండవు
అడుగులేగాని

హృదయాలు లేవు
మనకు మనికి —

నవ్వుతున్న నీకోసం
నవ్విపారేస్తున్నా
చెంపలు పగిలేలా
నీ చేతిలో
నీ కళ్ళకు గురవుతున్నవి
ఇవి
విదూషకుడి కన్నీళ్ళు
నవ్వు నవ్వు నవ్వూ
నవ్వరా నా గుండెల్లోకి
దుమ్ముంచే నవ్వు
నవ్వమనటమంత తేలికకాదు
నవ్వటం
మనకు మనికి —

కొట్టు కొట్టు
గంటలు
కొట్టు కొట్టు కొట్టు
కొట్టవే కొట్టు
ఈ చీకటిని కొట్టు
కలల్ని కొట్టు
నన్ను మాత్రం
మిగిల్చి పెట్టు
కొట్టు
మనకు —

స్వచ్ఛంగా
నిట్టూర్చే నాకు
వర్ణాలు తెలియవు
ఎదురయ్యే
తలక్రిందులైన అపస్మారక స్వర్గాలు తప్ప
కత్తి దూసే నీకూ
పూలగుత్తి చూసే నాకూ
పొత్తు కుదరదని నువ్వన్నా
ఫరవాలేదు
నీ కళ్ళజోడులోని అశాంతికి
నా కలలగాయాల నెత్తుటి
ఎర్రటి పరిమళాలు తోడిస్తా
నువ్వు నవ్వొకసారి పోనీ
నన్ను నీ ...
మనకు మనికి —

ఎంతని లాగను
ఎక్కడ ఆగను
ఏ ధైర్యంతో ముందుకు సాగను
స్వచ్ఛంద చ్ఛందంగా ఏడ్చిన
ఏదో ఏకాకితనం
కొండలులేని సూర్యోదయాల కదలికనుంచి
ఈగలిని చీలుస్తుండగా
ఏమని ఆలపించను
మానెయ్యి
వాహనాలురాని రోడ్డుమీద
నిరాదరుగా నడు
ఇంత పచ్చదనంలో
చిత్ర చైత్రంలో
ఏకాకివే నువ్వూ
మనకు మనికి —

ఎర్రటి ఎండ
లో పచ్చటి చెట్లు
కింద చల్లని
నీడ
ఎగిజూస్తే
నీలి అనంతాన్ని
నీరెటీగా మీదికి తలకిందులుగా
కుంచించేది
ఇరిస్
దాన్ని తలమీదులుగా
ఆ నీలి
అంత
అనంతాన్నిగా
విలిపి చూపించే ఇంద్రజాలం
ఏది ?
ఫిల్టరు రంగులు
మిక్సుము ఫీలింగులు
ఉడాయించుము
అనుభూతుల బస్సెక్కి
డీసెల్ కమురుకంపు క్రిటి...
మనకు మనికి —

ఎల నవ్వుల
వెల తెలియని
ఎదవ జలమ బాబూ
క్షమించెయ్యి
చిటికెడు సాహసంతో
కష్యమైపోయింది బ్రతుకు పులుసు
నీళ్ళు కలుపుతావా
కన్నీళ్ళు కలుపుతావా
అరసం ని
స్మరసం చిలుకుతావా
పోనిద్దూ
మనికి —

ఈ గిరి దాటరాదు
ఆ గిరి శిరసెక్కరాదు
ఆ ఉదయం చూడరాదు
ఆ హృదయం మీటరాదు
ఇక్కట పాట
రాదు
మర మనికి —

ఇవాళ నవ్వే
ఈ నవ్వు
నేను లేని రేపు
సూర్యుణ్ణి పిలిచే
తొలి పువ్వు
ఏ నల్లటి ఎర్రటి
పసుప్పచ్చటి కోకతో
ఏ సీతాచిలుకో వచ్చి గ్రోలాలని
ఇవాళ నవ్వుగా మెదిలి
నేను ముగిసి
రేపు కొమ్మ కొసను విచ్చుతా
కాని
మాటా చూపూ నడకా లేక
ఎవరికైనా ఎవ్వరికైనా
తెలుస్తూనా
మనకు మనికి —

అనుభూతుల షాండిలేర్
అంధునికై వెలగదు
సోవాట్ అనే మనిషినుందు
సొంపులూ ఇంపులూ వ్యర్థం
బంగారు గాజుల ఖరీదును
సింగారించుకొనే అతివకు
రంగుల మట్టిగాజుల రవళుల
కలల అలల వలల విలువలు
ఏం తెలుసు వేస్ట్
అందానికి ఆప్త శత్రువు
స్టుపిడిటీకి బద్ధ మిత్రుడు
డబ్బు
మనికి మనకు —

పోటీపడి టోపీలేసేవాళ్ళూ
పోటీలుపడి టోపీలేయించుకొనేవాళ్ళూ...
నాజాతి జాతంతా దొమ్మీగా తోసుకొస్తోంది

శరికోపాలెట్టించుకొందుకు
రాజకీయ రాక్షస పూజారి జారులచేత
నెత్తిని అణగదొక్కించుకొందుకైనా
కల్లుతీర్థం కబుర్ల ప్రసాదం దోయిలించి
స్వీకరించేందుకైనా
సర్వదా సిద్ధం
నేనూ నా కుక్కా నా హుక్కా మేం ప్రహరీ
కివతల
నిట్టూరుస్తూ —
ఎందుకయ్యా నామాలెయ్యించుకుంటారన్నా
ఏనదు జనత తొక్కిసలాడుట మానదు
గోవింద గోహోవింద కొంపాకులాస్ ఎవడి
క్కావాలి
కవిత్వం చిత్తశుద్ధీ పాలసీ ఆత్మాహుతీ
గుండు చేసుకొని టోపీలేయించుకొందుకు
పటాటోపంగా పోటీలుపడే జాతికి
మనకు —

నేను నేనుగా మరణించాను
నేను నీడగా మిగిలున్నాను
నీడ నేనుగా భ్రమిసేవారికి
నేను పీడగా అనిపిస్తాను
నేను మందిలో కలిసున్నాను
వంద మందిలో వేలమందిలో
లక్షల అక్షల ఆశలలో
నేను లీలగా నిట్టూర్చేను
జాలి జాలిగా పలవించేను
ఎవరయ్యా నను రక్షించేది
నాకు నేను ఒక
'అసంపూర్తి'ని
మతాల మతాబాలొద్దు
ఇజాల నకిలీ నిజాలొద్దు
శిఖరాగ్ర చర్చల శాంతి భ్రాంతులొద్దు
వొక్కడు వొక్కడు
వొక్క పూర్ణమానవుడు ఏడీ ఎక్కడ
ఆ చల్లని అడుగు సవ్వడికి వింటున్నా
మనకు మనికి —

కుండలు రకరకాలవీ రంగురంగులవీ
అందమైనవీ వికృతమైనవీ నవ్వేవీ
ఏడ్చేవీ ఏడ్పించేవీ కుండలు
నడుస్తూ మాట్లాడుతూ చూస్తూ
పాత్రలు పాడుతూ వెక్కిరిస్తూ ఉపన్యసిస్తూ
కీచుమంటూ రంగులుడిగి

వెలువెలబోతూ తడబడుతూ కుండలు
హోయక్ళొంకబోస్తూ వెంటబడుతూ
సిగ్గుపడుతూ లొంగిపోతూ
లొంగిపోతూ పెత్తనం చేస్తూ కుండలు
నుదురుకొట్టుకుంటూ నవ్వుతూ
శాపనార్థాలు పెడుతూ
నిట్టూరుస్తూ దొర్లుతూ పొర్లుతూ
మడిసూ
సుఖిస్తూ శుష్కిస్తూ వోట్లేస్తూ రాస్తూ
పూలవుతూ తొడచరుస్తూ అరుస్తూ
కుండలు పరిశోధిస్తూ సాధిస్తూ
జారిపోతూ పారిపోతూ ఆరిపోతూ
దిగాతీస్తూ మూస్తూ పడుతూ లేస్తూ
ముగుస్తూ కుండలు కుండలం
మనకు —

నీరో రస సారో పాపం పట్టించుకొన్నదెవరు
హృదయరోము తగలడితే
మనమైనా ఏంచేస్తాం
మస్తిష్కం కట్టేస్తాం
చాతయినట్టు పాడేస్తాం
ఆడేస్తాం పోనీలే
పోనీలే హృదయం
మాటకాక మరేమిటది
మరేమిటది మాటకాక
పాడుదయ్యం హృదయం
నట్టేట్లో మునకేస్తూ
తీరంకోసం చూడం
ఆఖరుగా నవ్వేస్తాం ఆలోచన కట్టేస్తాం
మనకెందుకు పచ్చదనం
మనకెందుకు పూలతావి
ప్రళయజలం ముంచేస్తే
మౌనంగా గుటకేస్తాం
చేతులెత్తి యాచించం యోచించం తెప్ప
కొరకు
వెదకి వృథా వేచి వృథా
తడబడుతూ విడిపోతాం
వెళ్ళొస్తాం ఎన్నటికీ
ఎలావుంది మన గుడ్‌బై
ఎప్పటికీ వెళ్ళొస్తాం
మర్యాదలు మరిచిపోం
సగౌరవంగా చనిపోతాం
మనకు మనికి వేదనా —

మెట్లు మగిసినాయనుకున్నా
మెట్లుంటూనే ఉన్నాయి
ఎక్కవలసిన మెట్లు
లెక్కలేనన్ని మెట్లు
కాళ్ళు పీకుతున్నా
చేతికి ఆసరా దొరక్కున్నా
తప్పదు ఎక్కటం మెట్లు
ఎక్కటం తప్పదు మెట్లు
ఎన్నని ఎక్కటం మెట్లు
పదాల వాక్యాల పేరాల సంగీతం
లాగా సాగే మెట్లు లెక్కలేనన్ని
ఎక్కడికని అడక్కు ఎక్కు
ఎందుకని ఎక్కు అడక్కు
ఎందుకని ఆగకు ఎక్కు
వెనుదిరిగి చూడరాదు గతం మృతం
దృశ్యం మసక రాత్రి చీకటి చుక్కలు
లేవు చూడకు వెనక్కి ఎక్కు
ఆగకు ఆగకూ
దడ వెనక్కి చూడకూ
దడ చీకటి వెలుతురు
లేదు మెట్లు మెట్లు
పాములుంటే — ఎక్కు
చూడకు బొటనవ్రేలు
చిట్లితే ఎక్కు ఆగకు
ఏమిటూ తాని కేమిటాధ్వని
పువ్వులా నీళ్ళా టపాటపా నీళ్ళా
దాహం ఆగకు భ్రమ ఎక్కు
నీళ్ళు లేవు నీళ్ళు ఎక్కడా లేవు
కొండలు బండలు చీకటి ముళ్ళు తుప్పలు
ఎక్కడికని ఎక్కటం అడక్కు ముందుకు
పైకి ఎక్కు టపాటపా నీళ్ళు
భ్రమ కాలుజారితే నుదురు చిట్లితే
నల్లటి చీకటి ఎర్రటి రక్తం
కనబడదు ఎక్కడికి ఆగకు
అడక్కు ఎక్కు పైకి ముందుకు
తోడులేదు ఒంటరి ఒంటరి ఎక్కు
ఆకాశం ఎత్తు ఎక్కు బరువు
నాకే నేను నేను నాకే
ఆశా ఆగనీ అలవకు ఆగకు
ఎక్కడికి అడక్కు ఎందుకు ఎక్కు ఆగకు
తండ్రీ — నువ్వంటే — ఇది
ఘోరం ఘోరం తండ్రీ ... !



# నన్నయ

## శ్రీ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము

శ్రీ గౌతమీవారి శీకర సేచనన్
ప్రభవించె నేదివ్య పంకజమ్ము!
కోటిలింగేశ్వర కోటి బిల్వార్చనవ్
భక్తితో నిల్చె నే పత్రదళము!
రాజరాజ నరేంద్ర రాణ్మనోంబుజమునన్
భవ్యమై వెలసె నే నవ్యమధువు!
'నన్ని' నారాయణానందోపవనమునన్
'కో' యని కూసె నే కోకిలమ్మ!
'దక్షవాటీ'శ్వర కటాక్ష వీక్షణమున
శబ్దరూపమ్ముదీర్చె నే శారికమ్మ!
భారతామృతమిమ్మిచ్చె నే పరమహంస
మా సుకవి నన్నయ బ్రహ్మనాత్మఁదలఁతు!

ఆది కవీంద్రచంద్ర! భరతాన్వయ దివ్యకథామృతమ్ము స
మ్మోదము మీరఁగాఁ దెలుఁగు ముద్దుల పల్కు వెలంది కిచ్చు నీ
యాదరణీయ సార మహిమాన్విత వైఖరికిన్ జోహారు; లా
వేద విభాగకర్త ప్రభవించెనొ యేమొకొ, నీదుమూర్తియై!

సారమతిన్ గ్రహించుచుఁ బ్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసి, మేలనన్ వెలయు నక్షర రమ్యత నెల్లఁగాంచి, నా
నా రుచిరార్థ సూక్తి మదినాటఁగ నభ్యసనమ్మొనర్చి, నీ
భారత సత్కథామృతము పానముచేసితిఁ దెల్గు బిడ్డనై!

అపరవ్యాసుఁడవై మహాంధ్ర కవితా యజ్ఞమ్ము సాగించి మా
కుపయోగమ్ముగఁ దత్ఫలమ్మును మహోద్యోగమ్మునన్ ధారవో
సి పవిత్రాత్ముఁడవైన నీదగు చిరంజీవిత్వమీ తెల్గు భూ
మి పయిన్ గాక; ప్రపంచమెల్ల వెలసెన్ మృత్యుంజయానందమై!

నిండు మనమ్ములోని నవనీత సమానపుఁ బల్కులందుఁ బు
ల్కండము నింపి పల్కితివొ కమ్మని కావ్యము! లేదు లేదు లే
దొండొరుఁ డెవ్వఁడున్ సుకవి యొక్కఁడు నీవలెఁ బల్కువాఁడు; ది
జ్మండల మండితాఖిల జగమ్మున నున్న కవీంద్ర కోటిలో!

కమ్మని తావులన్ జిలుకు క్రమలతాంతములందు మూఁగి యం
దమ్ముల వెల్గ, ఝుంకృతుల దర్పము మీరఁజెలంగు భృంగ నా
దమ్ముల నాంధ్రభారత కథా గమనమ్మొనరించు నీదు కా
వ్యమ్మునఁ గర్ణపేయముగ వర్ధిలెఁ బల్కుల దివ్యనాదముల్!

పర్వము పర్వమెల్ల సరపర్వముగాగ మహాంధ్రభారతిన్
సర్వసమృద్ధమైన 'జయ' సంహిత సత్కృతిఁదీర్చి నీవు దృ
క్పర్వముగాగఁజేతువని కన్నకలల్ కలలయ్యెనయ్య! త
త్పర్వము మాకునై కడకుఁ దక్కెను ముద్దుగ మూఁడు పర్వముల్!

భూసతికిన్ దివంబునకుఁబొల్పెసఁగంగ శరత్సమాగమం
బా సకల ప్రమోదకరమైనను, మాకు మహాప్రమాదమై
నీ సుకవిత్వమంతముగ నీ బ్రతుకున్ హరియించెనేమొ! య
బ్జాసన శోభితుండవు, మహాశయ! సప్తమహర్షి మండలిన్.

ఓ చాళుక్య కులద్విజోత్తమ! కవీంద్రోపాస్య చింతామణీ!
ఆ చాళుక్య కులద్వయ జ్వలిత దాయాదిత్వ తీవ్రాగ్నిలో,
నా చోళ ప్రభుబంధు బంధములలో, నా 'నన్ని' స్నేహమ్ములో
నీ చారిత్రమె తెల్గుజాతి కథగా నిల్చెన్ జగచ్ఛ్రేయమై!

ఎయ్యెడఁగాని నీ చరిత మింతఁ గనంబడదేమి వింత! పె
ద్దయ్యలు జ్ఞానతేజులు హితమ్మెఱిఁగించుచుఁజూపుమార్గమం
దియ్యెడ నేను దెల్పునది యెల్ల నిజమ్మయి నిల్చుచో నిఁకే
మయ్య! మదీయ జన్మమున కయ్యెడు ధన్యత సార్థకమ్ముగన్.

[''నా 'నన్నయ' నవల నుండి'']

మహేంద్ర

పెద్ద కథ

# కనిపించని కోయిల

*(గత సంచిక తరువాయి)*

రవి తలుపు వెనుకగా చెప్పులు వదలి కాళ్ళు కడుక్కోడానికి పెరట్లోకి బోతున్నవాడు—హాల్లో తనహోల్డాలు విప్పబడి—బట్టలు, పుస్తకాలు, షేవింగ్ సెట్టు చిందర వందరగా పడివుండడాన్ని చూశాడు తాను మూడు సంవత్సరాలుగా అతి జాగ్రత్తగా చూసుకున్న పుస్తకాలు, పై తరగతులకు వెళ్ళేందుకు కావలసిన అప్లికేషన్లు, ప్రాస్‌పెక్టస్—ఇలా కేర్‌లెస్‌గా పారవేసి వుండడంతో రవికి తీవ్రమయిన కోపం వచ్చింది.

''అమలా, ఎవరే నా బుక్స్ ఇలా చిందర వందర జేసారు.'' గట్టిగా కేకేశాడు రవి.

''నాకేం తెలియదన్నా! నేనసలు ఇంట్లోకి రాందే'' బిక్క మొగం వేసింది అమల.

పూజగదిలో పెట్టడానికి ప్రమిద తీసుకెళుతున్న జానకమ్మ, జరుగుతున్న హంగామాను జూచి ''రాజా తీసినట్టున్నాడు చూడరా'' అంది.

ఇల్లంతా వెదికినా రాజా జాడలేదు. విసుగు కప్పి పుచ్చుకుంటూ వంటింట్లో కెళ్ళాడు రవి మంచినీళ్ళు తాగి రావడానికి. వంట గదిలో ఒక మూల నీళ్ళబిందె ప్రక్కగా కూచొని, ఏదో పుస్తకంలోకి తదేక దీక్షగా చూస్తున్నాడు రాజా. తాను రావడంతోటే ఉలిక్కిపడి లేస్తూ, ఇంతకూ ఏమీ జరగనట్టు ''ఎప్పుడొచ్చినావన్నా'' అంటూ మర్యాద ప్రదర్శిస్తున్న తమ్ముడ్ని చూచి ఏం జెప్పాలో తోచక నవ్వేశాడు రవి.

''ఉదయం వచ్చినామండీ! మీ దర్శనం మాత్రం ఇప్పటికయింది. మన రాజ్యమంతా సుఖంగా వుందా?'' అంటూ ఎగతాళి జేసాడు.

''జామతోటలో కోతులు పడ్డాయన్నా. ఇంతవరకు అక్కడే వుండి తరిమివస్తున్నా'' అన్నాడు రాజా.

''మీకంటే కోతులే నయం. రాళ్ళకన్నా బెదరతాయి. అసలు మిమ్మల్నెవరు తోటకెళ్ళమంది? తోట కాపుదలకు సల్లాపురి ఉన్నాడుగా'' హాల్లోంచి మందలించాడు రామనాథం.

''సల్లాపురికి ఈరోజు జొరమొచ్చింది. అదీగాక పండ్లన్నీ ఇంకా పచ్చివే. పచ్చికాయ లెవరు తింటారు.'' తండ్రి అడిగిందేమో పిచ్చి ప్రశ్నయినట్టు తేల్చేశాడు రాజా.

''అవునవును. మరి నా పుస్తకాలకేం జ్వరమొచ్చింది. అన్నిటికి మందులిచ్చి ఇల్లంతా పడుకోబెట్టేశావు.'' రవి నవ్వుతూనే రెట్టించాడు.

''అసలు నేను కూడా వద్దన్నాను. శ్యామలే, తెరవమని ఒకే గోల పెట్టింది'' అన్నాడు రాజా.

''శ్యామలకు నా హోల్డాలుతో ఏం పనిరా బాబూ? అసలు ఈ రోజంతా ఆ పిల్ల మనిల్లు వదిలినట్టులేదు. మామయ్యవాళ్ళు మరీ 'రాబం చేస్తున్నట్టుంది'' విసుక్కున్నాడు రవి.

''వాళ్ళ మామయ్య వాళ్ళింటికి అది రావడానికి మధ్య నీ అనుమతి ఎందుకురా? అయినా నువ్వు వస్తావని ఉత్తరం రాసిందగ్గర్నుంచి రోజూ బావెప్పుడొస్తాడని ఒకటే పాట పాడుతోంది. ఈ రోజు నీ పుస్తకాలను తాకిందని తెగ నీల్గుతున్నావు'' మేనకోడల్ని వెనకేసు కొచ్చింది జానకమ్మ.

కథ ఇంకేమలుపు తిరగబోతుందోనన్న భయంతో రవి పుస్తకాలు సర్దుకోడానికి హాల్లోకి నడిచాడు. పుస్తకాలను అలమారులో సర్దుతున్నంతసేపూ, సూట్‌కేస్ తీసి బట్టలను బీరువాలో పెడుతున్నంతసేపూ, రాజా అన్నచర్యల్ని నిశితంగా గమనిస్తూనే వున్నాడు. షేవింగ్ సెట్‌లోని కత్తెర దగ్గర్నుంచి, బాల్‌పాయింట్ పెన్ను, కీచైను, టేబిల్‌లైటు వరకు వాడిదృష్టిని తప్పించుకున్న వస్తువు ఒకటీ లేదు. అందులో ఒక్కొక్కదాన్ని గురించే వాడు వేయి అనుమానాలు పడగలడని, వేయి ప్రశ్నలు వేయగలడని రవికన్పించింది

''రాజా, అన్నను విసిగించక ఇలా వచ్చి చదువుకో'' అని తండ్రి పిలవడంతో ఒకటి రెండుసార్లు వెనిక్కి తిరిగి జూస్తూ అయిష్టంగానే గది బయట కడుగు బెట్టాడు రాజా.

రాత్రి భోజనాలయ్యాక అలవాటుగ నిద్ర రాకపోవడంతో, టేబిల్ లైటు వేసుకుని ఏదోనవల చదువుకుంటూ వుండిపోయాడు రవి పదింటిదాకా.

అప్పటికి ఇంటిపని పూర్తయినట్టుంది, పడుకోవడానికెళ్తూ కొడుకు దగ్గరికొచ్చి ''వసారాలో మంచమేసానునాయనా. తెల్లవారు జామున గాలెక్కువైతే మంచం గదిలో వేసుకో. తాళం దిండుకింద బెట్టాను. వాచీని పెద్దింట్లో గూట్లో బెట్టిపోవడం మర్చిపోక'' అని జెప్పిబోయింది జానకమ్మ.

మరో అరగంట తర్వాత ''అపరాత్రయినా నిద్దరాలేదుట్రా. చదివింది చాలు పడుకో'' అంటూ కసిరాడు రామనాథం హాల్లోంచి.

పూజగదిలోని గూట్లో వాచీని తీసి పెడుతూ వెనుదిరిగిన రవికి నాయనమ్మ ఫోటో కన్పించింది. దానికి వేసిన పూలమాలలో పూలన్నీ వాడిపోగా కొంచెంగా వూగుతోంది. నిరుడు చలికాలంలోనే ఆమె వారం పదిరోజులు కాయిలాపడి కాలం చేసింది.

వసారాలో కొచ్చి మంచంమీద వెల్లకిలా పడుకున్నాడు రవి. నల్లటిఆకాశంలో నక్షత్రాలు మాత్రం నిర్లిప్తంగా వెలుగుతున్నాయి. ఎక్కడో వీధి చివర కుక్కలు కూడా మొరుగుతున్నాయి. గాలిలో పెట్టిన పుస్తకం పేజీల్లా రవి ఆలోచనలు రెపరెపకొట్టుకున్నాయి. పందిరి నుంచి వస్తున్న మల్లెపూల వాసనలు పీలుస్తుంటే తానింకా ఏడేండ్ల కుర్రవాడేమోనన్న భ్రాంతి కల్గుతోంది. రాత్రిళ్ళు నాయనమ్మ పాడే 'ఊర్మిళాదేవి నిద్ర' ఇంకా విన్పిస్తున్నట్టే వుందతనికి.

తను పుట్టకముందు ఈ ప్రపంచం ఎన్నాళ్ళు జరుగుతోందోగాని తనకదంతా ఒక దీర్ఘ రాత్రిగానే అన్పిస్తుంది. పుట్టి భూమ్మీద పడ్డాక తన శైశవ జీవితమంతా మసక మసకగా అంతా ఒక సుషుప్తిలాగే జ్ఞాపకం ఉంది తనకి. తెలిసీ తెలియని బాల్యం ఒక క్రీడలా గడచిపోయింది. కాని గడచిన అయిదేళ్ళ కాలేజీ జీవితం కేవలం ఒక కలగా పరిణమించింది.

కని, పదిహేనేండ్లు పెంచిన వారిని చూడకుండా తాను దాదాపు అయిదేండ్లు బ్రతుకగలిగాడు. అయిదేండ్లు తనలో గడిపిన ప్రాణమిత్రులందరిని వదలి మళ్ళీ యిక్కడికి వచ్చేయగలిగాడు. వీటిన్నింటినీ తాను భరించగల్గినా, తన జన్మకు కారణభూతుడయిన తండ్రి, కన్నతల్లి, తన బాగోగులనుగురించి గత పందొమ్మిదేండ్లుగా తపించిన నాయనమ్మ గూడ కేవలం ఒక జ్ఞాపకంగా మిగిలిపోవడం భరించలేని విషయంగా తోచిందతనికి. నడిజాము తర్వాత ఎప్పుడో వెళ్ళే ఎక్స్‌ప్రెస్ కూత కూడ విన్న రవి చివరికెప్పుడో రెండింటికి పయిన నిద్రలోకి పడగలిగాడు.

* * *

ఉదయం ఏడింటికి కాఫీ త్రాగి, తల్లితో జెప్పి మామిడి తోటవైపు బయల్దేరాడు రవి. దారిలో రమేష్, శ్రీధర్ కన్పించారు. నిజానికి అందరిది ఒకే యీడైనా పల్లెపట్టున వుండడంతో ఇద్దరూ మొరటుదేలి రవికంటె కొంచెంపెద్దవారుగా కన్పించవచ్చు. ఇద్దరికీ ఎస్సెస్సీలో అత్తెసరు మార్కులు రావడంతో చదువు మానేశారు. శ్రీధర్ రవిమామయ్య కొడుకు. ఐతే వారి మధ్య బాంధవ్యం కంటే స్నేహమే హెచ్చు. రవిమామయ్య రాజరత్నంకు రైస్‌మిల్లులో షేరుంది. రామాపురం చక్కెర మిల్లులో గూడ షేరు వేసినట్టు ఊరివాళ్ళు అనుకుంటున్నారు. శ్యామలకు పెళ్ళయితే రాజరత్నం పుట్టినదాదిగా పెంపొందిస్తున్న ఆస్తికంతా ఏకైక వారసుడు శ్రీధర్ ఐతే శ్రీధర్ ఊర్లో కొందరు పనీ పాటాలేని వెధవల్తో చేరి చెడిపోతున్నాడని రాజరత్నం ఈమధ్య కన్పించిన ప్రతివాడికీ చెబుతున్నాడట.

రమేష్ రవిలో ఈ సంగతులు చెబుతున్నంతసేపు అదేమో తన కర్థం కానవసరంలేని వేదాంత ప్రసంగమన్నట్టుగా చిద్విలాసంగా దిక్కులు జూస్తున్నాడు శ్రీధర్. ఉన్నట్టుండి జ్ఞాపకం వచ్చిన వాడిలా పట్టణంలో రవి చూసే సినిమాలను గురించి, సినిమా టాకీసుల్ని గురించి ప్రశ్నించడం మొదలుబెట్టాడు. ఆ తరువాత జరిగిన వారి సంభాషణలో రవి తెలుసుకున్న విషయం ఏమిటంటే తనకున్న సినిమా పరిజ్ఞానం మరీ తక్కువని, అసలు తెలిసిందీ తన భ్రమేమోనని. రవి తానడుగుతున్న ప్రశ్నలకు వేటికీ సమాధానం ఇవ్వకపోగా, కొందరు ప్రముఖులయిన సినిమా తారలను సైతం ఎరుగుండకపోవడం హాస్యాస్పదంగా దోచింది మిత్రులిద్దరికీ. ఇన్నాళ్ళు తాను చదివిన చదువంతా వ్యర్థమయి పోయినట్టు ఏకగ్రీవంగా ఆమోదిస్తున్న స్నేహితులను జూచి రవికేంజేయాలో పాలుపోలేదు.

జాతీయ అవార్డులు వచ్చిన సినిమాలనన్నీ తాను కాలేజీలోనే చూశానని చెప్పగా, అసలు మనుషులు చేయదగ్గ ఏ పనీ తాను చేసేటట్టులేనని తేల్చేశారు. అవార్డుల సినిమాలను ప్రత్యేకించి అసలు చూడగూడదని 'చంద్రబాబు' గూడ సెలవిచ్చినట్టు ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు.

తోట చేరుకునే లోపల ఎలాగైనా తన ప్రయోజకత్వం నిరూపించుకోవాలనే ధ్యాసలో పడ్డాడు రవి. దేశంలో జరుగుతున్న రాజకీయ పరిణామాల ప్రసక్తిదెస్తూ ఇప్పుడిప్పుడే ప్రజల్లో చైతన్యం కల్గుతోందనీ, కనీసం జనతా పాలనలో ఐనా పల్లెలు బాగుపడవచ్చునని అభిప్రాయపడ్డాడు రవి.

ఐతే ఏ పార్టీ అయినా ఒకటేనని, దేశం బాగుపడాలంటే చంద్రబాబు చెప్పినట్టు సమర్‌గుహలో నివసిస్తున్న నేతాజీ ఐనా రావాలని, లేకపోతే మొన్న హరిదాసు చెప్పినట్టు పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారే వీరభోగ వసంతరాయలై గుర్రమెక్కి రావాలనీ రమేష్ నిర్ణయించేశాడు. డిగ్రీలకు, పదవులకు వేటికీ ఇప్పుడు విలువలేదనీ, నేడున్న పరిస్థితుల్లో పైకి రావాలన్నవాడు ఎదుటివాణ్ణి అణగద్రొక్కడమే మార్గమని—ఇంకా దేశం గీశం అంటే దానికి మిలిట్రీ పాలనలో తప్ప ముక్తిలేదని చంద్రబాబు గూడ చెప్పినట్టు శ్రీధర్ తేల్చేశాడు.

ఇంతా విని వీరినింత బాగా తర్ఫీదు చేసిన చంద్రబాబు ఎవరో తెలుసుకోవాలనిపించింది రవికి. చివరి కెలాగో తెగించి ''అదసరే, ఇంతకీ చంద్రబాబెవడు? వాడి మాటే మీకు వేదవాక్కులా వుందే!'' అంటూ తన బాధనంతా వెళ్ళగక్కాడు.

ఈసారి రమేష్, శ్రీధర్‌లు రవికేసె చూసిన చూపుకు వ్యాఖ్యానం చెప్పడం సాహసమే అవుతుంది. రెండు రెండ్లు నాలుగని కూడ చెప్పలేని గ్రాడ్యుయేట్ ఎవడైనావుంటే, ఆ కాలేజీ ప్రిన్సిపాల్ అతడిని అలా చూచి వుండవచ్చునన్నది యిక్కడ దాదాపు సరిపడే ఉపమానం.

"చంద్రబాబు తెలియదటోయ్? మద్రాసులో యింటర్‌మీడియట్ చదివాడట. కాలేజీలో ఏదో ఎలక్షన్లలోబడి—అక్కడ ఒరుగుతున్న అన్యాయాలను సహించలేక రిజైన్‌చేసి మరీ వచ్చేశాడట! ఆ మాటకొస్తే ఎవర్నైనా లెఖ్ఖచేసే తరహాకాదు. ఇంతకూ ఈ చంద్రబాబు ఎవడనుకుంటున్నావు? మన స్టేషను మాస్టరు భార్యకు స్వయానా తమ్ముడే."

ఎలాగైనా సాయంత్రం లోపల చంద్రబాబు దర్శనం చేయించగలమని హామీ యిస్తూ మిత్రులిద్దరూ చెంగల్రాయులు టీ హోటల్లోకి దూరారు. చెంగల్రాయులు తన్ను పిలుస్తున్నా మళ్ళీ వస్తానని సర్ది చెబుతూ రవి తోటకేసి నడిచాడు.

వాగులో నీళ్ళు పాదాలు మాత్రం తడిచేటట్టుగా పారుతున్నాయి. దూరంగా బ్రిడ్జిపయిన తెల్లవారి రైలు పోతున్న చప్పుడు. తోటకీ వాగుకీ సరిహద్దుగా కానుగచెట్ల చల్లటి నీడ వుంది. తుఫాను గాలుల్లో సగానికి పైగా తగ్గిన కాతతో తోటంతా కుటుంబ నియంత్రణ ఆపరేషను తర్వాత లావయిన స్త్రీలా పచ్చగా కళకళలాడుతూ వుంది. లేతమామిడి ఆకులపై సూర్యుని కాంతిపడడంతో విచిత్రమయిన నూనె మెరుపుతో వనమంతా తైలవర్ణచిత్రంలా వుంది. నిర్మలంగా వున్న నీలాకాశంలో చిలకల గుంపులు ఎగురుతున్నాయి. ఏమూలనుంచో గండుకోయిల ఒకటి అదేపనిగా కూస్తున్నట్టుంది. ఏటిమీదినుంచి రివ్వురివ్వున వీస్తున్న ఈదుర గాలులలో వనమంతా ఆ పిలుపుకు ఊగిపోతున్నట్టుగా వుంది.

మొదట అప్రయత్నంగా అటూ ఇటూ చూడసాగిన రవి, క్రమంగా కోయిల పొలకువకోసం ప్రతిచెట్టూ గాలించసాగాడు. ఎంతకీ కన్పించకపోగా, వెక్కిరింపుగా తన నాటపట్టిస్తున్నట్టుగా ఏమూలనుంచో కోయిల కూత విన్పిస్తూనే వుంది. తనకు తెలియకుండానే ఏర్పడిన పట్టుదలతో రవి తోటంతా వెదికాడు.

ఇంతలో కోయిల పిలుపుకు ప్రతిగా తోటలోనుంచి ఎవరో బదులివ్వసాగారు. దాదాపొక రెండు నిముషాలసేపు ఒకరికొకరు పోటీగా ఈ సంభాషణ సాగింది.

రవి కోయిలను వెదికే ప్రయత్నం మానుకుని తోటవెలుపలికొచ్చాడు. మామిడితోట నానుకుని వున్న మిరపతోటలో టొమేటాలు కోస్తూ శ్యామల కన్పించింది.

'కోయిల గానీ కన్పించిందేం?' వెక్కిరింపుగా నవ్వసాగింది శ్యామల.

'ఆహా. నా హోర్డాల్లో తమరికేవి కన్పించింది'' బదులిచ్చాడు రవి.

తడబాటు కప్పిపుచ్చుకుంటూ "నీ వస్తువులు వెతకాల్సిన అవసరమేం నాకు లేదు. ఏదో రాజా చూడమంటే ఆల్బమ్‌లోని ఫొటోలు చూశానంతే" బెట్టుగా అంది శ్యామల.

ఇంతలో ఎవరో పిలిచినట్టుగా చేతిలో జామపళ్ళతో వచ్చాడు రాజా. మొత్తం తప్పంతా తనమీదే వేస్తున్న శ్యామలతో "అసలు మొదట చూడమంది నువ్వేగా! నువ్వెప్పుడూ ఇంతే. చేసేదంతా నువ్వేజేసి, చివరకు తప్పు నామీదకు తోసేస్తావు. ఇందాకా జామపళ్ళు తెమ్మని బ్రతిమలాడి, ఇప్పుడేమో అన్న వస్తూనే నన్ను షెడ్‌లో దాక్కోమన్నావు. ఇప్పుడు అన్న కన్పిస్తూనే నామీద చాడీలు మొదలుబెట్టావు" అంటూ ఏడుపుముఖం పెట్టాడు.

"అసలిప్పుడేం జరిగిందని? మహాగొప్ప మీ పుస్తకాలు చూడకబోతే నాదెంపోయింది. ఏదో పెద్ద నేరం చేసేసినట్టు నిలదీస్తున్నారు అన్నదమ్ములిద్దరూ" శ్యామలకైతే కళ్ళనీళ్ళ పర్యంతం అయింది.

చూసీ, చూసి రవి పక్కున నవ్వేశాడు. "ఫరేదులే శ్యామలా. ఇంత చిన్నదానికే చిన్నపిల్లలా ఎందుకేడుస్తావు. మీ నాన్నగారితో ఈసారి రామాపురంనుంచి ఫిల్ము తెమ్మను. మన దొడ్లో మీ ఫొటోలన్నీ తీస్తాను" అంటూ సముదాయించాడు.

కొంచెంగా శాంతిస్తూ శ్యామల అంది. "మాకేం అక్కరలేదు. ఐనా పట్నంలో కాలేజీ పిల్లల్లా ఒకే ఫొటో దీసుకోవడానికి మాకేం సిగ్గు లేదనుకున్నావా?"

మళ్ళీ ఏడిపించడం ఎందుకని నవ్వి వూరుకున్నాడు రవి.

దారిలో రవిని, రాజాను యింటికి తీసుకెళ్ళి టిఫిన్, కాఫీలు యిచ్చింది శ్యామల. రవి అత్తయ్యతో కబుర్లు చెబుతూ కూర్చోగానే రాజా, శ్యామలా చదరంగం మొదలుబెట్టారు.

"మీ యింట్లో రాజాఎంతో — మా యింట్లో శ్యామలా అంతే. అల్లరి చేయడంలో యిద్దరూ యిద్దరే. రోజూ పోట్లాడుకోవడమే. మళ్ళీ ఒకర్నొకరు వదిలి ఒక్కక్షణం వుండలేరు. వాడికైతే చిన్నతనం అనుకో. నేడో రేపో అత్తగారింటికి వెళ్ళాల్సిన పిల్లకు గూడ యింకా కుదురు అలవడలేదు."

రాజా, అయిపోతున్న తన ఆటను జూస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అప్పుడే గెలిచిపోయినంతగా వెలిగిపోతోంది శ్యామల ముఖం.

రాజాకు అమల దగ్గరకంటె శ్యామల దగ్గరే చనువెక్కువని గ్రహించాడు రవి. ఇదీ ఒకందుకు మేలేమో ననిపించింది ఒకక్షణం అతనికి. తనలో నిర్నిమిత్తంగా జరిగిపోతున్న ఆలోచనలకు ఫుల్‌స్టాపు పెడుతూ రవి లేచాడు.

కొన్ని నిముషాలు ఆటను చూసి రవి చేసిన చిన్న మార్పులతో శ్యామల రాజాకు ఎటూ కదలడానికి వీలు చిక్కలేదు.

"రోజా నన్నేమో భలే ఓడించేదానివిగదా! ఈ రోజు అన్నేమో నిన్ను చిత్తుగ ఓడించేశాడు" రాజా పరమానంద పడిపోయాడు.

''ఒకరే ఆడితే నేనే తప్పక గెలుస్తాను. మీరిద్దరు ఆడితే నేనొక్కదాన్ని ఓడిపోవడంలో ఏం గొప్పుంది మహా'' విసవిసా నడచి వెళ్ళి తల్లి వెనుకగా నిల్చుంది శ్యామల. అయితే ఓడిపోయినా శ్యామల నవ్వుతూనే మాట్లాడ్డం రవికి ఆనందం కల్గించింది. రాజా రవిచేసిన ట్రిక్కులను అవగతం చేసుకుంటూ చెస్ బోర్డు ముందే కూర్చున్నాడు.

''శ్రీధర్ ఎక్కడి కెళ్ళాడత్తయ్యా'' వీధిలోకి వస్తూ అడిగాడు రవి.

''ఎవరికి తెలుస్తుంది నాయనా! వాడేమైనా చెప్పిపోతాడా...'' అంటూ ప్రారంభించిన అత్తయ్య ఉపన్యాస ధోరణికి స్వస్తిపలుకుతూ సాయంకాలం మాట్లాడుదాం లెమ్మని వచ్చేశాడు రవి.

*   *   *

సాయంత్రం నాలుగు గంటలయింది. ఆదివారం కాబట్టి ఆ రోజు పోస్టురాదు. నిన్నటి పేపరు మరోసారి తిరగేసి కాఫీ త్రాగి ముగిస్తున్న రవిని ప్రశ్నించాడు రామనాథం.

''పరీక్షలెలా వ్రాసావురా ?''

''బాగానే వ్రాశాను. క్లాసు రావచ్చు. ఎం.ఏ ఎకనామిక్స్ తీసుకుందా మనుకుంటున్నాను'' అన్నాడు రవి.

''ఫలితాలు ఎప్పుడొస్తాయి?''

''ఈ నెల్లోనే రావాలి. ఎంఏ తర్వాత పిహెచ్.డీ చెయ్యాలనుకుంటున్నాను. ఇదొక నాలుగేళ్ళు, ఎంఏ రెండేళ్ళు – మొత్తం ఆరేళ్ళు...'' అంటూ ఆగాడు రవి, తండ్రి మాట్లాడడానికి ప్రయత్నించడంతో.

''ఇదుగో జానకీ. మంచినీళ్ళు దీసుకురా'' వంటింటివైపుకు తిరిగి కేకేశాడు రామనాథం.

తాను చెప్పదలుచుకున్నదేమో ఆమె గూడ వినాలని కాబోలు. రవి లోలోపలే నవ్వుకున్నాడు.

భార్య తెచ్చి ఇచ్చిన నీళ్ళు త్రాగి టేబిల్ క్రింద పడివున్న పాత పేపర్లన్నీ తిరగేసి–కొంతసేపటికొక పేపర్ బయటకు తీశాడు రామనాథం. జానకమ్మ గ్లాసుతో గుమ్మం దగ్గర నిలబడి వుంది. అమల మేటీ గుడ్డమీద రంగు నూళ్ళతో డిజైను కుడుతూంది. రాజా దొడ్లోనుంచి ఎవరితోనో మాటాడుతున్న అలికిడి.

రామనాథం పేపరును రెండుగా మడిచి సగం పేజీనిండిన అడ్వర్‌టయిజ్‌మెంట్ చూపాడు రవికి.

''శ్రీరామపురం షుగర్స్ లిమిటెడ్'' ప్రారంభోత్సవంనాడు పేపర్‌లో వేసిన ప్రకటన అది. ముందు పేజీ వార్తల్లో ఆ సందర్భంగా చక్కెర మిల్లుల మంత్రి చేసిన ప్రసంగం తాలూకు సంక్షిప్త పాఠం వుంది.

రవికి కొంచెంగా ఏదో అర్థమయింది. ఐనా మెలకువగా ''అవును నాన్నా. నాకు ఇంతకుముందే ఈ సంగతి తెలుసు. ఈ ఏడు మన తోట కూడ మిల్లుకే తోలితే మంచిదేమో. మామయ్య కెట్లా షేరు వుందని అంటున్నారుగదా'' అని అన్నాడు.

''రాజా ఈ ఏడు ఎనిమిది కొస్తాడుగదా. నిన్న వాడి మేష్టారు కన్పించాడు. కొంచెం అల్లరయినా బాగా చదువుతున్నాడని–సాయంకాలాల్లో యింటిదగ్గర చదివేట్లు చూడమనిచెప్పాడు.''

ఆయన ఆంతర్యం ఏమిటో–ఎందుకు తనకీ సంగతులు చెబుతున్నాడో రవి కర్థంకాలేదు.

''అవున్నాన్నా. రాజాకేం. బాగా చదువుతాడు. రెండేళ్ళలో ఎస్సెస్సీ పూర్తవుతుంది. రామాపురంలోనే కాలేజీ పడిందటగా. అక్కడే చేరుస్తేసరి.''

''ఆ సంగతే చెప్పొచ్చింది. ఈ అయిదేళ్ళా నీ చదువు కింతవరకు దేవుడి దయవల్ల ఏ అప్పూ కాలేదు. కాని రేపు ఎట్లా వుంటుందో చెప్పలేం గదా. నెలకు నీకూ వాడికీ ఎంత తక్కువయినా నాలుగు వందలు తగ్గవు గదా'' రామనాథం ఆగాడు జానకమ్మ అందుకోవడంతో.

''అమలకీ ఈడొచ్చింది గదా. మొన్నెవరో డాక్టరట. చూసి వెళ్ళాడు. కట్నం మాత్రం ముప్ఫయికి తగ్గరట. అప్పటికీ మీనాన్న గారేమో మొగ్గు జూపారు. పిల్లవాడికి లేని తిరుగుళ్ళు లేవని తన కెవరో చెప్పినట్టు మీ మామయ్య చెప్పడంతో అది విరమించుకున్నాము.''

''నీవూ పెద్దవాడివయ్యావు. లోకంపోకడ తెలుస్తూందిగా. పైగా చదువుకొన్నావు గూడ. నీకు తెలియందేముంది. రోజుకు రోజుకు పెరిగిపోతున్న ఎరువుల ధరలు–పంట పండకపోయినా పన్ను తప్పదు గదా. తాసీల్దారు దగ్గరయినా పని జేయించుకోవచ్చుగానీ– ఈ కూలీల దగ్గర పని జేయించుకోవడం కష్టమవుతూ వుంది. స్వంత మనిషి ఉంటేగ నీ పని జరగదు'' కొంచెం ఆగి మళ్ళీ అందుకున్నాడు రామనాథం.

''మీ మామయ్యకు చక్కెర మిల్లు మేనేజరు బాగా తెలిసినవాడట. మొన్న నీ సంగతి ప్రస్తావిస్తే వుద్యోగం ఏదయినా ఖాళీ పడితే మన తర్వాతగాని మరొకరికి పోనియ్యనన్నాడట'' చెప్పవలసిన సంగతి ముగిసిందన్నట్టుగా లేచి తుండు గుడ్డొకటి భుజంమీద వేసుకుని దొడ్లోకెళ్ళాడు రామనాథం.

రవి ఖిన్నుడై తలవంచుకు కూర్చున్నాడు. ''నీకు మిల్లులో వుద్యోగం అయితే ఇంటిపట్టునే వుండి ఎంచక్కా పొలం పనీ చూసుకోవచ్చు. మీ నాయనకీ చేదోడుగ వుంటుంది. రాజా కూడా నువ్వుంటేనే కొంచెం భయపడతాడు గదా'' సర్ది చెప్ప జూచింది జానకమ్మ.

ఐదేళ్ళుగా తాను కష్టపడి చదివింది — బి. ఏలో క్లాసు తెచ్చుకుంటున్నది అంతా వ్యర్థం అయిపోయినట్టు తోచగానే రవికి ఎక్కడలేని నీరసం ముంచు కొచ్చింది. ఇన్నాళ్ళు తల్లిదండ్రులు తనను చదివించడంలోగల రహస్యం వారి స్వార్థమే తప్ప అన్యం కాదనిపించింది. తమ్ముడు రాజా కానీ, మామయ్య కొడుకు శ్రీధరం గానీ తల్లిదండ్రులమాట వినకుండా తమవ్యక్తిత్వం నిలుపుకున్నారని పించింది.

విసురుగా వెళ్ళి చెప్పులేసుకుని చెరువు కట్టమీద కొచ్చేశాడు రవి. తనకు మేలు చేస్తున్నట్టు నటిస్తూ కేవలం తన నొక డబ్బు సంపాదించే యంత్రంగా చేసుకున్నారనీ—ఈ గూడు పుఠాణిని బట్ట బయలు చేసేటట్టుగా వీరికి తగిన శాస్తి చెయ్యాలనీ, అతని కన్పించింది.

రాత్రి ఏడయినా యింటి కెళ్ళాలనిపించలేదు రవికి. ఈదర గాలిలో పిచ్చి పట్టినట్టుగా తిరగడంచేత, విపరీతమయిన ఆలోచనా భారంచేత ఆ సాయంత్రం ఇంటికిచేరేసరికి రవికి ఒళ్ళంతానొప్పులు. కళ్ళంతా మంటలు, విపరీతమయిన తల నొప్పి ప్రాప్తించాయి, ఎవరేం మాట్లాడినా బదులుగా కరిచేద్దామన్నంత చీకాకు కల్గింది.

ఇంటికి వచ్చేసరికి తండ్రి పనిమీద మళ్ళీ పక్కవూరికి వెళ్ళి నట్టు తెలిసింది. అన్నను పలుకరించడానికి అమలగాని, రాజాగాని సాహసించ లేకపోయారు. కొడుకుకు దిష్టి తగిలిందనే వుద్దేశంతో, దిష్టి తీయించడానికి మంచంమీద అడ్డంగా పడివున్న రవిని లేప టంలో జానకమ్మ విఫలురాలైంది. కొద్దిగా వొళ్ళు వెచ్చబడి నట్టుంది గూడ, తలమీద చేయివేసి చూడడంతోనే జానకమ్మకు తెలిసిపోయింది. రాత్రికి ఒక మాత్రను మింగించి గుక్కెడుపాలు త్రాగించడానికే ఆమెకు గగనం అయిపోయింది.

మరునాటి ఉదయం పది గంటలయినా రవికి లేవబుద్ధి కాలేదు. తాను మూడు సంవత్సరాలుగాకన్న కలలన్నీ కల్లలయిపోయి నట్టు తలుచుకున్నకొద్దీ అతనికి ఉక్రోషం ముంచుకు వస్తోంది. తల్లినిగాని, చెల్లిని గాని ఎవర్నీ పలుకరించ బుద్ధి కాలేదు. జ్వరం తగ్గినా, లేచిముఖమయినా కడుక్కోని కొడుకు వాలకం. జానకమ్మకు కొంచెం కొంచెంగా అర్థమయింది.

ఆ ఉదయం మామూలుగా రవి తోటకేసి వస్తాడని ఎదురు చూచిన శ్యామల — రాజాద్వారా రవికి జ్వరం వచ్చిన సంగతి తెలుసు కోవడంతో, చేతిలో అంతవరకు కోసుకున్న కనకాంబరాల సజ్జతో సహా నేరుగా అత్తవారింటికే వచ్చేసింది.

అసరికే సగం వంట పూర్తయ్యే యింట్లో, అప్పటి కింకా పొయ్యి ముట్టించే ప్రయత్నమే జరిగినట్టు లేదు. అమల తల్లితో ''అన్నను చదివించనని ఎందుకన్నారమ్మా? అప్పుడే ఏం మునిగిందని అన్న ఉద్యోగం చేయాల్సి వచ్చింది?''అంటూ గుణుస్తోంది. రాజాకు చదువు వద్దనటంవల్ల సంతోషమేగానీ, బాధ ఎందుకో ఎంత ఆలో చించినా అర్థం కాలేదు.

వాడు తిన్నగా అన్న దగ్గరికెళ్ళి రెండుసార్లు మెల్లిగా పిలి చాడు. రవి కొద్దిగా కళ్ళు తెరిచి విసుగ్గా 'ఏం' అన్నట్టుచూసాడు ''నేం చదువుకు నిల్చిపోతాలే అన్నా! నువ్వెళ్ళి చదువుకుందూగాని'' అంటూ రాజా అన్నను సముదాయించబోయాడు.

అంత కోపంలోను రవి పక్కున నవ్వుతూ, అంతలోనె వ్రత భంగమయినట్టుగా మూతిముడుచుకుని చదువు ఎగ్గొట్టి ఊరంతా తిరుగుతూ అల్లరిచేయడం తప్పించి వీనికేం అర్థం కాదనుకుంటూ ''అతిగా వాగక అవతలికెళ్ళు. వేలెడులేవు. అన్నీ నీకే కావాలి. మళ్ళీ యిలా వాగావంటే దెబ్బలు తింటావ్'' అని కసిరాడు.

చిన్నబుచ్చుకుని, బడితె చూపించగానే తోక ముడుచుకుని 'మియ్యావ్' అంటూ వెళ్ళిపోయే పిల్లి పిల్లలా నిష్క్రమించాడు రాజా. ఆ తరువాతి పది నిముషాల్లోనూ గోడ గడియారం టంగు టంగుమని పది గంటలు కొట్టడం మినహాగా శ్యామలకు ఇంకే చలనం కన్పించలేదు.

అమలను, రాజాను పలుకరించి బదులు లేకపోవడంతో శ్యామల తిన్నగావెళ్ళి అప్పుడే పొయ్యి రాజేసి పాలు కాచుతున్న అత్త ప్రక్కగా వెళ్ళి నిలుచుంది.

''ఏమిటత్తయ్యా. ఇంత ప్రశాంతంగా ఇల్లుండడం నాకు ససేమిరా యిష్టం లేదు. ఏం జరిగింది. బావనేమయినా అన్నారా మీరు'' తగ్గు స్వరంలో అడిగింది శ్యామల.

''ఏమిటో తల్లీ. మాకేంతెలుస్తుంది. అలిగిపడుకున్నాడుగా వెళ్ళి మీ బావనే అడుగు ఏం అన్నామో'' విసురుగా పెరట్లోకి నడిచిపోయింది జానకమ్మ.

శ్యామల మెల్లగా రవి గదిలోకి నడిచింది. ఎవరి ముఖం చూడడం యిష్టం లేనట్టుగా బోర్లాపడుకుని వున్నాడు రవి. పలు కరించడానికే శ్యామలకు భయంవేసింది. జ్వరం కాస్తానేవుందేమో నన్న అనుమానం రావడంతో మెల్లగా వెళ్ళి వీపుపై చేయివేసింది శ్యామల.

''మళ్ళీ ఎందుకొచ్చావ్'' రవి గయ్ మంటూ లేచాడు.

''ఇదే మొదటిసారి రావడం'' భయపడుతూనే అంది శ్యామల.

''ఉద్ధరించావులే. వెళ్ళవతలకి'' ముఖం మీదకు ముసుగు లాక్కున్నాడు రవి.

గదిలో శ్యామల ఉండడంతో రాజాకు కొంచెం ధైర్యం చిక్కింది. గది బయటే నిలబడి తల మాత్రం లోపల బెట్టుతూ ''నాన్న చదువు మానెయ్యమన్నాడని అన్న అలిగాడట'' అన్నాడు. ఇంతలో ముఖం పై నుంచి ముసుగు తీసేసి రవి తనను మింగేసే టట్టు చూడడంతోనే, అదేమీ తన తప్పు కాదన్నట్టుగా ''అఁ, అమ్మ చెప్పింది'' అని మళ్ళీ గోడ చాటుగా నిల్చున్నాడు.

''మా నాన్నతో చెప్పి మామయ్యతో నిన్ను చదివించమని చెబుతాలే బావా. ఇంత చిన్నదానికే అలగడం ఎందుకు'' ఏడుస్తున్న

చంటిపిల్లడిని సముదాయిస్తున్నట్టుగా శ్యామల మాట్లాడ్డం రవికి నవ్వు తెప్పించినా, యింటా బయటా అందరూ తనకే బుద్ధి చెబుతూండడంతో చిరాకు వేసి —

''అసలు నాచదువు సంగతి మీకెందుకు. చిన్న విషయానికే ఎందుకు రాద్ధాంతం చేస్తారు. ఇంతకూ నేను అంగానని ఎవరు జెప్పారు మీకు'' అంటూ టూత్ బ్రష్‌పై పేస్ట్ వేసుకుని బావి దగ్గరకు నడిచాడు.

''మొత్తంమీద సాధించావు'' అని అమల శ్యామలను మెచ్చుకుంది. ఇందులో తను జేసిందేమిటో శ్యామల కర్థం కాకపోయినా రవి అలుక మానినందుకు సంతోషించింది.

మధ్యాహ్నం ముభావంగానైనా రవి చారన్నం తిన్నందుకు జానకమ్మ సంతోషించింది. సాయంత్రం మళ్ళీ శ్యామల వచ్చేవరకూ రవి ఎవ్వరితోనూ ఎక్కువగా మాట్లాడలేదు.

నాలుగున్నరకు మళ్ళీ వచ్చిన శ్యామలతో అమల అంది ''మొత్తంమీద పెళ్ళిగాకముందే మా అన్నను వల్లో వేసుకున్నావు. మధ్యాహ్నం నుంచీ 'నువ్వువచ్చావా' అని రెండుమూడు సార్లడిగాడు''

రవి తనపై శ్రద్ధచూపడం ఒకందుకు శ్యామలకు ఆనందం కల్గించినా — అంతలోనే ఆశ్చర్యమూ కల్గించింది.

డాబాపై పచార్లు చేస్తున్న రవితో శ్యామల అడిగింది. ''ఎందుకు బావా, ఈరోజు నన్ను రెండుసార్లు అడిగావట!''

రవి పచార్లు ముగించి, పిట్టగోడపై కూర్చుంటూ చెప్పాడు. ''మరేంలేదు, నువ్వే అన్నావుగా! మామయ్యను నా చదువు సంగతి నాన్నతో మాట్లాడమంటానని. నిజానికి మా నాన్నకు మామయ్య మాటంటేనే కొంచెం గురి. ఎలాగైనా ఎం ఏ అయినా పూర్తయ్యేటట్టు చూడమని మీ నాన్నతో చెప్పు'' అంటూ ముగించాడు రవి.

'ఓహో, యిది చదువుమీద శ్రద్ధ కాబోలు. యింకా తన మీదే అనుకుంది కాదు నయం' శ్యామల కొంచెం నిరాశపడింది.

''అదేం భాగ్యంలే. నీ అంత తెలివైనవాడు కాకపోతే ఇంకెవరు ఎం ఏ చదవగలరు'' అంది శ్యామల.

మబ్బులు ముసురుకోవడంతో యింటి కెళ్ళాలని లేచింది శ్యామల. ఇంతలో తోటలో నుంచీ మళ్ళీ కోయిల కూత విన రావడంతో నవ్వుతూ రవికేసి చూస్తూ అంది.

''కోయిల కన్పించిందా. భలే తెల్లగా వుంది గదూ.''

''మరే. నీ అంత తెల్లగా వుంది'' నవ్వుతూ అన్నాడు రవి.

* * *

మరునాడు సాయంత్రం రవి వీధిలోకి వస్తూనే శారదతో మాటాడుతున్న చంద్రబాబు, రమేష్, శ్రీధర్ కన్పించారు. చంద్రబాబు తాను మద్రాసులో వున్నప్పుడు తమ రెండో ఇంట్లో వుండిన ఆంగ్లోయిండియన్ స్త్రీలు కడుపుతో వున్నప్పుడు పడే అవస్థల్ని, తీసుకునే జాగ్రత్తల్ని చిత్ర విచిత్రంగా చెబుతుంటే, ఆ మాటలకు శారద పడి పడీ నవ్వుతూంది. అంతకు ముందు అతన్ని గురించి ఎక్కువగా ఆలోచించి వుండడంచేత, స్నేహితుల ద్వారా అతన్ని గురించి వినివుండడంచేత రవికి యితడే 'చంద్రబాబు' అని తెలుసుకోవడంలో ఆట్టే శ్రమ కలుగలేదు. విపరీతంగా మాసిపోవడం మినహా అతని బట్టలన్నీ ఆధునికంగానే వున్నాయి.

శ్రీధర్ రవిని పరిచయం చేయడంతోనే చంద్రబాబు చేయి ముందుకు సాచి 'గ్లాడ్ టు మీట్ యూ'' అంటూ అతని చేతిని రెండుసార్లు ఊపి వదిలాడు.

రమేష్‌తో రవిని సాయంత్రం భోజనానికి తీసుకురమ్మనిచెప్పి శారద యింట్లోకి వెళ్ళిపోయింది.

మిత్రులందరూ స్టేషన్‌వైపు నడిచారు. మద్రాస్‌లో తాము కాలేజీలో కొత్తవారితో స్నేహం చేసేటప్పుడు విధిగా టీ తీసుకునే వారిమని చెబుతూ చంద్రబాబు ఊరిలో మస్తాన్ టీ హోటల్లోకి దూరబోయాడు.

కుంపటిమీద యిప్పుడే పచ్చిపాలు పెట్టానని, కాగడానికింకా ఒక పావుగంట పడుతుందని మస్తాన్ సెలవియ్యడంతో, చంద్రబాబుకు ప్రక్కనేవున్న చెంగల్రాయుని టీ హోటల్లోకి నడవక తప్పింది కాదు.

చంద్రబాబును చూడడంతోనే చెంగల్రాయుని ముఖం జేవురించింది. నోట్లోని బీడీని ఆర్పి చెవులపై పెట్టుకుంటూ ఏదో అనడానికి ఉపక్రమించినవాడు వెనుకనేవస్తున్న రవిని చూడడంతోనే బలవంతాన ముఖం ప్రసన్నం చేసుకున్నాడు.

చంద్రబాబు ఇదేమీ గమనించనట్టు ''నాలుగు కాఫీ లియ్యవోయ్'' అంటూ పాకలో ఒక మూలగా వుంచిన చిమ్నీ దీపం దగ్గరికెళ్ళి సిగరెట్టు ముట్టించుకున్నాడు.

కాఫీలు త్రాగిన తర్వాత మరో సిగరెట్టు ముట్టించుకుంటూ అన్నాడు చంద్రబాబు ''అసలు ఊపిరి పీల్చకుండా అయినా నేనొక గంట ఉండగలను కానీండి — అదేం ఖర్మో ఈ సిగరెట్టు పొగ పీల్చకుండా పది నిమిషాలు ఉండలేనంటే నమ్మండి ... ... ఒకసారి ఏం జరిగిందో తెలుసా? ఎట్లా తెలిసిందో ఏమో, డైలీ నేను నైట్ మీల్స్ తర్వాత విధిగా డాబా పైకెళ్ళి సిగరెట్టు కాలుస్తున్నానని మా ఫాదర్‌కు డౌట్‌వచ్చింది. ఒకరోజు నేను వోటిలో సిగరెట్టు వుంచుకునే సరికి అతను గూడా డాబాపై కొచ్చేశాడు. అప్పుడు నేనేం జేసాననుకుంటున్నారు ?''

సిగరెట్టు చివర ఏర్పడిన మసిని రాల్చి మళ్ళీ నోట్లో పెట్టుకుని గట్టిగా పీలుస్తూ ఆగాడు చంద్రబాబు. రమేష్, శ్రీధర్ ''ఏం చేశావు ఏం చేశావ''ంట్లూ పరమానక్తులయిపోయారు.

నవ్వడం మాట్లాడ్డం ఏకకాలంలోజేస్తూ ''క్వైట్‌ సింపుల్‌. 'మాచ్‌బాక్స్‌ ఉందా' అని అడి న''అన్నాడు చంద్రబాబు చంద్రబాబు తెలివికి, లెగువరు, సమయస్ఫూర్తికి మిత్రద్వయం తెగ సంబరపడిపోయారు.

ఇదంతా వింటున్న చెంగల్రాయులు ఒకక్షణం తర్వాత నవ్వి మొదలుబెట్టాడు.

''ఓయబ్బో! దీన్నొక పెద్ద కథగా సెప్తావుండావు. అయితే యిది యిప్పటి సంగతి కాదులే. మాయమ్మ కడగొట్టోన్ని గని మంచం దిగకుండా వున్నప్పుడు, మేమంతా నెల్లాళ్ళు దినం మార్చి దినం గెంజి దాగి కాలం గడుపుకుంటిమే — అప్పుడు సంగతి. చేసే గాజుల యాపారం మానేసి మా నాయిన ఎవిలో ఒక పరాయిదాని మాయలో పడిపోయె. మాయమ్మ బాలింతరాలా. వారానికి నాలుగు మాట్లు సలి జొరంకొట్టి ఆసమ్మత్సరం పెద్ద పండుగకు ముందు నాదు ముందునాడే ఆమే కడతేరిపోయె. మున్నొన్న కన్నోడు కడాన ఆమె సావుక్కూడా రాలా. ఊళ్ళోవాడెవడూ మా మొగం సూడ్లా. నాకేం దిక్కు తోచకపోతే — పోయి పోయి మన రవిబాబు వాళ్ళ నాయిన కాళ్ళబడినా. ఆ పెద్దమనిసి మేమున్న కొంపను గోవింద సెట్టికాడ అడమానం పెట్టించి ఇన్నూరు రూపాయలు ఇప్పించి నాడు. దాంతో మళ్ళా మా నాయిన దించేసిన మలారం బుజాని కెత్తుకోని దేశంమీద బడితి. ఒకింట్లో ముత్తైదర్లకి గాజులేస్తావుంటే ఎడకింట్లో నుంచి మానాయి నూడిపడె ఒక చనం నా వొళ్ళు మానయిపోయిందనుకో.''

శ్రోతల్లో రియాక్షన్ చూడడం కోసం ఆగాడు చెంగల్రాయులు.

''ఏం జేస్తివప్పుడు?'' కరటక దమనకుల్లా శ్రీధరూ రమేషూ ఎగబడ్డారు.

''ఏసిన గాజుల కామెకాడ ఒకనయా పైన దీసుకోలే. మలార మెత్తుకోని గడపదాటి పోయేతలికి ఆయమ్మ అడ్డమొచ్చి 'అదేందిరా అబ్బీ. చేతికి గాజులేసి దుడ్డు మర్సిపోతా వుండావు. ఈ రకంగా జేరంజేస్తే నువ్వేం బతికి బట్టకడతావు' అని ర్నూపాయి నోటు సేతిలో పెట్టింది.''

''తీసుకుంటివా'' ''ఆఁ మళ్ళేమయింది'' అంటూ కళ్ళు మిటకరిస్తూ ప్రశ్నించారు మిత్రద్వయం.

జోబీలో వుండే చిల్లరా, నోట్లు అంతా జవిరి ఆమె చేతిలో బోస్తూ కడమాటగా యిట్ట జెప్పి చక్కా వచ్చేసినా.

''వద్దులేతల్లీ ఇదంతాకూడా నువ్వుపెట్టుకోని నూరేండ్లు రాజ్జమేలు. మా నాయినెప్పుడైనా ఇంటికెలబారితే చార్జీకిమాత్రం నాలుగు రూపాయి లియ్య.''

రవి కళ్ళల్లో తిరిగిన నీళ్ళను కర్చీఫ్‌తో తుడుచుకుంటున్నాడు. భరించలేనట్టుగా చంద్రబాబు ఎప్పుడో రోడ్లో వున్నాడు. మిత్రద్వయం ముఖాల్లో కత్తివేటుకు నెత్తురుచుక్కలేదు.

కన్నీళ్ళొత్తుకుంటూ ఆనాటికి ఉంగరంతోక్కసూ ఉన్నాడు చెంగల్రాయులు.

'ఆ ఎర్రాటి ఒక వారం తిరక్కముందే మా నాయన ఇంటి కగ్గిబడె. నేనిప్పుడు మా ఇంట్లో ఎవరికీ సెప్పలా. ఆ గాజులన్నీ సంచిలో పెట్టుకోని, మూలింట్లో గూట్లో పెట్టి తరిమేసిందని ఆ రోజు రాత్రికాడ చెప్పుకుంటూ ఏడిసిండె.''

రవిచేసి తిరిగి కథ ముగింపేస్తున్నట్టుగా ఒకమాట జెప్పాడు చెంగల్రాయులు.

''అయితే ఒకటయ్యా! ఆయమ్మ ఎప్పుడైతే పిలిగాని నేనే పొద్దు ఆ వూరికి పోయినా వాళ్ళింట్లో అన్నం తినందేగాక వదిలి బెట్టదు. వచ్చేటప్పుడు బిడ్డలకిమ్మని రిబ్బన్లు పాపిడి, గాజు దాక ఏందేందో ఇప్పిపంపతాది. మొన్న కడసారి ఆడికిపోయినప్పుడు కండ్లల్లో మెదలలావుండాదని మా నాయన్ను కూడ ఒకసారి పిల్చుకు పొమ్మనె.''

రవికి తాను, చెంగల్రాయులు, శ్రీధరూ — అందరూ కలసి అయిదో తరగతి చదివేటప్పుడు ఉండిన తెలుగు ఉపవాచకంలోని 'ధర్మవ్యాధుడు' పాఠం గుర్తుకు వచ్చింది. నిజానికి ఆ కథ చెంగల్రాయులు ఎప్పుడో మర్చిపోయి వుంటాడు. అయితే తాను గుర్తు వుంచుకుని మాత్రం ఏ విధంగానైనా చెంగల్రాయు లంత ఉన్నత హృదయుడు కాలేగాడా? నిన్నకు నిన్న చదువు మానమనగానే తల్లిదండ్రులను నిందించి తాను ఆలోచించిన సరళి గుర్తుకు రాగానే రవి తీవ్ర పశ్చాత్తాపానికి గురైపోయాడు.

అయితే పుస్తకంలో తాను చదివిన ధర్మవ్యాధుని కథ గాని, నిజజీవితంలోని చెంగల్రాయుల ఔన్నత్యంగాని రమేష్‌ను, శ్రీధర్‌ను మార్చినట్టు లేదు. కరటక దమనకు లిద్దరూ బిల్లు చంద్రబాబు ఇస్తాడా, రవి యిస్తాడా అని యిద్దరికేసి మార్చి మార్చి చూస్తున్నారు. చెంగల్రాయుల చూపు మాత్రం చంద్రబాబు పైనే వుంది.

రవి జేబులో చెయ్యిపెట్టగానే—సైగలతోనే కూర్చోమని సిగరెట్టును కాలి కింద నలిపేస్తూ చంద్రబాబు పరుగెత్తుకొచ్చేశాడు. 'అప్పా. ఇదేమిటి పిరిస్తారా. మంచివారే. ఉండండుండండి'' అని ఐదు రూపాయల నోటుదీసి చెంగల్రాయుల చేతిలో వుంచాడు.

తడిచేతిని తొడలమీద రుద్దుకుంటూ చెంగల్రాయులు ఒక క్షణం జాప్యం జేయడంలో ''చిల్లర లేదుటోయ్‌. ఉంచుకో. మళ్ళీ యిద్దువుగాని'' అంటూ జవాబు కోసం ఎదురు చూడకుండ వీధిలోకి వచ్చేశాడు చంద్రబాబు.

ఆరోజు సాయంత్రం ఏడుగంటలదాకా అందరూ మాట్లాడు కుంటూ ఊరంతా తిరిగారు.

సంభాషణ ముగిసే సమయానికి రవికి చంద్రబాబుపైవున్న సదభిప్రాయం కాస్తా పోయింది. చంద్రబాబు పైతం రవిని యిక మీదట వీలయినంత దూరంగనే వుంచాలని అనుకున్నట్టు మరుసటి రోజు అతడు తనను గురించి శ్రీధర్‌తో చెప్పిన మాటలను బట్టి అవగతమయింది.

ముఖ్యంగా 'మద్రాసు స్టేట్‌లో ఇంటర్ మీడియట్ లేదన టము', సమర్‌గుహ అన్నది ఒక మనిషి పేరేనని, గుహపేరు కాదని చెప్పడమూ లాంటి పనులు స్వదేశ రక్షణకు భంగం కల్గించే రహస్యాలను శత్రుదేశాల్లో బయట పెట్టినంత నేరంగా చంద్రబాబు భావించినట్టు రవి గ్రహించాడు

"లిక్కర్‌గాని, సిగరెట్‌ని ఆఫర్ చేసినప్పుడు వద్దనటం లాంటి ఇన్సల్టేట్స్ చేయాల్సిన పనిని రవి లాంటి ఎడ్యుకేటెడ్ ఫెలో చేయడం తానే మాత్రం సహించలేడనీ, ఆ మాత్రం మేనర్స్‌లేని వాళ్ళతో తానొక క్షణమైనా ఫ్రెండ్‌షిప్ చేయలేననీ తనతో సీక్రెట్‌గా చెప్పినట్టు" శ్రీధర్ రవితో చెప్పడంతో అతనిలో ఈ అనుమానం కాస్తా బలపడింది.

అయితే చంద్రబాబు ప్రభావం నుంచీ మిత్రులను తప్పించడానికి రవి చేసిన ప్రయత్నాలు దాదాపు వ్యర్థం అయ్యాయి. తాను చెప్పినదానికంతా సరేననడమూ, మళ్ళీ యథాప్రకారం అతనిలో తిరగడమూ జూచి, తన అశక్తతను గుర్తించి మళ్ళీ ఆ ప్రయత్నం చేయదలచుకోలేదు రవి పోగా రవిని వేధిస్తున్న సమస్య ఇంకొకటి గూడవుంది ఇతనితో స్టేషనుమాష్టరూ, ఆయన కుటుంబమూ ఎలా వేగుతున్నారా అని. తాను ఊరికి వచ్చిన రోజు నుంచీ మళ్ళీ యింతవరకు స్టేషన్‌వైపు వెళ్ళి రాకపోవడం గుర్తువచ్చింది. అంతేగాక తన చదువు విషయంలో తనకయినా, తండ్రికయినా సలహా నివ్వగలవాడు శ్రీరాములేనన్న తలంపు రావడంతో వీలయినంత త్వరగా స్టేషనుకు వెళ్ళి రావాలనుకున్నాడు రవి.

(ఇంకా వుంది)

# కవులు - బహువచనమ్

## శ్రీ దేశపతి గోపాలకృష్ణ

కవి తన ఇష్టం వచ్చినట్లు
తత్వ వివేచనం చేయటం
ప్రకృతిని నిజకవితలో
ప్రతిబింబింప చేయడం
ఒక సరదా
పాపాలపై వేయడెప్పుడూ
అతడు నీచమైన పరదా.

* * *

బాధపడే దీనజనతనుచూచి
అన్నార్తులనూ - అర్ధనగ్నులనూ
కౌగిలించి — వాళ్లగోడు
కరుణరసంగా సృష్టించి
ఏడుల్లో వరుణుని కృపా
రసవర్షంలా — ఆంధ్రభూ
రమా వక్షోజాల్లోనుండి
పారే క్షీరధారల్లా
ప్రకృతి దేవీకటాక్షంతో
పారుతున్న గోదావరీ
కృష్ణల్లాగా — పరోపకార
సుమతి బీజాలునాటి
భువిని నందనం చేస్తాడు
కవి — మహా మనీషి.

* * *

సుకవితగల కవిరాట్టుకు
సాహితీ మధురిమ పంచే
రసరాజ్యం కావాలి —
శుష్కమైన ఎలక్షన్ భిక్షాపాత్ర - కవి
మస్తిష్కంలో ఆడదు
ప్రజాస్వామికంలో రుజాస్వామ్యం
పోవాలి ! అదీ అతని దీక్ష !

* * *

అతడు దండపాణి — కోదండపాణి
అనంత ప్రళయకాల రౌద్ర నాట్యంచేసే
శూలపాణి — అన్యాయైక జీవికో
పాత్ర స్వార్థశక్తుల బాహిరభక్తికీ
అంతరంగంలో కేవలభుక్తి
మాత్ర దురుద్దేశాల ప్రాణాలకూ.

కవి చేతిలో దేశద్రోహులు
గరుత్మంతుని నోటి పాములు
నరసింహం కొర్రికి పారవేసిన
హిరణ్యాకశిపులు !
వీరభద్రుడు కోసిన శీర్షహీన
పశ్చాత్తప్త దక్షప్రజాపతులు !

మొదటి వాల్మీకి ఒకడే కవి
(ఏకవచనం)
అతడూ వ్యాసుడూ కలిసి లెక్కిస్తే
(ద్వివచనం)
తరువాత ఈనాడు
కరువుతీరా — వ్రాసికొంటున్న
కవి బ్రువులు అనేకులు.
(బహువచనం)

డా. జి. జవహరలాలు

# సంగతముగాని చెఱువుబెళగళు తామ్రశాసనం

యుక్తముగాని శాసనములు తరచూ లభ్యమవుతూ ఉంటవి. ఇటువంటి కోవకు చెందిన సంఖ్య తామ్రశాసనములలో ఎక్కువ. సర్వసాధారణముగా శాసనములు రెండురకములు—బాహాట శాసనములు (Public records) మరియు రహస్య లేక సొంత శాసనాలు (Private records). వీటిలో రహస్యమైనవి తామ్ర శాసన రూపములో ఉండును. బాహాటమైనవి శిలాశాసన రూపములో ఉండును. కల్పనలు, ప్రగల్భాలు, పొగడ్తలు రహస్య శాసనాలలో చోటుచేసుకొంటే, యుక్తమైన కార్యములే బాహాట శాసనాలు తెలుపుతవి. అంటే శిలాశాసనాలన్నియు సంగతములు కానేరవు. కాని చరిత్రకారులు శిలాశాసనాల (lithic records)కే ఎక్కువ ప్రాముఖ్యం యిస్తూవుంటారు. యుక్తముగాని విషయాలు శాసనమూలంగా వెలుగులోనికివస్తే సామాన్య పాఠకులకు ఊరట కలిగించినా చరిత్రకారులకు మాత్రం తలనొప్పి. ఒక్కొక్కసారి సంగతముగాని విషయముగూడ మనోహరమై శ్రద్ధ కలిగిస్తూ ఉంటుంది. అటువంటి విషయమునే యీ తామ్రశాసనం మన కందిస్తుంది.

అసలు యీ తామ్రశాసన వునికి కర్నూలులోని సిల్వర్ జూబ్లీ కాలేజిలో చరిత్రోపాధ్యాయులుగా పనిచేయుచున్న డా. ఎ. నాగభూషణంద్వారా నాకు తెలియవచ్చినది. ఇది కర్నూలు తాలూకా చెఱువు బెళగళు గ్రామ భూస్వామి శ్రీ సి. బి. సోమేశ్వరరెడ్డిగారి స్వాధీనములో నున్నది. ఆ గ్రామానికి వారు మునసబు మరియు మోతుబరి గూడా. నేను వారిని వారి స్వగృహంలో కలిసినప్పుడు దయతో వారు యీ తామ్రరేకును పురావస్తు శాఖకు దానము యిచ్చియున్నారు. వారికి కృతజ్ఞులం.

శాసనము ఒకే తామ్రపలక (Copper plate)పై రెండు వైపులా తెలుగు లిపిలో వ్రాయబడిఉన్నది. మొత్తం పంక్తులు 58. తామ్రపలక యిటుకాకారము (Rectangle) గల్గి నాల్గుమూలలా నాల్గు చిన్న రంధ్రములు కల్గి ఉన్నది. అక్షరములు శుభ్రముగా చెక్కబడి ప్రస్తుత తెలుగు లిపికి చేరువగా నున్నందున పరిశోధన సరళముగాసాగింది. భాషాపరిచ్ఛేదములో ముఖ్యమైన భేదములు కానరావు. కాని, శాసన భాషయందు ప్రస్తుతము వాడుకలోగల దీర్ఘము హ్రస్వమునకు గల తేడా కనబరచినట్లు కానకాదు. శాసనమంతయు తెలుగు భాషలో సాగి ఒక్క సంస్కృత శ్లోకం (పంక్తులు : 45–48) మాత్రం వాడబడినది.

## శాసన విషయం

శాసనం విరూపాక్ష శారదాదేవి స్తుతులతో ప్రారంభింపబడినది. సాలువ నరసింహరాయల పుత్రుండైన శ్రీకృష్ణదేవరాయలు, చెఱువు బెళగలు దాని షోడశ స్థలాల 'పెదరెడ్డి' తనమును హోసూరు ప్రముఖులైన కామిరెడ్డి నాయకుడు, కంరెడ్డి నాయకుడు, మోపిరెడ్డి నాయకుడు, గొల్లపాలెగాండ్లను ఓడించి పై స్థలాలలో శాంతిని నెలకొల్పిన సందర్భమున, వారికి ఒప్పచెప్పినట్లు తెలుపుచున్నది. శాసనము తారీఖు గలది. శ్రీకృష్ణదేవరాయలు చెఱువు బెళగళు దాని 16 గ్రామాల పెత్తనం హోసూరు ప్రముఖులకు శకసంవత్సరము 1413, శార్వరి, కార్తిక శు॥ 15. ధారాదత్తం చేసినట్లు శాసనంలో చెప్పబడినది. కాని శాసనమున చెప్పబడినట్లు శార్వరి సంవత్సరము శక సంవత్సరము 1413నకు సరిపడుటలేదు. కాని విరోధికృతి సంవత్సరమునకు సరిపడుచున్నది. అయిన శాసనకాలము 17–10–1491గా నిర్ణయించవచ్చును. శాసన కాలము విషయంలో యిటువంటి, చిల్లర తప్పులు దొర్లుట సహజము. కారణాలు మాత్రం యింతమిద్ధంగా తెలియవు. శాసనము సాలువ నరసింహరాయల రాజ్యకాలమునకు చెందినా, వివరణ మాత్రం కృష్ణదేవరాయలది.

శాసనాలు కల్పనగా ఎంచుటకు చరిత్రకారులు కొన్ని విషయాలు పరిగణలోనికి తీసుకుంటారు. శాసన విషయము, తామ్రశాసనాలైన వాటి రేకుల సైజు, అక్షరపొందిక, శాసనంలో వాడిన భాషాపరిచ్ఛేదము మొదలగునవి విడిగా పరికించి గాని శాసనాలను కల్పనగా చరిత్ర పరిశోధకులు నిర్ణయించరు. ప్రస్తుత శాసనము, శాసన కాలమున (క్రీ. శ. 15-వ శతాబ్దము)గల భాషగాని, అక్షర పొందిక గాని కలిగి ఉండలేదు. ఒక్కొక్కచోట అప్పటి అక్షర పొందిక, యిప్పటి వర్ణక్రమము కలిగివున్నవి. ఇటువంటి లోపములు సంగతములైన శాసనాలలో కానరావు. పైగా విజయనగర రాజుల తామ్రశాసనాలన్నియు ఒకే ఆకారముగల్గి, రాజలాంఛనమైన 'వరాహ'ముద్ర కల్గి వుంటవి. వాటికి భిన్నముగా యీ తామ్ర శాసనమున్నది.

ఊరట కలిగించు విషయం యీ శాసనం తెలుపుచున్నదని పైని చెప్పియుంటిని. ఇప్పటివరకు రాజ్యాభిషేకమునకు ముందు కృష్ణదేవరాయల స్థితి ఇట్టిదని నిర్ణయించి తెలుపుటకు తగినాధారములు లేవు. కాని యీ శాసనమువలన కృష్ణదేవరాయలు సాళువ నరశింహరాయల రాజ్యపరిపాలనలో బాల్యోన్నట్లు తెలియుచున్నది. పైగా కృష్ణదేవరాయలు సాళువ నరసింహరాయుని పుత్రునిగ యీ శాసనం పేర్కొనుచున్నది. ఇది చరిత్ర విరుద్ధము. ఏలయన శ్రీకృష్ణదేవరాయలు వీరనరసానాయకుని పుత్రుడు.[1] ఇది జగమెరిగిన సత్యం. ఇది వ్రాయస గాని తప్పుగా తీసుకోవచ్చును. ఇటువంటి తప్పులు విజయనగర రాజుల శాసనాలలో తరచుగా కనబడుతూ వుంటవి. ఒక కర్నాటక శాసనములో[2] శ్రీకృష్ణదేవరాయలు అచ్యుతరాయుని పుత్రునిగా పేర్కొనబడినది.

రాజ్యాభిషేకమునకు పూర్వము కృష్ణదేవరాయల స్థితి తెలుపు శాసనాలు సంగతముగానివే లభ్యమగుట శోచనీయం. ఒకానొక కన్నడ శాసనము కృష్ణదేవరాయలు చంద్రగిరి పెనుగొండ దుర్గములకు పాలకుడైనటు తెలుపుచున్నది. తదుపరి ఆ శాసనమును కల్పనగా చరిత్రకారులు నిర్ణయించిరి.[3] ఇక 'కొంగుదేశ రాజాక్కళ్ చరిత్ర' యను నరవ ఇతిహాస గ్రంథమునందు వీరనరసింహరాయల యేలుబడిలో యున్నను దన రాజ్యపాలనమున కృష్ణదేవరాయలు దోడ్పడినట్లు చెప్పుచున్నది.[4] దీనిని రుజువు వేయగల సాక్ష్యమేదియు నింతవరకులభ్యపడలేదు. కాని 'న్యూనిసు' గ్రంథము దీనికి భిన్నముగా తెలుపుటవలన చారిత్రికులు నరవ ఇతిహాస కథనమును కల్పనగా భావించిరి. ఏమైనా ఒక్కటిమాత్రం నిజం. చారిత్రకులు శ్రీకృష్ణదేవరాయల రాజ్యాభిషేకమునకు పూర్వపు స్థితిపై యింతవరకు శ్రద్ధతో పరిశోధన సాగించలేదు. ఈమధ్య శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు మద్రాసులో జరిగిన శాసన పరిశోధకుల గోష్ఠిలో కృష్ణరాయల 'పుట్టినతేది' (Date of birth)పై వ్యాసము చదివియున్నారు. శ్రీకృష్ణదేవరాయలు దక్షిణదేశ చక్రవర్తులలో ప్రఖ్యాతుడు. ఆ మహారాజు కీర్తి దాక్షిణాత్య హిందూ హృదయసీమల స్థిరముగ నెలకొనియున్నను, ఆయన చరిత్ర చారిత్రికులకు గూడ సంపూర్ణముగా సుపరిచితము గాకపోవుట నిజముగా విడ్డూరమే!!

శాసన విషయం యుక్తముగాక పోయినను, క్రీ. శ.1491 సంవత్సరమున గొల్లపాలెగాండ్లను ఓడించిన తరుణం పురస్కరించుకొని కృష్ణదేవరాయలు హోసూరు ప్రముఖులైన కామిరెడ్డి నాయన, కళిరెడ్డినాయన, మరియు ముప్పిరెడ్డి నాయకులను రావించి చెఱువు బెళుగళు దాని 16 గ్రామాలలో (షోడశ స్థలాలు) [(1) చామల గూడనారు (2) కడిమిట్ట (3) అలువాల (4) బూరందొడ్డి (5) గొల్లలదొడ్డి (6) కంభంపాడు (7) పలుగువొడ్డి (8) తిమ్మనదొడి (9) శశిసోమంపురం (10) క్రిష్ణయవొడ్డి (11) బేతవోలు (12) ఏనుగుబాల చినమరివీడు (13) పెదనెలటూరు (14) కులుమల (15) అంధ్రీ (16) బైరవాడి] విరూపాక్ష రాజ్యం నెలకొల్పె మిషతో నారికి వాటి పాలనప్పగించినట్లు విదితమగుచున్నది. పైని తెల్పిన షోడశస్థలాలు యిప్పటికీ శాసనములో పేర్కొన్న నామముల తోనే పిలువబడుచూ చెఱువు బెళుగళు పరిసరములలో నుండుట గమనార్హము. తదుపరి, శాసనము యీ 16 గ్రామాల సరిహద్దులను వివరంగా విశదపరచుచున్నది. వాటి వివరణ యీ విధంగా ఉంది.

| | గ్రామముల పేర్లు | వాటి సరిహద్దులు |
|---|---|---|
| 1 | బెళుగల్లు చామల గూడనారుకు | పిల్లిగుండ్లు |
| 2 | అలువాలకు బెళుగల్లుకు | బంటకుంట |
| 3 | యేనుగు బాలకు అలువాలకు | జమ్మిమాను |
| 4 | పెదనెలటూరుకు బూరందొడ్డికి | గోనుమాను |
| 5 | అలువాల చినమరి వీడికి | వుప్పుమోడ |
| 6 | పెదనెలటూరుకు అలువాలకు | బంటకుంట |
| 7 | చినమరివీడికి చిననెలటూరికి | శ్వేతవర్ణ పాషణం |
| 8 | యర్రగుంట, పెదనెలటూరు, చినమరివీడు | శ్వేతవర్ణపు పుట్టు పాషాణం |
| 9 | కులుమాలకు చినమరివీడికి | నల్లవెన |
| 10 | బూరందొడ్డి యెరుగుదొడ్డి పెదనెలటూరికి | మొతుకమాను |
| 11 | పెదనెలటూరు, పులుకుర్తి కల్లపరు, చిననెలటూరికి | నేలబండ (శాసనంగలది) |
| 12 | కులుమాల, చిననెలటూరు ఖయిరవాడికి | గాజులదిన్న |
| 13 | ఖయిరవాడికి, అందరికి | మోతుకుచెట్టు |
| 14 | కులుమాలకు, గోనెగండకు | మంగళమిట్ట |
| 15 | చినమరివీడు, కలుమాల, గోనెగండకు | సోమినేని చెఱువు |
| 16 | చినమరివీడు, గుల్లిమార్పు గోనెగండకు | బా(రి)కెనాని చేను |
| 17 | అలువాలకు, గుల్లమార్పుకు చినమరివీటికి | మోద |
| 18 | యేనుగుబాల, పెసలదిన్న | ఆరమానిచేను |
| 19 | పాపకలదిన్న, కంభంపాడు దండుదిన్న | బెళుగంటికి దారిలోనున్న మంగళగుట్టలో పుట్టు పాషాణం (శాసనంగలది) |
| 20 | పాపకలదిన్న, చామల గూడనారు కంభంపాటి | శ్వేతవర్ణ పాషాణం (శాసనం గలది) |
| 21 | కంభంపాడు, అలువాల, యేనుగుబాల | వాగుకు తూర్పునగల తెల్లరాయి (శాసనంగలది) |

తదుపరి పై సప్తాదశ (పదిహేడు) గ్రామవాసులు చేసిన కార్యముల వివరణ కందు. కామిరెడ్డినాయక కంరెడ్డి నాయక ముమ్మడి నాయనిగార్లు ఖయిరవాడవద్ద బావి త్రవ్వించి దానికి దక్షిణాన అంధ్రి, వుత్తరాన తుంగభద్ర ఆదిగానుగల వూళ్ళ 'రెడ్డి మిరాశి' తనకును బడసినారు. కులుమాంలోని లింగయ్య మర్రి మాను వేయించి పేరుగాంచెను. చినమంపీడులో హొనసూరువారి ఆడుబిడ్డ కామెంమ్మ బావి త్రవ్వించి శిలాస్తంబాలు ఎత్తించెను. యేనుగు బాలకు దక్షిణదిశను మర్రిమానులు, పెదనెలటూరికి తూర్పుననున్న బావివద్ద చింతమాను వేయించిరి. తరువాత శాసనములో యీ పదహారు గ్రామాలలోనుంచి 12 జాతుల (ద్వాదశ జాతి) వివరణ గూడ నున్నది. శాసనం తెలుగులో ఉండుటవలన వీటి వివరణ యిక్కడివ్వలేదు. కృష్ణంగా తెలుసుకోగోరువారు మూలపాఠము చూడవలెను.

శాసనములో 'మిరాశి' పదము వాడబడినది. దీనిని వంశ పారంపర్యముగా వచ్చు హక్కుగా తీసుకోవచ్చును. తదుపరి 'బారా బలవంతులు' (పంక్తి 44) తెలుపబడినది. దీనిని 'బారబలోతీలు'గా తీసుకోవచ్చును అయిన 12 గ్రామసేవకుల వివరణ గూడ కలదు. నంబి, రెడ్డి, కరణము, పురోహితుడు, తలారి, చంద్రడంగి, కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, మాల మాదిగ. వీరే పన్నిద్దరు గ్రామసేవకులు. ఇదే వివరణ శ్లోకంలో యివ్వబడినది.

శాసన విషయము చరిత్ర సమ్మతము గాకపోయినా అన్ని తామ్రశాసనాలు యిచ్చు పూర్తి వివరణ యిది గగ్గవున్నది. పైగా రాయలవారి రాజ్యాభిషేకమునకు బూర్వం స్థితిపై పరిశోధనావశ్యకత యిది చాటుచున్నది.

## శాసనపాఠము

(తామ్రపలక పై భాగమున)

బడా యీశ్వరయ్య కొండయ్య సII చెరు
వు బెళగంటికి సమీలుకు (దే)శాయిలు

### మొదటిముఖం

1 అవిఘ్నమస్తు ॥ శుభమస్తు ॥ శ్రీవిరు(రూ)పాక్ష

2 లింగ ॥ శ్రీశారదాంబా యేంన్నమః ॥

3 స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబు

4 లు 1413 లగునేటి శర్వరి నామ సంవత్సర కార్తీక
శు. 15 లు శ్రీమకం

5 స్వహో అస్మత్రింశతి మండలాధీశ్వరుండైన శాళ్వ నరశింగ
క్షమా ధీశ్వరు—

6 పుత్రుండైర శ్రీకృష్ణదేవరాయలు హొసూరునుంచి వచ్చిన నాయక సమూహాన వచ్చిన

7 కామిరెడ్డి నాయక కరిరెడ్డి నాయక ముంపుడరెడ్డి నాయక యీా మొదలయ్నవారికి మిరా—

8 శిరెడ్డిమిరాశి యిచ్చి వివరం। గొల్లలు పాళెగాండ్లు అయి మూగాలు సాగనియ్యక చాలా దృ—

9 ష్ట తనం చేస్తావున్నగాను వారిని మీరు గెలిచి జయలక్ష్మి చేకొనినారు గనుక మీకు చెరు—

10 పు బెళుగల్లు ఆదిగాను చామలగూడారు — కడిమెట్ల- అలువాల—బూరందొడ్డి—గొ+

11 ల్లం దొడ్డి—కంపంపాడు - పలుగుదొడ్డి - తిమ్మనదొడ్డి— నడి సోమాపురం—కృష్ణయదొడ్డి

12 దేవరకోలు - యేనుగబాల—చ్నిమరివీడు—పెదనెలటూరు--కులు మాల—అంద్రి—ఖయిర—

13 వాడి—యీా మొదలయ్ని షోడశ స్థళాలకు మీరు అధ్యక్ష తలు అయినారు గనుక



మొదటి ముఖం

14 యీా స్థళాలు అన్ని మామురు చేయించి పూర్వం వున్న ప్రజల వృత్తిక్షేత్రాలు సురక్షితం—

15 గ్గాను—నడిపించి శ్రీవిరూపా క్షేశ్వరుని రాజ్యం ప్రశిద్ధి చేశేది బెళుగల్లు ఆదిగాను పల్లెలు

16 పదహారు అంతు సప్తాదశ గ్రామగ్రామాలు మిరాశి యిచ్చి స్థళ స్థళాలకు గ్రామగ్రామ త్రా —

17 లకు పొలిమేరలు యేర్పాటు చేసి రాయసం వీరమరుసును అంప్పించి శిలాశాసనాలు స్థాపిర (జం)

18 దవూలు వృక్షములు ఆదిగాను యేర్పరచినవివరం। పొలిమేరలు। బెళుగల్లు చామల గూడూ —

19 రుకు పిల్లిగుండ్లు। అలువాలకు బెళుగల్లుకు బంటకుంట। యేనుగు బాలకు అలువాలకు జం—

20 మ్మిమాను। పెదనెలటూరుకు బూరందొడ్డికి గోనుమాను। అలువాల చ్నిమర్వీటికి పుష్ప మోడ।

21 పెదనెలటూరుకు అలువాలకు బంటకుంట। చినమర్వీడు చ్నినెలటూరుకు నేలపాషాణం శ్వేతవ—

22 సీరం। యర్రగుంట। పెదనెలటూరు—చ్నిమర్వీటికి యర నేలను। బలుసుగుట్టలలోను పుట్టుపాషా—

23 ణంగుండు స్వేతవర్ణం। కులుమాలకు చ్నిమర్వీటికి నల్ల వెన। ఖయిరవాడికాడనుశిద్దోద [కా]—

24 లబావి తవ్వించి ప్రతిష్ఠ చేయించి కామిరెడ్డి నాయక కశిరెడ్డి నాయక—ముమ్మడి నాయనిగారు

25 దక్షిణానకు। అంధ్రిం—వుత్తరానకు తుంగ్గభద్ర ఆదిగాను పూళ్ళరెడ్డి మిరాశి ప్రశిద్ధి చేసినారు।

26 కులుమాల లింగ్గమ న్యను మ్రమాను వేయించి పేరు చేసినారు। చ్నిమర్వీటను కామె లంమ్మ

27 భావి తవించి హెసూరివారి ఆడుబిడ్డ కామెలంమ్మ శిలా కంభాలు ప్రతిష్ఠ చేయించి నారు

28 యేనుగు బాలకు దక్షిణమందు మ్రమాకులు వేయించిరి పెద నెలటూరి కు గ్రమం తూర్పున

29 వావి కాడను చింతమాను వెయించినారు। బూరందొడ్డి మెరుగుదొడ్డి పెదనెలటూరికి ము—

30 గుడ్డ మోతుకుమాను। పెద నెలటూరికి — పులుకుతిర్ కల్ల [ప]రికి చిననెలటూరికి మాగణంలోను

31 (నే)లబండ శాసనం। [కులు మాలకు] చ్నినెలటూరు ఖైర వాడికి [మొరుసున పారిమేర]। జా—

32 లదిం్న ఖైరవాడికి ముగ్గడ అందిరి। పాలిమేర మోతుక చెట్టు। కులుమాలకు

33 గోనెగండకు పాలిమేర మంగళ మిట్ట। చ్నిమరివీటికి కులు మాలకు గోనె గం—

34 డకు పాలి ర సోమినేని చెఱువు పరమట నేలబండశాసనం। చ్నిని మరి—

35 వీటికి గుల్లమా [ ] ర్వుకు గోనెగండకు మూటికి పాలిమేర బా(రి)వికె వా—

36 ని చేను। అలువాలకు గుల్లమార్వుకు చ్నిమరివీటికి పాలిమేర

37 కెల్లమోడ। యేనుగు బాలకు పెసల దిన్నెకు పాలిమేర ఆరమానిచేను



రెండవ ముఖం

38 పొ[ర్కొ]ల దింన కంభంపాడు దయందిన్నకు బెళుగంటి మాగక—

39 ములో [మంగ]గుట్టలో పుట్టు పాషాణం।శాసనం

## రెండవ ముఖం

40 పారొకలదింన్న చామల గూడారికి కంభంపాటికి [చవుట]

41 గ్రామాలు 3కి స్వేతవర్ణం పాషా[ణకు] (— —)శాసనం। కంభం—

42 [పాటికి] అలువాలకు యేనుగు బాలకు మూటికి వాగు తూపుర—

43 న తెల్లరాచికి శాసనం యీా ప్రకారం [గాను పొలిమేరలు]

44 నాలు యేపరరచిన వివరం॥ భారాబలవంతులు యవ—

45 రంటే వివరం॥ శ్లోకం॥ గణికః శిరికః స్వర్ణ మృడయః స్కార పర్వ కౌ।

46 త (మూ)రః కా(కు)ంభ కారశ్చ। శాండాల గ్వతలం త్త్రధా। నిక్రుష్మ కార్ప్య కాంభ—

47 ష్మోరజక శ్చయ ధ(క్రమం)। యేతే ద్వాదశ జాతినాం। గ్రామ భార -

48 శ్చ వాహకం॥ [సముత్తు] బెళ (గంట) పల్లె కుంన్ను కరణాలు మాయరాజు మం—

49 గ్గిరాజుగారు॥బెళుగంటికి కం[మ్మం]నాగోజు వడ్లమునులోజు

50 చాకల జకప్ప—మంగ్గళ శాగోజు। కుమ్మర మల్లప్ప। అగసల జక్కోజు।

51 తలారి గుజల తమ్మన। అణకల బిచయ। మాదిగ పెద్దడు। బెగారి

52 పరసుడు॥ యీా ప్రకారంగ్గాను — బెళుగంటికి బారా బల వంత్తులు సరి॥

53 అలువాల చిని మరిపీదుకు కలుమాలకు — క్షౌరవాడికి తవాలుర

54 గుజ్జల రామయ్యగారు యేనుగు బాలకు మం(డ్ల) నాగయ—

55 తలారి। అయివాలకు చిని మరిపెటికి కంమ్మర మిరాశి బెళుగం—

56 టి (తలారి)॥ అలువాలకు చినమరి (పీ)టికి వడ్లమునులో—

57 జు మిరాశి॥ యీా ప్రకారంగ్గాను మా మిరాసులు—

58 భవించేది॥

## పరిశీలించిన గ్రంథాలు


1 ఎ Prof. H. K. Sherwani, Ed. : History of Medieval Deccan, Vol. I p. p. 112.

మ రి యు

బి. కి. శే. నేలటూరి వెంకటరమణయ్య : కృష్ణదేవ రాయలు, పే. 10.

2 EC, XII, Gubbi. 86. : అచ్యుతరాయర పుత్రద శ్రీకృష్ణరాయరువారు

3 కీ. శే. నేలటూరి వెంకటరమణయ్య : కృష్ణదేవరాయలు, పే. 16.

4 Further sources of Vijayanagara History, Vol. II, Nos. 97, 97-a.


[1979 జనవరి నెలలో బెంగళూరులో జరిగిన శాసనవిజ్ఞుల వార్షిక గోష్ఠిలో నాచే చదువబడిన ఆంగ్ల వ్యాసమునకు ఆంధ్రానువాదము]



శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# ముదిగొండ చాళుక్యులు-2 అర్వాచీనులు

*(గత సంచిక తరువాయి)*

రాష్ట్రకూట మూడవకృష్ణ వల్లభుని పనుపున కాకత్యగుండన వేంగి దేశాధిపతియైన రెండవ అమ్మరాజును క్రీ. శ. 955–56లో వేంగి నుండి తఱిమివైచి అతని సవతి సోదరుడగు దానార్ణమని వేంగికి రాజుగ జేయును.[1] ఇది తాత్కాలికముగ మాత్రమే చెల్లెను. అమ్మరాజు మరల తిరిగి వేంగిసింహాసనమాక్రమించుకొనెను. కాని కాకత్య (కాకతీయ) గుండన రాష్ట్రకూటుల పక్షమున కొరవి నాక్రమించుకొనెనని తెలియుచున్నది. చాలుక్య రెండవ భీముని పక్షము వహించిన ముదిగొండరాజు నిరవద్యుఁడు క్రీ.శ. 934లో కొరవిలో నధికారము జేబట్టినట్లు కొరవి శాసనము తెలుపుచున్నది.[2] అతని కొడుకగు నల్లవ కుసుమాయుధుడు మంచికొండ విషయములోని మొగలి చెఱువుల గ్రామమును దోసయ శర్మకు అగ్రహారముగ దానమిచ్చినట్లు మొగలి చెఱువుల శాసనము వలన తెలియుచున్నది.[3] నిరవద్యుఁడు, నిజ్జయరాజు ఒకరేయై యుందురని యిట్లు చెప్పితిని. క్రీ. శ. 955–56లో కాకత్య గుండన వలన వీరు కొరవిని విడిచి పోవలసివచ్చెను. క్రివ్వక శాసనమును బట్టి వీరు 'బొట్టు' అనుచోటు నాశ్రయించినట్లు తెలియుచున్నది. దీనియునికి యెచ్చటనో తెలియదు. గోదావరీ ప్రాంతారణ్యములలో నెచటనైన నొక ప్రదేశమనితోచును. ఇప్పటి నుండి వీరికి బొట్టు అనునది కూడ వంశ నామమయ్యెను. క్రీ.శ. 1124 నాటి గూడూరు శాసనములో బొట్టు బేతరాజును గూర్చి చెప్పబడెను.

> 'అతణ్డనీబొట్టుచేత వసుధాధిపుఁజేకొని వానివైరి ను
> ద్ధృతమునఁజంపి యాకొరవి దేశమునందు ప్రతిష్ఠజేసి'[4]

అతణ్డనగా నిచట విరియాల యెఱ్ఱన. బొట్టు బేతరాజునకు సేనాపతి వంటి యుద్యోగి కావచ్చును. కొరవిలో దురాక్రమణ జేసియున్న శత్రువును జంపి బొట్టు బేతరాజును తిరిగి కొరవిలో ప్రతిష్ఠించెనని యర్థము. ఇందు శత్రువు పేర్కొనబడలేదు. కాని అప్పటి రాజకీయ పరిస్థితులను బట్టి బొట్టుబేతని శత్రువు కాకత్య గుండన కాదగునన వచ్చును.[5] కనుక ముదిగొండ నృపులు బొట్టునుండి మరల కొరవికి వచ్చిరని దీనివలన తెలియుచున్నది.

ఆ గూడూరు శాసనములో తరువాతి పద్యము నందు విరియాల యెఱ్ఱని భార్య కామవసాని గరుండను బేతరాజును, కాకతి వంశ్యుని, పిన్నవానిని రాజ్యాశ్రమమున నొప్పించి కాకతి వంశమును నిలబెట్టెనని యీ పద్యములో జెప్పబడెను.

> చ    అరుదగునట్టి యెఱ్ఱనృపు నంగన గామవసాని యొక పే
> ర్గరుఁడని బేత భూవిభుని గాకతి వల్లభు చిన్నవాని ద
> బరగంగ జేతబట్టి ఘను బల్లవరాయనియోగి జొచ్చి భా
> స్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట గోటిసేయదే॥

విరియాల యెఱ్ఱన బొట్టు బేతరాజును కొరవిలో మరల ప్రతిష్ఠించగా నా యెఱ్ఱన భార్య కామవసాని కాకతి వంశమునకు చెందిన పిన్నవయస్కుడగు గరుడబేతరాజును తిరిగి రాజ్యాధికారమునకుతెచ్చి కాకతివంశము నిలబెట్టెనని తెలియుచున్నది. ఈ యిరువురి బేతరాజులను గుర్తించుట పూర్వము కష్టముగ నుండెడిది. ఇపుడు క్రివ్వక శాసనము లభించుటవలన బొట్టు బేతరాజును, బయ్యారం చెఱువు శాసనము లభించుటవలన గరుడబేతరాజును గుర్తించుట వీలయ్యెను. బొట్టు బేతరాజు ముదుగొండ చాలుక్య వంశమువాడు. గరుడ బేతరాజు కాకతీయ వంశమువాడు. కొరవి రాజ్యమును పురస్కరించుకొని వీరిరువురు పరస్పర శత్రువులైరి. విరియాల దంపతులు వారి శత్రుత్వము నొకవిధముగ బరిష్కరించి యిరువురను వేరువేరు మండలములకు అధిపతులుగ జేసిరి. కొరవి మండలమునకు బొట్టుబేతరాజు, అనుమకొండ విషయమునకు గరుడబేతరాజు పశ్చిమచాళుక్య రెండవ తైలపునిక్రింద సామంతులుగ నేర్పడిరి.

ఈ కథ జరిగినది క్రీ.శ. 995 ప్రాంతమగుటచేత క్రివ్వక శాసనమందు పేర్కొనబడిన బొట్టు బేతరాజే గూడూరు శాసనమందున్న బొట్టు బేతరాజని చెప్పజాలము. క్రివ్వకశాసనము క్రీ.శ. సుమారు 1200 ప్రాంతమునాటిది. గూడూరు శాసనము చాళుక్య విక్రమాబ్దము 49 అనగా క్రీ. శ. 1124 నాటిది. క్రీ. శ. 1218 నాటి నత్తరామేశ్వరములో జెప్పబడిన బొట్టు కుసుమాదిత్యుడు, బొట్టు నాగతిరాజుల తండ్రియగు బొట్టు బేతరాజు సుమారు నూరేండ్లకు పూర్వపు గూడూరు శాసనములోని బొట్టు బేతరాజు కాజాలదు. మరియు, గూడూరు శాసనములో చెప్పబడిన వృత్తాంతము 1124 నాటిది కాదు. శాసనమే కాకతి రెండవ ప్రోలని నాటిది. ఆ వృత్తాంత మతని తాత తండ్రియగు మొదటి

బేతరాజునాటిది. ఆ బేతరాజునకే గరుడాంక బేతన్నపతి యనుపేరు బయ్యారం చెఱువు శాసనములో జెప్పబడెను. అదేపేరుతో నతడు గూడూరు శాసనములో 'గరుడను బేత భూవిభుని' అని చెప్పబడెను. కాకతి రెండవ బేతరాజునకు గరుడబేతరాజను పేరున్నట్లింతవరకు తెలియదు. కనుక గూడూరు శాసనం నాటికి (క్రీ. శ. 1124 నాటికి) మూడుతరములు ముందువాడు గరుడ బేతరాజు (రెండవ ప్రోలుని తాత తండ్రిగనుక). అప్పటికి అతడు చిన్నవాడనికూడ నచట చెప్పబడెను. అతని వైరియగు బొట్టు బేతరాజతనికంటె పెద్దవాడై యుండును. కనుక గూడూరుశాసనములోని కథ క్రీ.శ. 1124 నాటికి నాలుగు తరములు ముందు జరిగియుండవలెను. అనగా క్రీ.శ.1000 ప్రాంతములో జరిగెననుకొనవచ్చును. క్రివ్వక శాసనములో జెప్పబడిన కుసుమాదిత్యుని తండ్రియగు బొట్టు బేత రాజు క్రీ.శ. 1150 ప్రాంతమువాడు మాత్రమే కాదగును. అతని తాత మరియొక బేతరాజు వంశక్రమములో కనుపించుచున్నాడు. అతడుకూడ మరొక డెబ్బదెనుబదేండ్లు ముందువాడు కాదగును. ఆ వంశములో పేర్కొనబడియున్న యీ యిరువురు బేతరాజులు గాక మరొక బేతరాజు వారికి పూర్వముండియుండునని యూహించ వలసి వచ్చుచున్నది. కాకతి రెండవ బేతరాజునకు గరుడబేతరాజను పేరున్నట్లు తెలియదు. పోనీ ఆ రెండవ కాకతి బేతరాజునే యిచట దీసికొందమనుకొనిన, అతని పిన్ననితనములో కాకతి వంశమును తిరిగి స్థాపించవలసిన యవసర మేర్పడలేదు. కొరవి రాజులతో నట్టి శత్రుత్వమున్నట్లు తెలియదు.

కుసుమాదిత్యుని కాలములోని కొన్ని చరిత్రాంశములు క్రివ్వక శాసనములో జెప్పబడియున్నవి. ఇతడు రాజ్యమునకు వచ్చిన మొదటి సంవత్సరమున భూమి ప్రఘట్టంబు పుట్టెనట. ఆ సందర్భమున వారి ప్రధానులు ఇందపరాజు, అతని తమ్ముడు రేమరాజును ఆ రాజ సోదరులను వస్తువాహనములతోను కులధనములతోను పర మణ్డలము వైపునకు కొనిపోయి కాపాడిరని చెప్పబడెను. ఇచట భూప్రఘట్టమనగా దేశముపై శత్రువులు దండెత్తి ఆక్రమించు కొనుట యని తోచును. తరువాత పన్నెండేండ్లకు తిరిగి వారు తమ రాజ్యమునకు వచ్చిరి గనుక నది రాజకీయమగు ఉపద్రవమని చెప్ప వచ్చును. శాసనము గణపతిదేవుని రాజ్యారంభ కాలమునాటిదని చెప్పియుంటిమి గనుక వారికీ యుపద్రవము కాకతీయులనుండియే వచ్చియుండుననుకొనవలెను. క్రీ.శ. 1213 నాటి రేచర్లరుద్రుని పాలంపేట శాసనములో నాగతి భూపాలుడు వానికి జయపడి పారి పోయెనని చెప్పబడెను. ఆ తరువాత క్రీ. శ. 1218 లో నతడు, తన యన్నయు నత్తరామేశ్వరం శాసనములో గానవచ్చుచున్నారు. కొలని మండలమునకు ప్రవాసముపోయి వీరు మరల తమ విసురు నాడుకు వచ్చి యీ దానశాసన మొసగిరని చెప్పట యుక్తమని పించుటలేదు. గణపతిదేవుని సైన్యములచేత నోటమినొంది పారి పోయిన వీరు తిరిగివచ్చి స్వతంత్రులైరనుట పొసగదు. క్రీ. శ 1218 నాటికి గణపతి రాజ్యము తీరాంధ్రములో వ్యాపించెను. ఈ శత్రువులను తెలంగాణములో తిరిగి యడుగుపెట్టనిచ్చె ననుకొన జాలము. నత్తరామేశ్వర శాసనములో వీరు కొలని కేశవదేవుని కుమారుడికికూడ ననుయాయులై 'వానియొక్క పంపున బొట్టు నాగతిరాజు' అని కొలనిరాజుకడ భృత్యభావము నంగీకరించినట్లు చెప్పబడిరి. అనగా రేచర్ల రుద్రుని చేత నోటమినొందిన పిదప నీబొట్టు సోదరులు తీరప్రాంతమునకు పూర్తిగ వలసపోయి యచటనే స్థిరపడిరి. ఈ వంశము వారిలో నొక బొట్టు శ్రీరామ భద్రరాజు కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువునకు దాన మొసగినట్లు తెలియుచున్నది.[6] ఇతను మానవ్యస గోత్రుడు, కొరవి పురవరాధీశ్వరుడని చెప్పబడుటచేత ఈ వంశము వాడనియే నిశ్చయముగ జెప్పవచ్చును. శాసనములో తేదీలేదు. ఇదియే వీరిని దెలుపు తుది శాసనము. కనుక వీరు రేచర్ల రుద్రసేనాని చేత నోటమి నొంది తిరిగి విసురునాడు రాలేదని చెప్పనచ్చును. క్రివ్వక శాసనము వారు తిరిగివచ్చి ఆ గ్రామమును దానము చేసినట్లు తెలుపుచున్నది గనుక కుసుమాదిత్యుని ప్రథమ రాజ్యవర్షము నాటి దేశోపద్రవము రేచర్లరుద్రుని పాలంపేట శాసనము నాటి క్రీ. శ. 1213 కు కనీసము 12 సంవత్సరములైనను ముందు జరిగి యుండవలెను. అనగా గణపతిదేవుడు రాజ్యమునకు వచ్చిన 1199 ప్రాంతమున సంభవించి యుండును. పాలంపేట శాసనములో కాకతి రుద్రదేవుడు చనిపోయిన తరువాత శత్రురాజులు కాకతిరాజ్యము నపహరింప యత్నించి దండెత్తి వచ్చినట్లు జెప్పబడెను. రామకృష్ణా పురం శాసనంలో రుద్రమంత్రి మహాదేవుని యనంతరము గణపతి దేవుని రాజ్యాభిషిక్తుని గావించెనని గలదు.[7] రుద్రదేవుడు క్రీ. శ. 1195-96 లో మృతి నొందెను. రాజ్యములో తగవులాట ప్రారంభమయ్యెను. మహాదేవుడీకల్లోలములోనే మూడేండ్లు కష్ట ముతో రాజ్యము చేసి యుండును. తరువాత యాదవులతో నతని కెట్లు యుద్ధముత్పన్నమైనది తెలియదు. ఆ యుద్ధములో నతడు చనిపోవుట గణపతిదేవుడు యాదవరాజుకు జైతుగిచే బంధింప బడుట జరిగెను. ఈ యలజడిలో బొట్టునాగతి రాజునకు గూడ సంబంధముండి యుండునని యూహించుట కవకాశము గలదు. రేచర్ల రుద్రసేనాని యోడించిన వారిలో నితడు విశేషించి పేర్కొన బడెను. కనుక బొట్టునాగతిరాజు కాకతీయులకు క్రీ. శ 1198 నాటికే శత్రువుగ నుండెనని చెప్పవలెను. అనగా రుద్రదేవుని కాలములో వీరికా శత్రుత్వ మేర్పడి యుండవలెను. రుద్రుడు తెలంగాణములో నున్న పొలవాస మేడరాజును, కందూరి చోళులను జయించి స్వాతంత్ర్యము స్థాపించెను. అతనికి మిగిలినది తూర్పున ముదుగొండ చాళుక్యులు మాత్రమే వారిలో నప్పుడే రాజ్యమునకు వచ్చిన కుసుమాదిత్యుడు, అతని తమ్ముడు నాగతిరాజు కాకతి రుద్రదేవుని యాధిపత్యము నంగీకరింపకపోవుట వలన వారిచే తరుమగొట్టబడి యుండురు. ఈ యంశమునే క్రివ్వక శాసనములో 'భూమి ప్రఘట్టంబు పుట్టిన' అనిచెప్పి, అంత మంత్రులగు ఇందప, రేమనలు ఆ చాళుక్య సోదరులలో కుసుమాదిత్యుని సురక్షితముగ పన్నెండేండ్లు అరణ్యవాసము చేయించిరని చెప్పుచున్నది. కందమూలములు భుజించుచు గుప్త

ముగ కాలక్షేపము చేయించిరని తెలియుచున్నది. ఇందు కుసుమాదిత్యుని మాత్రమే పేర్కొనియుండుటచేత వాని తమ్ముడగు నాగతి రాజు గూఢముగ పరరాజుల సహాయ మభ్యర్థించుటకై వెడలి యుండునని తెలియుచున్నది. దీని ఫలితముగ యాదవులు కాకతి రాజ్యముపై నొక్కప్రక్క దాడిచేసి యుందురు. రుద్రుడు జీవించి యున్నంతవరకు అట్టి ప్రయత్నమును వారు చేసియుండరు. మహదేవుడు రాజ్యమునకు వచ్చిన యదనుచూచి ఒకప్రక్క వారి దాడి జరుగుట వేరొకప్రక్క కుసుమాదిత్యుడు, నాగతిరాజు విసురు నాడును తిరిగి ఆక్రమించుట జరిగియుండును. ఈ విధముగ నీ సోదరులు తమ స్వస్థలమున రాజ్య పునఃస్థాపన జేసికొని సుమారు క్రీ.శ. 1198 లో తమ ప్రధానులకు బహుమాన సూచకముగ క్రివ్వక గ్రామమును దానమిచ్చియుందురు. కాకతి మహదేవునకు ముందుగ యాదవదాడి నెదుర్కొనవలసిన క్లిష్టపరిస్థితి యేర్పడెను. తప్పనిసరిగ వారిపై యుద్ధమున కేగెను. యువరాజగు గణపతి దేవుడుకూడ నిందు పాల్గొనియుండును. మహదేవుడు యుద్ధ భూమిలో జనిపోవుట గణపతిదేవుడు యాదవరాజుచే బంధింపబడుట తెలిసిన విషయములే. ఈ యుద్ధమునకు మహదేవుని సోదరులగు హరిహరుడు, గణపతి యనువారు శత్రుపక్షముచేరి కొంతద్రోహము చేసియుందురు. కాకతిరుద్రుడు మహదేవుని పుత్రుడగు గణపతి దేవుని దత్తతపొంది యతనికి రక్షకునిగ మహదేవుని నియమించి వానికి రాజ్యము నప్పగించుట మిగిలిన సోదరుల కాగ్రహకారణమై యుండును. గణపతిదేవుడు యాదవసైన్యమునకు చిక్కి బంధింపబడుటలో వారిచేయి తప్పకయుండును ముదిగొండ చాలుక్య సోదరులుకూడ నా వ్యూహరచనలో పాల్గొని కాకతి రాజ్యమునకు గొప్ప విపత్కర స్థితి దెచ్చిపెట్టిరి.

రేచర్ల రుద్రుడు మొట్టమొదట నాగతిరాజను సమూలముగ దేశమునుండి పాఱద్రోలెను. వారు తెలంగాణమును, విసురు నాడును పూర్తిగ త్యజించి కొలనిమండలములో కేశవదేవుని ప్రాపున బ్రతుకుతెరువు జూచుకొనిరి. ఈ విధముగ వీరు మొదట రుద్ర దేవునిచేత తరుమబడి పన్నెండేండ్లు అరణ్యవాసముండి మహదేవుని రాజ్యకాలములో యాదవులసహాయమున తిరిగి విసురునాడు ప్రవేశించి నపుడీ దానశాసన మొసగియుందురు తరువాత రేచర్ల రుద్రసేనాని చేత పూర్తిగ దేశమునుండి తరుమబడి తీరాంధ్రమునకువలసపోయిరి.

కాకతి గణపతిదేవుడు రాజ్యమునకు వచ్చుటకు ముందు రాజ్యములో గొప్ప యలజడి చెలరేగెను. తత్ఫలితముగ మహదేవుడు యాదవులపై దాడిచేసి అందు చనిపోవుట జరిగెను. ఇంతకు ముందే గణపతిదేవుడు బంధింపబడెనాయను సంశయము గలుగు చున్నది. లేకున్నచో మహదేవుడేల యాదవ రాజ్యముపై దాడి వెడలునను ప్రశ్న కలుగుచున్నది. ఈ యలజడిని కొంత రేచర్ల రుద్రసేనాని యొక్క పాలంపేట శాసనము సూచించుచున్నది.[8]

''శ్రీ మద్రుద్రనరాధిపే రిపుమహీ పాలాద్రివజ్రే దివం
యాతే కాకతినాథ భోగ్యవిలస త్పృథ్వీకరాకర్షణే!
సంభ్రాంతా సముత్థితాః సరభసం వైరిక్ష్మాపాలకాః''

కాకతి రుద్రదేవుడు జీవించి యున్నంతమటుకు శత్రువులెవరు తలయెత్తలేదు. అతడు గతించిన పిదపనే కాకతి రాజ్యము నపహరించుటకై శత్రువులందరు పైబడిరని చెప్పి వారిని రుద్రసేనాని యెట్లు శిక్షించెనో చెప్పెను. ఆ శత్రువులలో పేరుతో జెప్పబడిన దొక నాగతిరాజు మాత్రమే.

''యత్సేనాధ్వజ దండాగ్ర పతాకాభిః ప్రతర్జితః।
ద్రుతం నాగతి భూపాలః పలాయన పరోభవత్॥''

కనుక కాకతీయ రాజ్యమునకు ప్రధాన శత్రువుగ నప్పుడు చెలరేగినది బొట్టు నాగతిరాజే యనవలెను. దీనికి కారణము పూర్వము రుద్ర దేవుడు ఈ బొట్టు సోదరులను వారి స్వదేశమగు విసురు నాటి నుండి తరిమివేయుటయే. రుద్రుడు చనిపోగానే నాగతిరాజు యాదవుల సహాయము సంపాదించి విసురునాడును తిరిగి ఆక్రమించు కొనుటయే గాక కాకతి రాజ్యమును యాదవుల దాడికి గురిచేసెను. ఆ సందర్భముననే గణపతి దేవుడు బంధించబడెనాయని సంశయము గలుగుచున్నది. దీనికి మహదేవుని సోదరులగు హరిహరుడు, గణపతి మున్నగు దాయాదులు కూడ కారణమై యుందురు. వారు మహదేవుని కన్న పెద్దవారో చిన్నవారో మనకు తెలియదు. మహదేవుని కొడుకగు గణపతి దేవునికి రాజ్యము చెందుట వారికి గిట్టదు. అందువలన రుద్రదేవునిచే రాజ్యాధికారిగ నియుక్తుడైన గణపతిదేవుడు శత్రువులగు యాదవులచే బంధింపబడుటకై వ్యూహమువన్ని యుందురు. రుద్రుడావిపత్కర స్థితి నుండి రాజ్యమును కాపాడెను.

శూరః స్వామిహితః సునిశ్చితమతిః యః కాకతీశ్రియా
పాదే భూరిషు కంటకేషునిహితే తీక్ష్ణేషు మోహాత్క్షణం।
తైర్విద్ధే వ్యధితే చ తామ్భుజబలాదుద్ధృత్య పిష్ట్వాహితాత్
తామస్థాపయ దవ్యథాం స్థిరతరం రేచర్లరుద్రః స్వయమ్॥

కాకతి రాజ్యలక్ష్మి పొరపాటున వాడియైన ముళ్లపై పాదముంచగా క్షణకాలమామెకు **బాధ** కలుగ ఆమె పాదము**లో** విరిగిన ముళ్లను శూరుడు స్వామిహితమును గోరునట్టియు గట్టి పట్టుదలగల రేచెర్ల రుద్రుడు భుజబలముతో పెకిలించి యేబాధయు లేకుండ ఆమెను తిరిగి సుప్రతిష్ఠించెను. ఇట్టి రాజ్యాపహరణ ప్రయత్న మొక చిన్న మాండలికుడైన బొట్టునాగతిరాజు తనంతట జేయ **జాలడు**. కాని ప్రధాన శత్రువుగ బేర్కొనబడుటను బట్టియు, అప్పుడే యాదవుల**తో**టి యేర్పడిన కలహమును బట్టియు, నాగతి రాజు యాదవులతో గరిసియే తిరుగుబాటు లేవదీసెనని తోచు చున్నది. రేచర్ల రుద్రునిచేత వోటమినొంది తిరిగి యతడు కాకతి రాజ్యములో బ్రవేశించియుండడు. కాకతి గణపతిదేవుని శత్రువగు కొలని కేశవరాజు వద్ద తన యన్నయగు కుసుమాదిత్యునితో గూడ జీవితశేషము గడిపి యుండును.

ఈ విధముగ ముదుగొండ చాలుక్యులకు కాకతీయుల**తో** వైరము రెండు సందర్భములలో తలయెత్తుట మనకు తెలియు చున్నది. మొదటిమాటు సుమారు క్రీ. శ. 1000 ప్రాంతమున బొట్టుబేతరాజుకు, కాకత్యగుండన యతని కొడుకు గరుడ బేతరాజు తోను వైరము సంప్రాప్తముకాగా విరియాల యెఱ్ఱిన్నపుడు అతని భార్య కామసాని ఆ యిరువురికి వైరము మాన్పి కొంతమేలు జేసిరి. సిద్దేశ్వర చరిత్ర కథనానుసారము కామసాని యెఱకసాని యను పేరుతో కాకతీయుల యింటి కూతురని తెలియుచున్నది. అది నిజమగుచో గరుడబేతరాజు రాజ్యభ్రష్టుడు కాకుండ తన భర్తకుగల పలుకుబడితో నతనికి అనుమకొండ రాజ్య మిప్పించియుండునని భావించబడుచున్నది ఇది మొదటివైరమంత మైన విధము రెండవమాటు కాకతి రుద్రదేవుని కాలములో బ్రారంభమై గణపతిదేవు రాజ్యారంభముతో నంతమగును. ఇందు బొట్టు కుసుమాదిత్యుడు, నాగతిరాజు కాకతీయులకు శత్రువులైరి. ఈ వైరములో రేచర్ల రుద్రుడు వారిని పూర్తిగ తెలంగాణము నుండి తరిమివేసెను దీనితో వారి వంశము పూర్తిగ పేరు లేకుండ పోయెను. క్రీ. శ. 7–8 శతాబ్దులలో రణమర్దుడనువానిచే స్థాపించబడి 1200 ప్రాంతమువరకు సుమారు నాలుగువందలేండ్లు పెంచికొండ విషయమును, విసురునాడును వీరు పాలించిరి. వీరిని చరిత్రలో ముదిగొండ చాలుక్యులనియు, కొరవి చాలుక్యులనియు, బొట్టు చాలుక్యులనియు చెప్పుదురు.

తాళ్లప్రొద్దుటూరు శాసనములో [9] ఏఱువభీముడు వీసర నాడును జయించినట్లు చెప్పబడెను. అది కాకతీయుల కాలములో జరిగియుండునని డా వెంకట రమణయ్యగారు చెప్పిరి. కాని అదే శాసనములో ఆ భీముడు మంథెననుగూడ జయించినట్లు వ్రాసు కొనెను. కాకతీయులకు మంథెన మొదటినుండియు వారి రాజ్యము లోనే యుండెను గనుక దానిని కాకతీయులపక్షమున నతడు జయించ వలసిరాదు. కాగా అతని వీసరనాటి జయము, మంథెన జయము, చక్రకూట జయము చాలుక్య త్రైలోక్య మల్లుని కాలమునాటి యుదంతమనిపించును. అయినను ఆధారాంతర మన్వేషించవలసి యున్నది. మొత్తమువిూద ముదిగొండ చాలుక్యులపై వేఱువ భీమ చోడుడుకూడ నొకతూరి దండెత్తినట్లు తెలియుచున్నది. దాని వివరములు తెలియవు.

ఈ చాలుక్యులనాటి ఆ ప్రాంతపు సాంఘిక చరిత్రాదులగూర్చి తెలుపు ఆధారములంతగా తెలియవు. ఒక్క కొరవి శాసనములో ని కొన్ని విశేషములు జెప్పబడియున్నవి.

నిరవద్యుడు కొరవికి రాజుగ బ్రకటించుకొని యచటి స్థానిక గ్రామనాయకుని బిలిచి యతనికి యథాపూర్వకముగ కొన్ని పన్నులు వసూలు జేసుకొన నట్టి యధికార మొసగును. ప్రజలలో నొకరిపై నొకరు అత్యాచారములు చేసినపుడు విధించబడు దండనలు, ఆ నాయకుడే తీసుకొనవలయును. పొలములలో వరిచేలు సాగుచేయ నారంభించినపుడు, మెట్టచేలు ప్రారంభించునపుడు కూడ వెనుకటి వలె పన్నులు వసూలు చేసుకొనవచ్చును. ఇందు జెప్పబడిన నాణె ములు ద్రమ్మలు,ఆమని పున్నమనాడు మొత్తము ఏనూరుద్రమ్మలు అరిగా రాజునకు చెల్లించి పై రాబడులను తానునుభవించవచ్చునని చెప్పబడెను ఇందలి విశేషములు కొన్ని 'తెలుగు శాసనాలు' అను పుస్తకములో కొరవి శాసనము క్రింద వివరించితిని.

## అ ధో జ్ఞా పి క లు

1 మాంగల్లు శాసనము – ఎపి. ఆం. I, 57–70
2 ఎపి. ఆం. I, 118-145.
3 ఇండియన్ ఆంటిక్వరి - XXXII, పుట 281.
4 వరం. జిల్లా శా., పుట 81.
5 పర్బ్రహ్మశాస్త్రి, కాకతీయులు – పుటలు 41 – 42 (ఆంగ్లము)
6 SII — IV, 961.
7 వరంగలు జిల్లా శాసనముల సంపుటి, పుట 215.
8 వరం. జిల్లా శా. పుట 145.
9 భారతి XV — i, పుట 147.

*(స మా ప్తం)*

## కీ. శే. వేలూరి శివరామశాస్త్రిగారు

# ఉపనిషత్తులలో ఆత్మ

[“శ్రీ శివరామ శాస్త్రిగారి కృతులు — సమీక్ష” అనే అంశాన్ని గురించి పరిశోధన చేసి ఆంధ్ర విశ్వ విద్యాలయంవారి పి. హెచ్. డి. పట్టం పొందిన శ్రీ జంధ్యాల మహతీ శంకర్ పంపిన కీ.శే. వేలూరి శివరామ శాస్త్రిగారి “ఉపనిషత్తులలో ఆత్మ” నుండి ఈ కింది భాగాన్నిలిపి వేస్తున్నాము. —సంపాదకుడు.]

జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములను నాల్గవస్థ లందును జ్ఞానము కలదు. జ్ఞానమే “ఆత్మ”. జాగ్ర జ్జ్ఞానమును జ్ఞానమే. స్వప్నజ్ఞానమును జ్ఞానమే. సుషుప్తిజ్ఞానమును జ్ఞానమే. వీనిలో ఏదియు జ్ఞానమునకు స్వరూపము కాదు.

మానవులందఱిలోను స్వతస్సిద్ధముగానున్న వస్తువునుజ్ఞాను లెఱిఁగి యుందురు. అది “నేను” అను అనుభవము. ఈ “నేను” అను అనుభవము జ్ఞానమునకు పునాది. మన జ్ఞానములో నుండి “నేను”అను అనుభవము స్ఫురించుట స్వతస్సిద్ధము. ఇది అందఱి కును అనుభవమే — ఈ “నేను” అను అనుబవము జ్ఞానమునకు మధ్య బిందువు ................విక్షిప్తమయిన నానా జ్ఞానములు ఈ మధ్య బిందువు చుట్టే తిరుగుచుండును. సంశయములందును ‘నేను’ అను నీ అనుభవము స్ఫురించుచునే యుండును.

జ్ఞానము లోపల ‘నేను’ అను ఈ అనుభవము మధ్య బిందు వయినను అన్ని సమయములందును కేవలము శుద్ధమగు నేను అను ఘాతము కాదు. జ్ఞాన స్వరూపమునకు కొన్ని అవస్థలున్నవి. ఆ యవస్థలను విడఁబఱచి చూచినచో జ్ఞాన రూపమగు ‘నేను’ అను నది అన్ని సమయము లందును అనుభవమునకు రాదని తెలిసికొనఁ గలము.

జ్ఞానము విషయమును ప్రకాశింపఁజేసినను విషయమును ప్రకాశింపఁజేయుటయే దాని స్వరూపము కాదు. వెలుఁగుయొక్క స్వభావము చీఁకటిని పోగొట్టుట. అట్లని వెలుఁగు యొక్క స్వరూపము చీకటిని పోగొట్టుటయే కాదు. మఱి యేమనిన దాని స్వరూపము దీప్తి. అటులే జ్ఞానము యొక్క స్వరూపము ప్రకాశము. దీపము ముందేవస్తువున్నను అది కనఁబడును. అటులే జ్ఞానము కడ విషయము కూడ వెలుఁగొందును. కాని యిటులగుటఁ జేసి విషయమును వెలుగొందఁ జేయుటయే జ్ఞాన స్వరూప మనుటకు వీలులేదు. విషయమునకును జ్ఞానమునకును నిత్య సంబంధము లేదు. విషయము లేకుండియు జ్ఞానముండవచ్చును. అది స్వతః స్ఫూర్తము. స్వతస్స్ఫూర్తమగు ఈ జ్ఞానము ముక్తినిచ్చును. ఈ జ్ఞానముతోడి పరిచయము మనకు కడుంగడుఁ గొలది. అధవా లేదనియే చెప్పవచ్చును. ఏలనఁగా చిత్తము విషయముల వెంట పరు గిడును. విషయముల నతిక్రమించి స్వస్వరూపము దెస త్రిప్పఁకొను శక్తి ఏ ఒక రిద్దఱికో ఉండుననుచో నదియు అత్యుక్తి.

యాజ్ఞవల్క్యుని జ్యోతిర్బ్రాహ్మణ రహస్య మేమనఁగా — “జ్ఞానముయొక్క స్వస్వరూపము స్వయంజ్యోతి, అనఁగా స్వయం ప్రకాశమునని.” మనము విషయమును ప్రకాశింపఁజేయు జ్ఞానమును మాత్రమే ఎఱుఁగుదుము — స్వరూపము నెఱుఁగము.

జాగ్రదవస్థ యందలి జ్ఞాన మెట్టిది? జాగ్రద్ భూమిలో మద్దెల మొదలగువాని చప్పుడు విందుము. చెలికాఁడు మొదలగు వారిని కౌగిలించుకొందుము. పెక్కుదినుసుల వస్తువుల జూతుము. పలుతెగల రుచులుగల పండ్లు, వంటకములు మొ.వానిని తిందుము. చాల తావుల మూరుకొందుము. జ్ఞానము పైఁజెప్పిన విషయములను ఇంద్రియముల గుండ తెలియఁజేయును. ఈ తెలివి వలన ఇంద్రియ ములచే గ్రహింపఁదగిన శబ్ద స్పర్శ రూప రస గంధముల జ్ఞానము కలుగును. శబ్దముయొక్క జ్ఞాన మనఁగ నేమి? శబ్ద జ్ఞానమా? కాదు. ఇటులే స్పర్శయొక్క జ్ఞానమనఁగా స్పర్శయా? కాదు. మఱి యేమి? జ్ఞానమును విషయమును ఒకటియగుచో శబ్ద జ్ఞానమనఁగా శబ్దము కావచ్చును. జ్ఞానమును విషయమును ఒకటి కావు. ఈ రెండును వేఱు వేఱు. విషయ ప్రకాశము తనలో నున్నను జ్ఞానము విషయము కంటె వేఱు. జాగ్రద్ భూమిలో శబ్ద స్పర్శ రూప రస గంధముల కంటె వేఱుగా విషయము నెఱుగము. జ్ఞానము విషయముతో సంబంధపడినపుడు చేతనలో కొన్ని స్పందనలు అనఁగా కదలికలు కలుగును. జ్ఞానమునందాయవస్థలో కదలికలు తక్క మఱి యే పదార్థమును అనుభూతము కాదు. కదలికకు కారణము ఉండవచ్చును. గాని అది మన జ్ఞానములో ప్రకాశింపదు. మన అంతర్వేదనయే జ్ఞాన జగతిని సృజించును. ప్రతి జ్ఞాతకును ఒకొక్క జగత్తు కలదు. జ్ఞాతృత్వము వేఱు, జ్ఞానము వేఱు. జ్ఞానము కేంద్రీభూతమై క్రియాశీలమైనపుడే జ్ఞాతృత్వానుభూతి జాగరిల్లును. మనజగత్తు ఈ కేంద్రమును అధికరించియే సృజింపఁ బడినది. జాగ్ర జ్జ్ఞానములో రెండవస్థలను మనము గనఁబడయు దుము. ఒకటి — స్పందము కనబడు అవస్థ. రెండు — కనఁబడని అవస్థ. ఈ స్పందనమే — కదలికయే — జ్ఞానక్రియ. ఈ క్రియ విషయమును తెరియజేయును. అంతఃకరణమును ఇంద్రియములను

ఆశ్రయించుకొనియే జ్ఞానమునందీ క్రియ జరుగును. అంతఃకరణముతో సంయోగము కలుగగనే జ్ఞానము జ్ఞాతగాఅగును. జ్ఞానము యొక్క స్వరూపమునందీజ్ఞాతృత్వము లేదు.

జాగ్రదవస్థలో జ్ఞాతృత్వ రూపముగానే భాస మగును. ఏలనగా అపుడు అంతఃకరణముతో గూడియే విందుము, తాకుదుము, చూతుము, తిందుము, మూచూతుము. ఇటులయినను జ్ఞానము యొక్క ఉన్ముక్త రూపము — అనగా విషయముల నుండి విడివడిన స్వస్వరూపము ఎన్నటికినిపోదు. మనకు స్పష్టముగా తెలియకున్నను జ్ఞాతృ రూపముగ గూడ జ్ఞానము ఉన్ముక్తమే. ఏలనగా జ్ఞానమున కొక మేరలేదు, మరియు ఏదోఒక కేంద్రము లేదు. జ్ఞాతకో ఒక ఎల్ల, ఒక కేంద్రము కలదు.

జాగ్రద్భూమిలో పరిధిలేని ఈ జ్ఞానముతో మనకు పరిచయము లేకున్నను అపుడపుడు జ్ఞానము యొక్క సాక్షి రూపముతో పరిచయము కలదు. కేవలము చూచుచుండువాడు సాక్షి. సాక్షి విషయమును చూచును గాని గ్రహింపడు. అతడు అసలు దృశి. సాక్షి స్పందములేని జ్ఞానము.

జాగ్రదవస్థలో ఎవరి జగత్తు వారిదే. కాని వేరు వేరయిన యీ జగత్తు ఒక జగత్తునకు మాత్రమే సంబంధించినది. అది యీ వ్యావహారిక జగత్తు. రాముడును కృష్ణుడును చందమామను చూచిరనుకొందము. వీరి యిరువురయు సంవేదనములు (feelings) వేరు కావచ్చును. కాని వారిసంవేదనములు మాత్ర మొకేవస్తువును గూర్చి. వస్తువులు అనేకములు కావు, సంవేదనములు మాత్రము అనేకములు ఈ సంవేదనముల కావల మఱియొక జగత్తు కలదు. కాని యీ విధమైన జగత్తు ఉన్నను దాని ప్రకాశము జ్ఞానము నందే. 'పదార్థము ఉన్నది కాని దాని యెఱుక లేదు' అను మాట అసంభవము. జ్ఞానమే అట్టి దొకటి కలదనుటకు సాక్షి. దానఁజేసి విషయముల అన్నిటియు బోధము సమ్యగ్జ్ఞానమునందే స్ఫూర్తము. ఈ సమష్టి జ్ఞానముచే విశ్వము విధృతమైయున్నది. వ్యష్టి సమష్టి జగత్తుల కూడికయే విశ్వము. సమష్టి జగత్తు విరాట్ చైతన్యమునందు కలదు. వ్యష్టి జగత్తు ఖండ చేతన యందు భానమగును. ఈ వ్యష్టి జగత్తునకును సమష్టి జగత్తునకును ఈ రెండును కలిసిన సమష్టి జగత్తునకును ఒక సూక్ష్మ రూపము కలదు. అది ఇంద్రియములకు ప్రత్యక్షముకాదు. స్వప్న లోకమునందు అది ప్రకాశించును. స్వప్న జగత్తునందు సంవేదనము కలదు గాని అది సంస్కార సంవేదనము, మఱి విషయ సంవేదనముకాదు. అచట ఇంద్రియములతో అంతఃకరణమునకు సంయోగము లేదు సంస్కారములు నానా విధములు. మనస్సునందు గల సబ్బందు మడతల నుండి ఈ సంస్కారములు ఉత్పన్నములగును.

స్వప్న మిటులు సంస్కార సృష్టి. ఈ సంస్కారములు అంతఃకరణము నందలివే. నిదురపట్టగనే అంతఃకరణము విషయముల నుండి విచ్ఛిన్నమగును. అప్పుడు ఇంద్రియములు క్రియనుండి విరతములగును. ఈ యవస్థలో అంతఃకరణ సూక్ష్మ సంస్కారములు స్వప్న రూపముగా ప్రకాశించును. స్వప్న జగత్తుకూడ ఒక జగత్తే. ఈ జగత్తును చూచునదియు (ద్రష్ట) అనుభవించునదియు (భోక్త) ఆత్మయే· స్వప్న సృష్టి కదా యని దీనికి సృష్టిలో ఒక పద్దు లేకపోలేదు. అంతఃకరణ మింద్రియముల లోపల నుండి విషయాభిముఖమగు ననియే మనము జాగ్రదవస్థకు స్వప్నము కంటె ప్రాధాన్య మొసగుదుము· కాని సూక్ష్మముగా చూచినచో స్వప్నము కదా యని స్వప్న సృష్టి మిథ్యకాదు. ఇంతియకాక సృష్టియొక్క మాయామయమగు రూపము స్వప్నమునందే తేటగా కనబడును.

స్వప్నము రెండు రీతులు. ఒక రీతి కలలో మనము స్వప్న జగత్తును అనుభవింతుము. కని, విని ఆనంద మనుభవింతుము. ఈ రీతి కలలలో విషయములకే ప్రాధాన్యము ఆత్మ ఆయా విషయములను అనుభవించును. ఇంకొక రీతి కలలున్నవి. ఆ కలలలో ఆత్మ అచటి జగత్తును చూచునేకాని అనుభవింపదు. అచటి సుఖదుఃఖములతో లిప్తము కాదు. ఎడతెగక స్వప్న ప్రవాహము ప్రవహించుచుండగా ఆత్మ ఉదాసీనతతో చూచుచుండును. సృష్టికి రెండు రూపములు — ఒకటి వాస్తవము, రెండు మాయికము. వాస్తవ రూపముగా ఈ విశ్వదృశ్యము ప్రకృత సత్యము. మఱియు దీనికీశ్వరుఁడు స్రష్ట. మాయిక సృష్టి స్వప్న సృష్టి. దానికి ప్రకాశమున్నది, ఉపస్థితి ఉన్నది కాని అది వాస్తవము కాదు. మాయిక రూపముగా ఈ దృశ్యమున్నను అది సత్యము కాదు. దాని కుపాదాన కారణము మాయ. రూపము గూడ మాయ. ఏల యిది మాయికమని అనుచో—దీనిని మనము చూతుము, ముట్టుకొందుము, అనుభవింతుము, కాని దీనికి వాస్తవమగు రూప మేదియు లేదు. ఇదీ ఉన్నది, మఱియు లేదు. వాస్తవ దృష్టి చిరకాలము నుండియు ఉన్నది, చిరకాలము ఉండును. మాయిక సృష్టి ఏనాడును లేదు, ఉండను బోదు, కాని మనము దీనిని చూచుచుంటిమి. జ్ఞానమునకు విషయమయియు సత్యము కాకపోవుట వలన ఇది మాయికము.

మాయిక సృష్టికిని వాస్తవ సృష్టికిని మఱియొక విశేషము కలదు. వాస్తవమగు ఉపాదానమేదియులేక సృజింపబడుటయే ఆ విశేషము. వాస్తవమగు ఉపాదానము గ్రహింపబడుచో ఆ సృష్టి నిత్యమును సత్యమును ఐపోవును. కాని సృష్టి ఎచట శక్తి కేంద్రమునుండి తొలగునో అచట వాస్తవమగు ఉపాదానము ఉండదు ఈ సృష్టి ఒకానొక వికాసమేకాని తన్మూలమున ఉపకరణమేదియు నుండదు. స్వప్నవికాసమువలె ఇది అవాస్తవము. దానఁజేసి ఈశ్వరుఁడు మాయి అని ఉపనిషత్తు చెప్పును. వ్యష్టి స్వప్నము, వ్యష్టిసంస్కారముల పరిణామము. సమష్టి స్వప్నము సమష్టి గతములగు సంస్కారముల పరిణతి.

ముక్తిమార్గమున ముమ్మొదట విశ్వదృశ్యము స్వప్నము, మిథ్య యను జ్ఞాన మావశ్యకము. ఈ జ్ఞానమే ముక్తిని చూపును. ఈ జ్ఞానముచేత ప్రాణచాంచల్యము తఱుఁగుచు వచ్చును. జీవుని జీవత్వమునందలి చేతనము పోవును. విశ్వము స్వప్ననగరతుల్యమై మాయామయ రూపముగా కనిపించును.

ఆత్మ ఈ స్వప్నజీవనమునకు నిమిత్తోపాదాన కారణము. ఆత్మ తన విశ్వసృష్టి తానే చేసికొనును. ఈ సృష్టి ప్రాతిభాసికము. సృష్టియెడ ఇట్టి దృష్టి యిష్టానిష్ట విభేదములను విగళిత మొనరించి మనుజులను ప్రబలములగు బహూళాకర్షణముల నుండి రక్షించును ప్రాణశక్తి ప్రశాంతప్రాయమై ఆత్మకు బాసటయై యీ విశ్వమును చూచును. వ్యవహారభూమికలో ఆత్మ ఉదాసీనమై సాక్షిగా ఉండును. ఇట్టి బోధము ముక్తిభూమికకు అవ్యవహిత పూర్వసూత్రము. ఇచట సాధకుని కర్తృభావమున కపసారణము, ఆత్మభావనకు అంకురము. స్వప్నము ప్రాణ జగచ్చాంచల్యము నుండి మనలను ముక్తుల నొనర్చును. మరల మరల ప్రాణము ప్రవేశించుటచే ఆత్మ విషయరసము నాస్వాదించును. ప్రాణముల ఈ సంకోచవృత్తినుండి స్వప్నము మనకు ముక్తినొసగును. స్వప్నమునందు ప్రాతిభాసిక భోగమున్నను ఆ భోగము బంధనముకాదు. ఏలనఁగా ఆ భోగమునందు ప్రాణవృత్తికి చాంచల్యములేదు. భోగముచే ప్రాణవృత్తికి చాంచల్యము కలిగెనుచో ఉర్రితాడు వదులు కాలేదన్నమాట. ఈరీతిస్వప్నసృష్టికి 'సాంధ్యసృష్టి'యని ఉపనిషన్నామధేయము జాగ్రదవసానమునందు ఈ సంస్కార సృష్టి. దీనికి సరిగా వెనుకటి క్షణమున తెలుపి మఱపి, నిదురలో స్వప్నము సంపూర్ణ మిధ్యా రూపముతో ప్రతిభాసింపదు. జాగ్రదవస్థలో స్థూలసంస్కారములు క్రియాశీలములగును. ఇచట నట్టిదిలేదు· కాఁగా ఈ యవస్థ విజ్ఞాన సృష్టిరూపముగా భాసింపదు. ఆరోహాక్రమమువందు చిత్తమున కిదియొక యనస్థా విశేషము. ముక్తిభూమికలో ముందు ముందులకేఁగ వాస్తవ విశ్వము నామరూపములుగా పరిణమించును. సృష్టి వాస్తవత విగళితమగుటతో ఈ సంస్కారముకూడ తుడుచుకొనిపోవును.

ఈ జాగ్రత్ స్వప్నములకంటె వేఱగు అవస్థ సుషుప్తి. దీన సంస్కారములకు ఎట్టి క్రియయు ఉండదు. ఇందు కేవలము ప్రాణ క్రియ యుండును. అంతఃకరణము శాంతమగును· జాగ్రత్తునందు గాని స్వప్నమునందుగాని విషయముండును, సుషుప్తిలో అది యిసుమంతయు ఉండదు. విశేష జ్ఞానమేదియు నుండదు. విషయాభావమే సుషుప్తికి విషయము విషయమునుండి విడివడుటజేసి సుషుప్తిలో జ్ఞానము ప్రశాంతము, ఉదారము, కాని అజ్ఞానావరణము నుండి విముక్తముకాదు. 'నాకేమియు తెలియదు' అనునదియే యిచటగల జ్ఞానమునకు స్వరూపము·

పదపటి జ్ఞానులు సుషుప్తిలో మూడు వృత్తులున్నవని చెప్పిరి. అవిద్యావృత్తి, సాక్షివృత్తి, ఆనందవృత్తి. 'నాకేమియు తెలియదు. గాఢముగా నిద్రపట్టెను'—అనునెడ విషయమునకు విలయము కలిగెను—ఇది నిర్విశేషమగు అవిద్యయొక్క ప్రకాశము. ఇది గాక ఈ జ్ఞానమునందు సాక్షిభావమున్నది. విషయ రాహిత్యము కలదు గాన, ఆనందము కలదనవలెను. విషయముండదు గాన చిత్తము క్రియాశీలముకాదు—ఇటులగుటజేసి చిత్తమునందు ప్రతిఫలించిన తత్త్వము అఖండ రూపముగా స్ఫూర్తినొందును. ఇది సమ్యక్స్ఫూర్తి కాకున్నను తత్పాదృశరూపముగా ఉద్గమించిన ఆనందము.

మాండూక్యమునందు జాగ్రచ్చేతన స్థూలభుక్కనియు, స్వప్నచేతన ప్రవివిక్త భుక్కనియు,సుషుప్తిచేతన ఆనందభుక్కనియు చెప్పబడెను. ఒకటి స్థూలప్రపంచ జ్ఞానము — ఇంకొకటి సూక్ష్మ ప్రపంచ జ్ఞానము-వేఱొకటి కారణ ప్రపంచజ్ఞానము. ఒకదాని ఉపాదానము స్థూలవస్తువు; రెండవదాని ఉపాదానము సంస్కారము, మూడవదాని ఉపాదానము అవిద్య. ఈ విశ్వమంతయు సమష్టిగాన జాగ్రదవస్థలో సమష్టి, స్థూలవిశ్వము ఒక సమష్టిచేతనచే ఉద్భాసిత మగుచున్నది.

ఇచట చేతన సమష్టి స్థూలజగత్తునం దమస్యూతమై స్థూలవిశ్వమును ప్రకాశింపజేయును. ఈ రీతిగనే సూక్ష్మ ప్రపంచమునందు సమష్టి సంస్కార జ్ఞానము సమష్టి సూక్ష్మచేతనచే ఉద్భాసితము. సమష్టిగత కారణ చేతనచే సుషుప్త ప్రపంచము ఉద్భాసింపజేయబడుచున్నది. జ్ఞానమునకు ఈ మూడు తావులందును విషయము కలదు. అది స్థూలము, సూక్ష్మము, మఱి కారణము. సుషుప్తిలో జ్ఞానమున కెట్టి విశిష్ట విషయము లేకున్నను నిర్విశేషమగు అవిద్యయే విషయము. సవిశేషమనియు, నిర్విశేషమనియు అవిద్యకు రెండు రూపములు. స్థూల సూక్ష్మ ప్రపంచములందు సవిశేష రూపమును, నిర్విశేషరూపము కారణ ప్రపంచమునందును మూర్తమైయున్నది. ఇది సక్రియము కాగనే దీని కెట్టి మూర్తరూపము(Concrete)ను ఉండదు. కార్యప్రపంచమున సృష్టిలో అవిద్య మూర్తరూపముతో ప్రకాశమొందును. కారణ ప్రపంచమున నిర్విశేషమగు ఉపాధిగాని యుండును. ఈ భూమిక లోని చేతన ఆనంద భుక్కని చెప్పబడెను. విషయ పరిచ్ఛిన్నత నుండి తొలగుటయే యిచటి ఆనందావభాసత. విషయాకారము వృత్తినుండి వేరగుటజేసియే ఇచట అమూర్తమగు ఆనంద సంవేదన స్మృతియున్నది. కాని అవిద్యకు సంపూర్ణతిరోధానములేదు. కావున ఈ భూమికలో పూర్ణజ్ఞానమునకుగాని పూర్ణానందమునకు గాని వికాసములేదు.

ఈ మూడును గాక తురీయమను వేఱొక యవస్థ కలదు. ఈ భూమిలో జ్ఞానమునకు విషయమేమియు లేదు. జ్ఞానమేకలదు. నిర్విషయమగు ఈ జ్ఞానమే చరమ స్థితి. ఇది సంపూర్ణముగా నొకానొక స్వతంత్రావస్థ. విషయ-విషయి—బోధము ఇందేమియు ఉండదు. ఈ యవస్థ అజయము, అశోకము. సాధకుఁడు దీని తృప్తిగనును, సమాహితుడగును. ఈ భూమి జీవత్వము యొక్క వ్యష్టిత్వమును, ఏనాటికిని లేకుండ తుడిచివైచును. సుషుప్తిలో విషయ జ్ఞాన ముండదు. ఇచటను ఉండదు. సుషుప్తిలో విషయ మేదియు లేదను జ్ఞాన ముండును. ఇందు నదియు నుండదు. సుషుప్తి కంటె తురీయమునకు ఇచటనే భేదము· సుషుప్తిలో అవిద్యా వృత్తి ఉండుననియు, తురీయమునం దేవృత్తియు నుండదనియు ఎఱుక గలవారు చెప్పుదురు. వేదాంత భాషలో చెప్పినచో— 'జాగ్రత్ స్వప్నము లందు అవిద్య విశేషాకారముగను సుషుప్తియందు

నిరాకారముగను భాసించును' అని చెప్పఁదగును. తురీయమునందు సవిశేష విద్యగాని నిర్విశేష విద్యగాని ఉండదు. ఆత్మ జ్యోతియే అచట వెలుగుచుండును. ఛాందోగ్యమున ఇంద్ర విరోచన సంవాద మున ఇది వివేచింపబడెను.

బృహదారణ్యకమున ఆత్మజ్యోతిని గూర్చి యీ ఉపాఖ్యానము చెప్పబడెను —

జనకుడు : జీవుఁడు ఏ వెలుగును సాయముగాఁ గొని కార్యములు నిర్వహించుకొనును ?

యాజ్ఞవల్క్య : సూర్యుని వెలుఁగు.

జనకుడు : సూర్యుని వెలుగు ఆకాశమున లేనపుడు ?

యాజ్ఞవల్క్య : చంద్రుని సాయమున.

జనకుడు : అదియు లేనపుడు ?

యాజ్ఞవల్క్య : ఆత్మజ్యోతిచే అపుడు విశ్వము వెలుఁగును.

ఆత్మజ్ఞానమే అన్ని జ్ఞానములకును ఆధారమని యీ సంభాషణమునకు తాత్పర్యము. అన్ని భూమిక లందును ఈ యాత్మ జ్ఞానము ప్రతిబింబితమగుట చేసియే జాగ్రదాదుల జ్ఞానము మనకు విడివిడిగా కలుగుచున్నది. అన్ని జ్ఞానములును ఆత్మనుబట్టియే కలుగుచున్నవి. కాని ఆత్మజ్ఞానమునకో దేని అపేక్షయు లేదు. అది స్వయంజ్యోతి.

# ఉపనిషత్తులలో ఆత్మ స్వరూపము

## ఆ త్మ స్వ రూ ప ము

జీవాత్మకును పరమాత్మకును భేదములేదని ఉపనిషదాశయము. ఉపనిషద్భాషలో — 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' అని ఆత్మస్వరూపము.

ఉపనిషదుక్తమగు ఈ సాక్షిరూపము అనుభవముచే లెస్స తెలిసికొనవలసియుండును. ఉపనిషత్తుల విద్యాసాధనకు సిద్ధిని ఏ తదనుభవము మోసియున్నది. సాక్షి ఉదాసీనుడైన ద్రష్ట. అతనికి క్రియలేదు, జ్ఞానము కలదు. అన్ని తెగల జ్ఞానమునకును సాక్షి కలదు, సాక్షి జ్ఞాన స్వరూపుడు. జాగ్రదాదుల మూటను సాక్షి కలదు. ఒకటి విషయ ప్రకాశము, విషయ భోగముకల అవస్థ. మఱియొకటి విషయముల యెడ ఔదాసీన్యము. విషయముల భోగించు జ్ఞానము సాక్షి కాదు. ఏ భోగమును భుజింపక చూచు చుండునది సాక్షి. చూచుట క్రియ కాదా? అని నీ వడుగ వచ్చును. చూచుటయు ఒక క్రియయే కాని అనుభవింపక చూచుట క్రియ కాదు. 'పశ్యన్ స్వపన్' అని గీత చెప్పెనే అని యందువా, నిక్కమే. చెప్పెను. కాని అది భోగముగల చూపు. ఈ చూచుటలో భోగము లేదు. నిక్కమున కది ఒక ఉనికి. ఆ చూపు నీ కలవడుచో అది క్రియ కాదని నీవు చెప్పగలవు. చూచు ధాతువున కిట్టి యర్థము లేకపోవుట సామాన్య దృష్టిలో. సామాన్య దృష్టి దురదృష్టమూ — విషయములతో ఎట్టి సంగమును కలుగకపోవుట వలననే సాక్షి చైతన్య మఖిలావస్థల యందును ఏకాకారమగు జ్ఞానము.

ఉపనిషత్తుల యందు సాక్షిని గురించి ఉన్న మాటలు కడుఁ గొలఁది. ఐనను తత్స్వరూపము బ్రహ్మమను నింగిత మెల్ల యెడ లను గలదు. ఈ సాక్షి చైతన్యము నధిగమించినచో ఉపనిషత్తులు చెప్పిన విద్యలు సిద్ధింపగల దారి దొరక గలదు.

# సత్యజ్ఞానానంద - బ్రహ్మము

సత్తాయొక్క రూప మానంద రూపము. ఉపనిషత్తులలో ఇది తుది మాట. తొలి చూపులో బ్రహ్మసత్తా రూపముతో అనగా ఉనికిగా (Existence) ప్రతీత మగును. అన్నిటికి మొదటి అవిభక్తమగు సత్త లేక ఉనికి. విభక్త సత్త అపూర్ణ రూపము. అవిభక్త సత్త సత్య రూపము. అనవచ్ఛిన్నమగు సత్త యనగా బాధితము కాని స్థితి. స్థితి రూపము సత్తా ప్రధాన లక్షణము. కాని యీ సత్త కేవలము స్థితి రూపమే కాదు — ఇది సంచార శూన్యమగు జ్ఞానము ఆనందమును—ఎట చైతన్యానందముల సంచారమో అట సత్యము కేంద్రమై స్ఫురించును. కేంద్రస్థమగు సత్త నవలంబించియే జ్ఞానానందముల సంచార వికాసమునను సంభవము. ఇది సృష్టి ప్రాథమిక క్షణము. సృష్టికి అర్థము - సత్త కేంద్ర మందునికియు శక్తికి మూర్తమగు వికాసమును. కాని సృష్టికి వెనుక సత్త అఖండము, అవిభక్తము. అపుడు జ్ఞానానందముల సంచారము లేదు. అపుడు స్పంద శూన్యములగు జ్ఞానానందములు సత్తా స్వరూపముగనే యుండును. ఉద్వేలముకాని నిర్విశేషదీప్తియు ప్రసారము మాత్రమే అప్పటి స్థితి. దీప్తి జ్ఞానసూచకము. ప్రసార మానంద సూచకము. ఆవరణ శూన్యత్వమే ఆనంద స్వరూపము. ఆనంద సంవేదన మిపుడుండదు. సంవేద శూన్యమగు ఆనందమే ఆనంద స్వరూపము. ఇట్టి ఆనందము సత్తాకు మారుపేరు. ఉద్వేలానంద మిపుడుండెను. అపుడు శాశ్వతానందము. సంచార శూన్యమగు నానందము బ్రహ్మానందము.

అఖండ సత్తా జ్ఞానము నిరుపాధికము. దీప్తి రూపమగు జ్ఞానమునకు స్ఫూర్తి లేదు. విషయము లేదు. ప్రజ్ఞా స్వరూపముగా ప్రజ్ఞాలోకమునకు ప్రభ లేదు. స్థూల సూక్ష్మ లోకముల ఆలోక స్పందములేదు. ఏ ప్రజ్ఞాలహరీమాలికచే విశ్వమును సూక్ష్మ విశ్వమును ఉద్భాసితమో, దేనిచే ఋతము ధృతమో అది ప్రజ్ఞాతితము. అది ప్రజ్ఞా రూపము. నిర్మలమును ఆర్ద్రమునగు నీ జోది ప్రజ్ఞానఘనము. స్పందన రహితమగు ప్రజ్ఞయే బ్రహ్మ జ్ఞానము. బ్రహ్మజ్ఞాన రూపమనినపుడు దాని ప్రకాశ రూపమే మనకు తట్టును. ఆనంద రూపమన్నపుడు ''శివమ్ సుందరమ్'' తట్టును నిర్ముక్తమును నిరావరణమునగు ప్రకాశము పరమ సుందరము.

శ్రీమతి ఎం. ప్రమీలారెడ్డి

# "రుద్రమదేవి"-నోరివారి వ్యక్తిత్వము

తెలుగులో ప్రథమ చారిత్రక నవల హేమలత మొదలు నేటివరకు వెలువడిన చారిత్రక నవలలలో చారిత్రక వాతావరణంతో బాటు వాస్తవిక మానవ జీవిత చిత్రణ కనబడుతుంది. చారిత్రక నవలా కారులైన విశ్వనాథ, బాపిరాజు, నోరివారు — వారి నవలల రచనా విధానంలో భిన్నభిన్న మార్గాలను అవలంబించినారు. విశ్వనాథలో వలె నోరివారిలోను ప్రాచీన భారతీయ సంస్కృతి, సంప్రదాయ వైశిష్ట్యం విశేషంగా వర్ణింపబడుతుంది. బాపిరాజుగారిలో చారిత్రక కాలం నాటి వాతావరణంతో బాటు వాస్తవిక మానవ జీవిత చిత్రణా లాలిత్యం కనబడుతుంది.

ప్రస్తుత రుద్రమదేవి నవలా రచయిత ఆర్షవైదిక మత ధర్మ విశిష్టతను, సంప్రదాయాలను వర్ణించి తమ నవలల కొక ప్రత్యేకతను ఆపాదించినారు వారి కల్పనలు చరిత్రతో మెలి వేసుకొని యథార్థాలుగా భాసిస్తాయి. వారి నవలలు చారిత్రకాలే అయినా వాటి నామాలే వాటి సాహిత్య స్వభావాన్ని కూడా వెల్ల డిస్తాయి. నారాయణ భట్టు, కవిసార్వభౌముడు, ధూర్జటి. కవి ద్వయము—ఇవి సాహిత్యానికి సంబంధించిన పేర్లు. మల్లారెడ్డి, రుద్రమదేవి చారిత్రక వ్యక్తుల పేర్లు. అయినప్పటికీ వీటిలో ఎఱ్ఱన, తిక్కన సోమయాజి ప్రధానపాత్ర వహించినారు. ఈ నవల లన్నింటిలో వారికి గల అనుపమాన సాహిత్యాభిమానము ప్రస్ఫుట మవుతున్నది. ముఖ్యంగా శ్రీ నోరివారి నవలా సాహితి కవిత్రయ సారస్వతాత్మ్మలకు ప్రతినిధి. సారస్వతంలోనే గాక సాంఘికంగా కూడా వారికి గల అభిరుచులు, ఆశయాలు వారి నవలలో వ్యక్త మవుతున్నాయి. వారి ప్రతిభను రెండు విధాలుగా పరిశీలించవచ్చు. 1) భారతీయ వైదిక సంస్కృతీ పరమైనది. 2) సాహిత్య పరమైనది.

## భారతీయ వైదిక సంస్కృతి

రుద్రమదేవి నవలలో శరన్నవరాత్రముల సందర్భంలో వెల్లడి అవుతుంది. వారు దేవీపూజ సంప్రదాయాలను బాగా ఎరిగిన వారు. వారు దేవీభాగవతాన్ని రచించినారు. ఈ శరన్నవ రాత్ర ప్రాశస్త్యాన్ని వారే ఈ కింది విధంగ నిరూపించినారు.

[1]"శరన్నవ రాత్రములు ప్రారంభమైనవి. భారతభూమిని భరతరాజులే పాలించు దినములలో శరన్నవ రాత్రముల కంటె జగన్మోహనమగు నుత్సవము మరొక్కటి లేదు. ఆ తొమ్మిది దినములును ప్రకృతియే దివ్యరూపముల నవతరించి పూజలు స్వీకరించును. శారదా రూపంలో శృంగారమూర్తి ప్రధానమో, వీరరేఖ ప్రధానమో, అద్భుతము ప్రధానమో, శాంతమే ప్రధానమో ఎవరు నిర్వచింపగలరు ? నవరసములకు నధిష్ఠానమగు నా మహా మాయ నేమని వర్ణింతుము."

[2]బాల పుట్టినరోజు సందర్భంలో [3]కుమారీ పూజా విధానము బాలా ప్రకార్చన విధానము వివరంగా వర్ణించినారు.

[4]కొప్పెరు జింగడు శుచియై సంధ్యావందనోపాసనాదికాలు నిర్వర్తించి సాయంకాల పూజాంగముగా వేదవేదాంగాది శ్రవణము, శ్రీమద్రామాయణ, మహాభారత, భాగవత శ్రవణము చేసినాడు. ఇంతటితో ఆపక నోరివారు తమ కిష్టమైన "శ్రీ దేవీభాగవత శ్రవణానంతరం ఊను.భంగరూపక భరత ప్రయోగమునాధరయ" అని ప్రత్యేకంగా చేర్చినారు.

[5]వైకుంఠ ఏకాదశి పుష్య శుద్ధైకాదశినాడు వస్తుందని తెలిపి అది నిర్ణయించటంలో స్మార్తులకు, శ్రీ వైష్ణవులకు గల భేదాభిప్రాయాలను ఆ సమయంలో స్వయంభూ దేవాలయంలో జరిగే అభిషేకార్చనలను కూడా వివరించినారు. "త్వరలో నుత్తరాయణ పుణ్యకాలము రానున్నది. దానికై ముందుగనే యానాడు విశ్వమూర్తియగు శ్రీ మహావిష్ణువు ఉత్తర ద్వారము తెరిపించి భక్తులకు దర్శన మిచ్చును." ఊరేగింపులు కూడా కన్నులకు కట్టినట్లు వర్ణించినారు.

[6]వసంతోత్సవాలను వర్ణిస్తూ ఇక్కడ దేవీభాగవతంలోని ఒక శ్లోకాన్ని ఉదహరించినారు. "కాలుని దంష్ట్రాయుగ్మమనగా విలసిల్లు వసంతమున్" అని వసంతోత్సవ మిషతో మళ్లీ దేవీ భాగవతమును గుర్తుకు తెచ్చినారు రచయిత.

## సాహిత్యము

నవలలో రుద్రమదేవి ద్రాక్షారామ ప్రయాణాన్ని పురస్కరించుకొని కిన్నెరసాని వాగును వర్ణించినారు. రుద్రమదేవి కిన్నెరసాని కదవిని ఆ వాగునుచూచి [7]"ఈ కిన్నెరసాని భర్తపై అలిగి ద్రవించి ఏరుగా ప్రవహించి రాళ్ళు రప్పలపైనుండి పొరుచు అడవులగుండ దిక్కులేక కాని మార్గమున సంచరించుచున్నది. తాను తెలుగురాణి, తన భర్త తనకు కాకుండ పోయినాడు. తానిట్లు ఒంటరిగా దేశమంతట సంచరించుచున్నది. అనుకొంది.

[8]"ఆ మహారణ్యంగో హోరుపెట్టి వీచుచున్న ప్రభంజనపు వేగమునుగూడ కిన్నెరసాని ప్రవాహ వేగము మించిపోయినది. కిన్నెర

సాని పొంగుగాంచిన కవీశ్వరులకే దానివర్ణింప సాధ్యము.'' అంటూ కవి విశ్వనాథవారి కిన్నెరసాని కృతిని సమకాలీన రచయితను ప్రశంసించినారు దీనివల్ల నోరివారి సహృదయము వెల్లడిఅగుచున్నది.

రచయిత తన జాతి, తన ప్రాంతము అన్న దురభిమానం లేకుండా కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలను వెల్లడించినారు.

[9]''ఆంధ్రులు శుష్కమీమాంసకులు. పెన్నాతీరవాసులకు తొందర ఎక్కువ. కృష్ణాతీర పండితులకు తలలో కృష్ణమృత్తిక హత్తుకొనిపోయినది. ఈ సప్తగోదావరీ పవిత్ర తీరమునందలి పండితులట్లుకాదు. ఈ వారి కావేరీవారివలెనే శుద్ధమైనది ఈ నీరు త్రావువారు రసజ్ఞులు'' ''కృష్ణాతీరమువారు నల్లని ఒందు మట్టినారు.''

ఈ మాటలు ఆయా పాత్రలచేత అనిపించినా అందులో కవి అభిప్రాయం వ్యక్తమవుతుంది.

ఈయనది ఆర్షప్రవృత్తి, సందర్భోచితంగా కథకు అంత రాయం కలగకుండా బ్రాహ్మణప్రశంస చేసినారు. చారిత్రకంగా ఏయ్యమ్మ రుద్రమదేవి కూతురు. ఆమె అన్న మంత్రిని వివాహ మాడింది. అన్న మంత్రి బ్రాహ్మణుడు. కాబట్టి నవలాకర్త ఏయ్యమ్మనుకూడా బ్రాహ్మణ బాలికగా మార్చి ఆమెను రుద్రమ పెంపుడు కూతురుగా చేసినాడు.

ప్రధాన కథకు అవసరంలేని సొంత గ్రామాలను పేర్కొని ఇతివృత్తంలో ఎక్కువభాగం అక్కడనే నడిపినాడు. రేపల్లె, గుంటూరు, మచిలీపట్టణము, నరసాపురము, ద్రాక్షారామము మొదలైనచోట్ల కథ నడిచింది.

రుద్రమదేవి కాలంలో జైనులే కరణాలు. వారందరూ ఒకే సారి సమ్మెచేసి రాజధానిలో అలజడి రేపినారు. ఒకేవృత్తి ఒక్కరి చేతిలో ఉండకూడదని కరణాలకు పాఠశాలలను నెలకొల్పి శిక్షణ ఇప్పించినారు. ఆ పాఠశాలలో శిక్షణ పొందిన బ్రాహ్మణులందరూ కరణీకపువృత్తి స్వీకరించినారు. ఇది నోరివారి కల్పన. [10] కరణీకపు వృత్తిగురించి 1145 లో గోపరాజు రామప్రధాని ఏర్పాటు చేసినట్లు ఆరువేలమందికి శిక్షణ ఇచ్చినట్లు మెంకజీ కైఫియత్‌ల వల్ల తెలుస్తుంది.

తిక్కనవలె నోరివారు హరిహరాద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించినారు. కాబట్టి రుద్రమ కాలంలో ఓరుగల్లును దర్శించిన పాల్కురికి సోమనాథునిగురించి ప్రస్తావించలేదు. రుద్రమ పరిపాలనతో ఎటువంటి సంబంధంలేని తిక్కన సోమయాజి పాత్రకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇవ్వడమేగాక తిక్కన భారతరచన ఓరుగల్లులో చేసినట్లు స్పష్టం చేసినారు.

[11]నోరివారు వృత్తిరీత్యా న్యాయవాదికాబట్టి సందర్భాను సారాన్నిబట్టి ఆయన తన ప్రతిభను చూపినారు. నవల మొదట్లోనే యౌవరాజ్య పట్టమున కధికార నిర్ణయములో జరిగిన వాగ్వివాదము పూర్తిగా న్యాయవాదులు కోర్టులో వాదించుకున్నట్లే మనకు కన బడుతుంది. వాదన తరవాత న్యాయవాదులు న్యాయ నిర్ణయాన్ని ప్రధాన న్యాయమూర్తికి వదిలిపెట్టినట్లే నవలలో న్యాయనిర్ణయము సభకు వదిలిపెడతారు. అంతేగాక [12] రాతికోట నిర్మాణ కార్యక్రమ విషయంలో పలువురు కరణాలు జైనవసదిలోని స్థలాన్ని రాజ భటులు అన్యాయంగా ఆక్రమించినారని రుద్రదేవ మహారాజుకు పత్రం సమర్పించినారు. ఆ సమస్యా పరిష్కారంలో రుద్రమదేవి వారికి అనుమతి ఇవ్వడం, అనుమతి ఇచ్చినా వారికి దాని ఫలితం అందకపోవడం చూసేవారికి ఫలితం దక్కినట్లే కనబడటం రెండు వైపులవారికి ఎవరికి వారికే న్యాయం జరిగినట్లు కనబడటం వారి న్యాయవాద వృత్తికి నిదర్శనము.

నోరివారు తమ స్నేహితులతో యుద్ధవర్ణన చేయడం తమకు చాలా ఇష్టమని, తాను అందులో లీనమవుతానని చెప్పుకొనే వారట. అదేవిధంగా రుద్రమదేవి నవలలో [13] జన్నిగసేనలు, కొప్పెరుజింగని సేనలు ఏవిధంగా తలపడింది, జన్నిగ ఏ విధంగా వ్యూహరచనచేసి యుద్ధ తంత్రాంగాన్ని నడిపింది, కొప్పెరుజింగని ఓడించింది చాలా చక్కగా వర్ణించినారు.

ఈయన బహుభాషా పండితులు. సాహిత్యంలో బహుముఖ ప్రజ్ఞ కలవారు. ఈ నవలలో కావ్యాలేగాక శాసనాలనుంచి కూడా శ్లోకాలను ఉదహరించినారు. ఒకటి రెండుచోట్ల ప్రాకృతము ఉదహరించినారు. తెలుగులో మహాభారతము, నిర్వచనోత్తర రామాయణము, పండితారాధ్య చరిత్ర, దశకుమారచరిత్ర, నృసింహ పురాణము, మనుచరిత్ర, శ్రీ కాళహస్తీశ్వరమహాత్మ్యము, సర్వేశ్వర శతకము, సుమతిశతకము, నారాయణ శతకము, క్రీడాభిరామము మొదలైనవాటిని ఉదహరించినారు.

సంస్కృతంలో ఉపనిషత్తులు, భారతము, మనుస్మృతి, కులార్ణవతంత్రము, విక్రమోర్వశీయము, నీతిశాస్త్రము, అమరుకము, కావ్యాదర్శము, దశకుమారచరిత్రము, పుష్పబాణ విలాసము, వ్రత కల్పము, హేమాద్రిదానఖండము, ప్రతాపరుద్రీయము, పాణినీయము భాసనాటకాలు (ఊరుభంగ నాటక ప్రదర్శన) పేర్కొన్నారు.

రచయిత రుద్రమదేవి కాలం నాటికి లేని యక్షగానాల ప్రస్తావన చేసినారు.

[14] ''ఆంధ్రదేశ ప్రజలకు కన్నడ భాషలో నున్న యక్ష గానములును, తమిళములో నున్న 'తెరుక్కూత్తు'లును బాగుగా నర్తము కావు.'' కాని ఇవి తరువాతి కాలంలో వచ్చినవని పరిశోధకులు నిర్ణయించినారు.

నోరివారి నవలలో ఇన్ని శ్లోకాలు, పద్యాలు ఉదహరించిన నవల రుద్రమదేవి తప్ప మరొకటి లేదు. నోరివారివే గాక మరి

ఏ ఇతర చారిత్రక నవలలో కూడా ఇన్ని శ్లోక పద్యోదాహృతులు లేవు.

## ఆధోజ్ఞాపకలు

1 రుద్రమదేవి నవల – పుట 46.
2 రుద్రమదేవి నవల – పుటలు 272–273.
3 కుమారీ పూజా విధానము దేవీభాగవతంలో ఉంది.
4 రుద్రమదేవి నవల – పుట 302.
5 ,, ,, ,, 320.
6 ,, ,, ,, 437.
7 ,, ,, ,, —
8 నవల పుట 388
9 నవల పుట 284
10 చాటు పద్యమంజరి–పుట 89, గోపరాజు రామప్రధాని
11 నవల పుటలు 20 నుంచి 26 వరకు
12 నవల పుటలు 195 నుంచి 212 వరకు
13 నవల పుట 293
14 నవల పుట 281

# అరచేతిలో 'అరోరా బొరియాలస్'

## డా॥ శ్రీభాష్యం రాంబాబు

గోదావరిమీది నిశ్శబ్దాన్ని గాలి కోస్తూ వుంటుంది.
రెల్లుపొదల్లోంచి ఎగిరిపోయే పిట్టల్ని చూస్తూ
తీరాన పాదయాత్ర చేస్తున్నప్పుడల్లా –
ఆవలి తీరాలకు పోయే పడవలు పిలుస్తూ వుంటాయి
తెరచాపల చేతులెత్తి.
మబ్బుకొండ గుండెలమీద నీ దివ్యాకృతిని చెక్కుతూ
వుంటాను

ఊహల ఉలులతో –
నీ 'పెలిసితీ' సురభిళ పరిమళమై
మస్తిష్కాన్ని చుట్టు ముట్టినపుడు
తీరంలో నిలిచిన పడవని ఎక్కుతాను
'అరోరాబొరియాలస్' రంగుల్ని
నీ అరచేతిలో గోరింటాకు పెట్టటానికి !

# మిణుగురులో సూర్యుడు!!

## శ్రీ ఐ. సంపత్కుమారాచార్య

అర్ధరాత్రమనే విలాసమందిరంలో
చీకటి నగ్నికగా నర్తిస్తూ
మృత్యుగీతాన్ని ఆలాపిస్తూంటే
ఆ విషాదలయలో
ఆనందాన్ని కొలుస్తున్నాడు...మనిషి !!

ఆ మందిరంలో ఓ మారుమూల
లిల్లీపుట్ కిరణం కదులుతున్నట్టు
తెలీదు...పాపం !
ఆ కిరణమే ఒకనాటికి సూర్యుడై
చీకటిని తరుముతుందనీ
తెలీదు !...పాపం !!

# నవ్విన నాపచేను......

## దిలావర్

మోడువారిన నా జీవన వృక్షాన్నిచూస్తూ
పరిహసించే నీ పసితనానికి
జాలిపడటంతప్ప ఏం జవాబు చెప్పగలను...?
చండప్రచండంగా చండ్ర నిప్పులు కురిపించే
ఎండల్ని మాత్రమే నువ్వెరిగున్నప్పుడు
శీతల వాతూలాల సేదదీర్చే
వసంతం గురించి ఏమని వివరించను ?
రక్తం రుచి మరిగిన రాకాసి కత్తివి నీవైనప్పుడు
బాధల అగాధాలను తనలో దాచుకున్న
ఈ గుండె మౌన ఘోషను ఎలా వినిపించను ?
పరాజయాల మేఘాలు కమ్మిన జీవితాకాశంలో
పూర్ణ చంద్రోదయం రానే రాదంటే నే నొప్పుకోను.
చిత్రవర్ణ జీవనరాగం నుండి తప్పుకోను.
హోరెత్తే ఆత్మవిశ్వాసం ప్రభంజనంలో
ఎగరేస్తాను మబ్బుల్ని దూది పింజల్లా !
హోమాగ్నిలా జ్వలిస్తున్న నా నెత్తురులో
బూది చేస్తాను పుచ్చు సమిధల్లా !
నేనంటే ఏమనుకుంటున్నావు ?
గ్రీష్మంలాంటి నీ అపహాస్యాన్నే
అపహాస్యంపాలు చేయగల హిమజ్వాలను !
దావానలం లాంటి ఆ గ్రీష్మంలోంచే
జీవశక్తిని పిండుకొని చిగురించగలను !
నీకు తెలియకుంటే విను
ముళ్ళు పరచిన బతుకు తోటలో
పరిమళాలు వెదజల్లే పూబాలను !

# చీకట్లో చిరువెన్నెల

## శ్రీ సూరం శ్రీనివాసులు

ఆకాశంలో పండువెన్నెల
అలల సొగసుతో విరిసినప్పుడల్లా
నువ్వు నిశ్చలంగా గగనంవైపు
నవ్వుతూ చూస్తున్నావనిపిస్తుంది.
చివురుటాకులు చిత్రంగా
నిలువెల్లా పులకరించినప్పుడల్లా
ఈ వనీతలాన్నీ — ఏ
అవనీ తలాన్నీ — నీ అడుగులు
మృదువుగా స్పృశించాయనిపిస్తుంది.
సంజె వెనుక పొరలు పొరలుగా
చీకటి తెరలు కప్పినప్పుడల్లా
నీ కాటుక కళ్ళు నాకోసమే
నీలాలను కురిపిస్తున్నా యనిపిస్తుంది.
కానీ !
పట్టపగలు సూరీడు
నిప్పులు క్రక్కుతూ నిలిచినప్పుడల్లా
విడిపోయిన నిన్ను నన్నుచూచి
ఈ లోకమంతా ఏకమై
వికటాట్టహాసం చేసినట్టనిపిస్తుంది.
అందుకే
నా లోకంలో
పగలు పాదంపెట్టే అవకాశం లేదు
ప్రశాంతమైన రేయి
పారిపోతే పూరుకొనేదీలేదు.

శ్రీ ఏ. కృష్ణారావు

# ప్రాచీన భారతరాజనీతి ప్రధాన భావాలు

ఆధునిక కాలంలోవలె రాజ్యము ఒక సిద్ధాంతపరమైన భావంగా ప్రాచీన భారతదేశంలో ఏర్పడలేదు. ప్రాచీన భారత రాజనీతి తత్త్వవేత్తలు రాజ్యానికి ప్రభుత్వానికి మధ్య వ్యత్యాసాన్ని గమనించ లేదు.

## ఆధారాలు

ప్రాచీన కాలంలోని రాజకీయ, సాంఘిక, ఆర్థిక సంస్థల వివరాలకు ముఖ్యమైన ఆధారాలు వేదాలు, క్రీ. శ. తరవాత ఐదు, ఆరు శతాబ్దాలలో ఉన్న రాజకీయ, ఆర్థిక, సాంఘిక సంస్థలవలె వేదకాలంలో అటువంటి వ్యవస్థలు ఉన్నట్లు మనకు తగిన ఆధారాలు కనపడవు· ఋగ్ వేదకాలంలో మతవ్యవస్థ రాజకీయాదికారాన్ని ప్రభావితం చేసింది. అందువల్ల మతం ముందు ఏర్పడి, అటు తర వాత రాజకీయ సంస్థలు ఏర్పడినాయని చెప్పవచ్చు. పురోహితుడు రాజుపై అధికారాన్ని చెలాయించేవాడు. మత, రాజకీయ సంస్థలు ఇంచుమించుగా పురోహితుడి అధికారానికి, ప్రాబల్యానికి లోబడి ఉండినవి. అయితే వేదకాలంనాటి భారతీయులకు రాజకీయ వ్యవస్థకు సంబంధించిన కొన్ని భావాలను గురించి కొంత తెలుసుననటానికి అథర్వవేదం మొదలైన గ్రంథాలలో ''రాజ్య'', ''స్వరాజ్య'', ''వైరాజ్య'', ''భోజ్య'', ''మహారాజ్య'' మొదలైన పదాలను గమనించవచ్చు. మైత్రేయ, సంహిత, ఐతరేయ బ్రాహ్మణ, జైమి నీయ-మొదలైన ఉపనిషత్ గ్రంథాలలో కూడా ఈ భావాలు కని పిస్తాయి.

## రాజ్యం ఆవశ్యకత

పాశ్చాత్య దేశాలలోవలె ప్రాచీన భారతదేశంలో కూడా సామా జిక వ్యవస్థనుంచే రాజకీయాధికారం ఏర్పడింది. బంధుత్వము, మతము, ఆర్థికావసరాలు రాజ్యావతరణకు తోడ్పడినాయి. సమాజ ప్రయోజనాల నిమిత్తమయి వ్యక్తులను అధికారానికి బద్ధులను చేసే ధోరణికూడా కొంతవరకు తోడ్పడింది.

రాజ్యావతరణకు అన్నిటికంటే ముఖ్యమైన కారణము ఆత్మ రక్షణ.

''ప్రజాపతి మానవులను, సమస్త చరాచరాలను సృష్టించ గానే అవి రక్షణ లెక భయంవల్ల వివిధ దిక్కులవైపు చెదరిపోగా భగవంతుడు ప్రజలను కాపాడటానికి ఒక రాజును నియమించినాడు'' అని మనుస్మృతి చెబుతున్నది. ప్రభువుపట్ల భయభక్తులవల్లనే ప్రజలు సుఖ సంతోషాలను అనుభవిస్తూ తమ విద్యుక్త ధర్మాలను నిర్వహించేవారు. ''రాజు నిర్దయతో నేరస్థులను శిక్షించకపోయినట్ల యితే బలవంతుడు బలహీనుడిని, చేపను వేయించినట్లు వేయించుకు తినేవాడు; యాజమాన్యం ఉండేదికాదు. అధములు ఉన్నత స్థానా లను ఆక్రమించి ఉండేవారు'' అని మనుస్మృతి చెబుతున్నది.

దానినిబట్టి ఈ క్రింది విషయాలు తెలుస్తున్నాయి :

1. సమాజం రాజ్యంకన్న ముందే ఏర్పడింది.
2. బలహీనులు బలవంతులను చూసి భయపడేవారు.
3 బలహీనులను రక్షించటానికి రాజ్యాధికారం దైవదత్త మైనదని ప్రజలు భావించేవారు.
4. ప్రభువుయొక్క దండనాధికారానికి భయపడి రాజాజ్ఞ లను విధేయతతో ప్రజలు పాటించేవారు.

వీటినిబట్టి రాజ్యావతరణ ప్రజల భయంనుంచి రక్షణపట్ల ఆసక్తినుంచి ఏర్పడిందని భావించవచ్చు. రాజులేని వ్యవస్థ అరాజ కము, చిన్నచేపను పెద్దచేప మ్రింగినట్లు బలవంతులు బలహీను లను బాధిస్తారని కౌటిల్యుడు అర్థశాస్త్రంలో అంటాడు. రాజ్యాధి కారం బలహీనుడిని బలవంతుడితో సమానంచేసి అతనికి రక్షణ కల్పిస్తుంది.

## మానవ స్వభావము

మనుస్మృతి, అర్థశాస్త్రము మొదలైన గ్రంథాలలో మానవ స్వభావము చంచలమైనదని, స్వార్థపూరితమైనదని, బల మైన అధికారమే మానవులను అదుపులో ఉంచుతుందన్న భావం స్పష్టంగా కనిపిస్తుంది.

''నిస్వార్థమైన వ్యక్తి కనిపించడు. మానవులందరినీ శిక్ష, భయంద్వారా అదుపులో, క్రమబద్ధతలో ఉంచటంవల్లనె సమా

జంలో శాంతి, సంపద. నెలకొన్నాయి'' అని మనువు చెబుతాడు. మహాభారతం, యాజ్ఞవల్క్యయకమండక, శుక్రనీతి మొదలైన రచనలు ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తాయి. శిక్షద్వారా రక్షణ సాధ్యమవుతుందన్న భావం మన ప్రాచీన రాజనీతివేత్తలు వ్యక్తంచేసారు.

## రక్షణయొక్క ధ్యేయము

వర్ణధర్మాన్ని కాపాడటం, వర్ణ సంకర్వాన్ని అరికట్టటం, వివిధ వర్ణాలకు చెందిన ప్రజలు వారి ధర్మాలను, కర్తవ్యాలను నిర్వహించేటట్లు చేయటం నియంత్రణ ప్రయోజనము. ఈ సందర్భంలో మనువు ఈ విధంగా చెబుతాడు:

''వర్ణసంకర్వాన్ని అరికట్టటం, బలహీనులను బలవంతుల దౌర్జన్యంనుంచి కాపాడినప్పుడు ప్రభువు అధికారకాలు, సంపద అభివృద్ధి చెందుతాయి. ప్రజలకు రక్షణ కల్పించినప్పుడే వారి ఆధ్యాత్మిక సంపదలో ఆరవభాగాన్ని పొందటానికి ప్రభువు అర్హుడవుతాడు.''

కౌటిల్యుడు కూడా ''అర్థశాస్త్రం''లో ఈ విషయాన్ని ఇంకా వివరంగా చర్చిస్తాడు. ప్రభువు ప్రజలను అగ్ని, వరద, కరువు కాటకాలు, ఎలుకలు, చీడపురుగులు, రోగాలు, పులులు, పాములు, భూతపిశాచాల బారినుంచి కాపాడాలి.

## రా జ్య స్వ భా వ ము

రాజ్యము మతంనుంచి, మత కార్యకలాపాలను నిర్వహించే పురోహితుల ప్రాబల్యంనుంచి ఏర్పడిందన్న వాదం సరైనదికాదు. అదేవిధంగా రాజ్యవ్యవస్థ దైవాంశంనుంచి ఏర్పడిందన్న భావం గూడా ప్రశ్నించదగినదే.

## వ ర్ణా లు

ప్రాచీన భారతంలో రాజ్యము జీవసిద్ధాంతానికి (Organic theory) అనుగుణంగా ఏర్పడిందని చెప్పవచ్చు. అనేక సామాజిక సంస్థలు ఏర్పడి విభిన్న కార్యకలాపాలను నిర్వహిస్తూ చివరకు రాజ్య లక్ష్యాలను బలపరిచేలా రూపొందినాయి. బ్రాహ్మణులు లేదా పురోహితులు, క్షత్రియులు లేదా యుద్ధవీరులు, వైశ్యులు లేదా వ్యాపారులు, శూద్రులు లేదా కాయకష్టం చేసేవారు అని ప్రజలు నాలుగు వర్ణాలుగా ఏర్పడి వారి వారి ప్రత్యేక కర్తవ్యాలను నిర్వహించేవారు. అయితే ఈ వర్ణాలు పరస్పరం ఆధారపడుతూ, సహకరిస్తూ సమాజ సాధారణ ప్రయోజనాల నిమిత్తమై కృషిచేసేవారు. క్షత్రియులు, బ్రాహ్మణులు పరస్పర ప్రయోజనాలకోసం పని చేసేవారు. వ్యాపార వాణిజ్య కార్యకలాపాలను వైశ్యులు నిర్వహించేవారు. దురదృష్టవశాత్తు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యుల తరవాత వర్ణక్రమంబు శూద్రులకు స్థానం ఏర్పడింది. వారు నాలుగవ స్థానంలో ఉన్నప్పటికీ వ్యవసాయము, వాణిజ్యము, వ్యాపారము మొదలైనవాటిని నిర్వహించే వైశ్యులస్థాయికి శూద్రులు చేరవచ్చని కౌటిల్యుడు భావించినాడు.

సామాజిక ప్రయోజనాలనిమిత్తం వర్ణాలు ఏర్పడి వాటి మధ్య పరస్పర సహకారంతో విభిన్న ధర్మాలు నిర్వహించటం అవసరమని మనువు, కౌటిల్యుడు భావించినారు.

## రాజ్యలక్షణాలు : కర్తవ్యాలు

ప్రాచీన భారత రాజనీతి తత్త్వవేత్తలు రాజ్యానికి ఏడులక్షణాలు ఉండాలని భావించినారు. అవి: ప్రభువు, అమాత్యులు, దుర్గము, కోశము, ప్రజలు, సైన్యము, మిత్రరాజ్యాలు. వీటిని కలిపి సప్తాంగ రాజ్యసిద్ధాంతము అంటారు.

### 1. ప్ర భు వు

రాజ్యానికి అధిపతి అయిన ప్రభువు విద్యావంతుడై, సులక్షణములను అలవరుచుకొని, పరిపాలనాదక్షత, నిగ్రహము, కర్తవ్యపరాయణత కలిగియుండాలి. తన పూర్తి కాలాన్ని, శక్తిసామర్థ్యాలను, వనరులను ప్రజాసంక్షేమానికి పూర్తిగా వినియోగించాలి. ప్రజల ఆసక్తులను, శ్రేయస్సును విస్మరించిన ప్రభువు నిరంకుశంగా తయారయి తన ప్రజలకు, చివరికి తన ఉనికికి ప్రమాదం తెచ్చుకొంటాడు.

### 2. అ మా త్యు లు

ప్రభువు తన ధర్మాలను సక్రమంగా నిర్వహించటానికి సమర్థులైన అధికారులను, సలహాదారులను కలిగి ఉండాలి. వారిలో మంత్రులు ఉన్నతాధికారులు. వారు విధానాలను నిర్ణయిస్తారు వారి పర్యవేక్షణలో అధికారులు పరిపాలనా కార్యకలాపాలను నిర్వహిస్తారు. మంత్రి మండలి సమావేశాలకు ప్రభువు అధ్యక్షత వహిస్తాడు. ప్రతి మంత్రి అతని అభిప్రాయాన్ని యధేచ్ఛగా వ్యక్తం చేయాలి. అయితే తుది నిర్ణయం మాత్రం ప్రభువుదే. సాధారణంగా అధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని ప్రభువు పాటిస్తాడు. ''సామర్థ్యము, స్వామిభక్తి'' మంత్రుల నియామకంలో పాటించవలసిన అర్హతలని కౌటిల్యుడి అభిప్రాయము.

### 3. ప్ర జ లు

రాజ్యంలో మరొక ప్రధానాంశము ప్రజలు. జనపదం అంటే ప్రజలు, ప్రదేశము అని రెండు అర్థాలు ఉన్నాయి. ప్రజలతోపాటు నివాసయోగ్యమైన, రక్షణ సాధ్యమయిన సంపదను సమకూర్చే సారవంత భూములు కూడా అవసరము.

## 4. దుర్గము

ప్రభువు రాజ్యంలో కేంద్ర ప్రదేశంలో నివాసం ఏర్పరుచుకోవాలి. రక్షణ నిమిత్తమై దుర్గములు కలిగిఉండాలి. దుర్గములు, సైనిక సంపత్తిలో ఆహార ధన ధాన్యాలతో శత్రువులకు అభేద్యంగా ఉండాలి.

## 5. సైన్యము

రాజ్యరక్షణ నిమిత్తమయి ప్రభువుసుశిక్షితమైన సైన్యాన్ని కలిగి ఉండాలి. సైన్యము సాధారణంగా వంశ పారంపర్యంగా ఏర్పడితే శ్రేష్ఠము. అలా కాకుండా కేవలం జీత భత్యములపై ఆధారపడిన కిరాయి సైన్యం తగినంత స్వామిభక్తితో రాజ్యరక్షణ చేయ జాలవు.

## 6. మిత్ర రాజ్యాలు

రాజ్య లక్షణాలలో మరొక ప్రముఖమైన అంశము మిత్ర రాజ్యాలు. మిత్ర రాజ్యాల ఆవశ్యకత ప్రభువుకు రాజ్య రక్షణకై ఎంతైనా అవసరము. మిత్ర రాజ్యాలను సంధి సంప్రదింపులద్వారా, వంశ పారంపర్యంగా, వివాహం ద్వారా సంపాదించుకోవచ్చని కౌటిల్యుడు "అర్థ శాస్త్రంలో" చెబుతాడు.

ప్రాచీన భారత రాజనీతి రెండు ప్రధానాంశాలను స్పష్టం చేస్తుంది.

(1) రాజ్యము అరాజకాన్ని తొలగించటానికి ఏర్పడింది. చట్టము, న్యాయము, రక్షణలకు రాజ్యము ప్రతీక. రాజకీయ వ్యవస్థ లేకపోతే శాంతి భద్రతలు ఉండవు. "మత్స్య న్యాయ" సూత్రాన్ని అనుసరించి బలవంతులు బలహీనులను పీడించటం, సాంఘిక సంక్షోభము, వర్ణ సంకీర్ణత అన్ని రంగాలలో ఏర్పడి అరాజకానికి దారి తీస్తుంది.

(2) రాజ్యము అరాజక శక్తులను అరికట్టి శాంతి భద్రతలను స్థాపించటానికి ఏర్పడినప్పటికీ దాని ప్రయోజనం రక్షణ కర్తవ్యాలకే పరిమితం కాదు. రాజ్య ప్రయోజనము, మనుగడ జీవితాశయాలైన ధర్మము, అర్థము, కుటుంబ ప్రయోజనాలను సాధించటం. మొదటిది వ్యక్తి సాంఘిక, నైతిక విలువలను సూచిస్తుంది. రెండవది ఆర్థిక సంపదను, మూడవది కుటుంబ ప్రయోజనము, సాధారణ సౌఖ్యాలను గుర్తిస్తుంది. రాజ్యాధికారానికి మూలము

దండనాధికారము. ధర్మార్ధ కామాసక్తులను రక్షించటానికి దండము లేదా దండనీతి ఉపయోగపడుతుంది.

## ప్రాచీన భారత రాజ్యము : ఆధునిక రాజ్యము

ఆధునిక రాజ్యానికి ఉన్న లక్షణాలు ప్రాచీన భారత రాజ్యానికి కూడా ఉండేవి. ప్రభువు, పరిపాలన–సైన్యము, ప్రజలు. అయితే ఆధునిక రాజ్య కార్యకలాపాలు సాంఘిక, ఆర్థిక రక్షణ అవసరాల నిమిత్తం వ్యక్తి స్వేచ్ఛను పరిమితంచేసే విధంగా ఉండగా ప్రాచీన భారతదేశంలో రాజకీయాధికారం పరిమితంగా ధర్మశాస్త్రాల కనుగుణంగా ఉపయోగించబడినది.

## సంప్రదింపు రచనలు


1. SUBSTANCE OF HINDU POLITY
– Chandra Prakash Bhambhri

2. SOME ASPECTS OF ANCIENT HINDU POLITY
– Bhandarkar

3. STATE IN ANCIENT INDIA
– Beni Prasad

4. HINDU POLITICAL THOUGHT
– V. P. Verma

5. STATE AND GOVERNMENT IN ANCIENT INDIA
– A. S. Altekar

6. HINDU POLITY
– K. P. Jayaswal

7. A HISTORY OF HINDU POLITICAL THEORIES
– U. N. Ghoshal

8. THE WHITE UMBRELLA
– D. Mackenzie Brown.


# స్మృతి

శ్రీ పసని ఆర్. హరినాథ్

సమీరం సుతారంగా
  శరీరాన్ని తాకిన
ఏ ప్రాతఃకాలానో
మెలకువ నిద్రలేపుతుంది.

కనరాని
ఏ ఊర్ధ్వలోకాలనుంచో
నీ పాట లీలగా వినిపిస్తుంది.

అప్పుడే –
కన్నీళ్ళను కౌగిలించుకున్న కళ్ళు
నిర్వేదంగా నవ్వుతాయి.

★ — ★

# కాసింతలోనే...

శ్రీ గుమ్మనూరి రమేషబాబు

ఎంత ఆశ్చర్యం !
  జీవితమంతా ...
జానెడు కడుపులోనే, పిడికెడు గుండెలోనే !
అంతేకాదు,
గుప్పెడు మమతలలోనే, దోసెడు కన్నీళ్లలోనే !
అంతా, కాసింతలోనే ! (?)
ఆలోచిస్తున్న నాకు
అంతేకదూ ! అన్నట్లు
గుక్కెడే గుక్కెడు శంకుతీర్థాన్ని
నా చేతిలో పోసాడా అర్చకుడు !

★ — ★

జాతశ్రీ

# జీబ్రా

గంట కొట్టడానికి యింకా అరగంట టైముంది.

పాఠశాల తోటమాలిగా ప్రభుత్వంనుండి జీతం పుచ్చుకొంటూ హెడ్మాష్టరింటో పనిచేసే ఏశావు, ఆనాడు తోటలో గడ్డి పీకుతున్నాడు.

వరండాలో నిలుచున్న చప్రాసి — ఓదేలు, బీడీ త్రాగుతూ తుమ్మెదల్లా విహరిస్తున్న విద్యార్థులకేసి చూస్తున్నాడు. విద్యార్థులు కనిపించని క్షణాల్లో అతని చూపు అంతరంగంకేసి మరలుతుంది. ఆ క్షణాలు-దుర్లభాలు, కన్నీటి వలయాలు. ఇరవయ్యేళ్లుగా సాగిన జీవితంలో ఏ రంగూ, రుచీ లేకపోగా, ముందున్న జీవితం కూడా—అలానే—శూన్యంలా కన్పిస్తుంటే, యింతకాలం గంటను కొట్టిన దెబ్బలు—తన గుండెల్లో మార్మోగుతున్నట్టుగా వణుకుతాడు. "ఛీ...ఛీ...యీ ఉద్యోగం కాకుండా రోడ్డెంట పళ్లీలమ్ముకొన్నా బాగుపడేవాణ్ణి" వణుకుతోపాటు మనసున బుడగేసే తలంపది.

హెడ్మాష్టరింకా రాలేదు.

హెడ్‌మాస్టర్ గదికి కుడిగా, నలుగురూ నడిచే బాట కెదురుగా నాలుగు బారల పొడవూ, అంతే వెడల్పూ వున్నగది స్టాఫ్ రూం. అది కట్టిననాడు తరగతి గది. ఆ తర్వాత లైబ్రరీ, ఆఫీస్, రికార్డ్ గదిగా దశలుమారి ప్రస్తుతం స్టాఫ్ రూంగా వుంది. అదే గది విశాఖ ఉక్కు, తెలంగాణా ఉద్యమాల ఉధృతంలో సి. ఆర్. పి. క్యాంప్‌గానూ, కొన్నిసార్లు ఎన్నికల పోలింగ్ బూత్‌గానూ ఉపయోగపడింది.

ప్రస్తుత మా గది పతనావస్థకేసి 'పయొనీర్'లా పరిగెడుతుంది.

గది మధ్యలో—ఓ కాలుకు బుణం తీరిన ముసలిబల్ల, బెంచీ ఆసరాతో తన ఉనికిని కాపాడుకుంటూంది. బల్లచుట్టూతా కదిలితే కరిచే కుర్చీలు మూడూ, కదిలిస్తే విడిభాగాలైపోయే రెండుబెంచీలు వున్నాయి.

తూరుపుగా-బేల్ చెక్కల బీరువానిండా కట్టలుగా పేర్చి వున్న నోట్సులు యూనిట్ పరీక్షలవీ, యింటిపనివీ..., ఆ ప్రక్కనే 'స్టాక్ రిజిష్టర్'లోంచి తొలగించబడని, ఉపయోగానికి పనికిరానివి — మేప్ స్టాండ్, ఆటసామాను, చెదలుతిన్న రికార్డు, మధ్యాహ్న భోజన పాత్రలూ, డ్రామా కర్టన్లూ కలగా పులగంగా వున్నాయి.

ఉత్తరంగా కిటికీ—అత్యవసరంలో ద్వారంలా కన్పిస్తూంది. పయిగా రెప్పవేయకుండా చూస్తున్న నెహ్రూ, రాధాకృష్ణ, ఇందిరా గాంధీ, వెంగళరావు వగయిరా నాయకులు-ఫ్రేముల్లో బిగించబడి వున్నారు. మొదటిద్దరికీ రంగువెలిసిన చమ్కీదండలు ప్రత్యేకం. ఒక్క వెంగళరావు తప్ప, మిగతావారు ఈస్ట్‌మన్ కలర్‌లో వున్నారు. నెహ్రూజీకి కుడిగా వుండే గాంధీజీ ఫోటో స్వాతంత్ర్య దినోత్సవంలో పూజా పురస్కారాలందుకొని, పతాకోత్సవంలో గౌరవ వందన స్వీకారం అందుకొనేందుకు గోడదిగి, మళ్లీ ఎక్కడానికి ఓపిక లేదన్నట్టు, మేప్ స్టాండున పూలదండతో ఉరేయబడిన మానవతలా వున్నారు. ఫొటో నిండా కుంకుమబొట్లూ, అగర్‌బత్తీ నల్లరూ గాంధీజీరూపం—అస్పష్టంగా వుంది.

బల్లచుట్టూవున్న ఆసనాలపై ఆరుగురు మాష్టర్లు కూచున్నారు. వారిలో ముగ్గురు పరువంలో వున్నారు. యిద్దరిలో లేత ముదిమి ఛాయలు వున్నాయి. ఒకతను నడివయసు నిఘంటువు నెమరేస్తున్నాడు. వారి సగటు వయసు ముప్పయి నాలుగు.

వారిలో ఒకరి వ్రేలికి అరతులం బంగారం వుంది. ఒకరి చెప్పులు పదవీ విరమణస్థాయిలో వున్నాయి. ఒకరి నూలు చొక్కాకు అతని శ్రీమతి కుట్టిన కుట్లున్నాయి. ఒకతని టెరీన్ షర్టు జేబులో పదిరూపాయలనోటు కనబడుతూంది. ఒకతను బర్కిలీ వెలిగిస్తే, ఆ వెలుగుతో బీడీ వెలిగించేదు మరొకడు. వారి నెలసరి సగటు ఆదాయం ఐదొందల పదీ చిల్లర.

బల్లమీద దినపత్రిక వుంది. మొదటి పేజీలో 'ఉడుకుతున్న దేశం' కార్టూనుంది. మంట రాజేస్తున్నవారిలో ఒకరికి కోతితోక, ఒకరికి రాబందు ముక్కూ, మరొకరికి కుక్కమూతి, మిగిలినవారికి తోడేలు తలవుంది. అందరి నెత్తినా జెండాలున్నాయి. వాటిమీద చిహ్నాలున్నాయి. ఆ చిహ్నాలు బాలెట్ పేపర్‌ద్వారా జాతికి పరిచయమౌతున్నవే!

పత్రిక చూస్తున్నతను—రామ్మూర్తి. అతనికి పెళ్లాం లేకపోయినా బ్రతగ్గలడు గాని, పేపర్ లేకుంటే బ్రతకలేడు. సుస్థిరమైన రాజకీయాలకంటే రంగులరాట్నపు రాజకీయాలంటే ఉత్సాహం చూపే గాలివాటం మనిషి.

అతనంటే పరువంలో వున్నవాళ్లకు పరిహాసంగానేకాదు, అసహ్యంగానూ ఉంటుంది. 'యీ పార్టీలూ, పదవుల పోటాలూ దేశాన్ని సుసంపన్నం చేయవనీ, అన్ని విలువల్నీ ధ్వంసంచేసి, కొత్త

వ్యవస్థను ఆవిష్కరించా'లని వీరి వాదం. ఆ వాదానికి ప్రతివాదం చేసినవాళ్లను 'ఏర్దేవా'గా చూస్తారే తప్ప, వివరణ యివ్వరు. క్రికెట్ కామెంటరీ వినడంలోనూ, అమితాబచన్ యాక్షన్ చూడ డంలో అభిరుచి వున్నవాళ్ళు—జీవన్, యాదగిరి, సుబ్బారావు.

మిగిలినిద్దరూ—కామేశం, నాయుడు; యిద్దర్నీ టీచర్లనడం కంటే టీచర్స్ యూనియన్ కార్యకర్తలనడం—సబబు. నాయుడు జిల్లాశాఖ యూనియన్ కార్యదర్శి, కామేశం మరో యూనియన్‌కి ఎక్సఫిషియో మెంబర్. ఎప్పుడూ ట్రాన్స్‌ఫర్లూ, యింక్రి మెంట్లూ, జి. వో.లూ, యూనియన్ గొడవలూ... వారికి వృత్తి పరంగా విద్యార్థులూ,జీవితంపరంగా భార్యలూ—చిట్టచివరిఅంశాలు.

''ఆం! . అరె! కొట్టేడు ఛాన్సు.'' పేపరు చూస్తున్న రామ్మూర్తి టక్కునన్నాడు.

అంతా ఉలికిపడుతూ, చూపుల్ని రామ్మూర్తికేసి నడిపేరు. ఆ చూపులు కొడవలి రూపంలో వున్నాయి.

రామ్మూర్తి అహం ఓ మెట్టెక్కింది. ''అందుకేనోయ్, నే చెప్తా...ప్రపంచ పోకడకు దర్పణం—పత్రిక. యీనాటి వార్తను చదవనివాడు నిన్నటి చరిత్రను నమ్మగలడా? . నమ్మకం లేనివాడు పాఠం చెప్పగలడా? విద్యాస్థాయి పడిపోతుందంటే పోదూ మరి?... పాఠాన్ని ప్రపంచపోకడ కన్వయించి చెప్పని పంతులూ వో పంతు లేనా?...'' వాదనకు రండని, ఆహ్వానించే రీతిలో సర్దుకొంటూ అన్నాడు.

''అన్‌నవ్‌ను ... యీమధ్య మా యం. యల్. సి. గారు స్టేట్‌మెంటిచ్చారు కూడా విద్యారంగంలో యీ మార్పుకోసం, జనవరిలో రాష్ట్రస్థాయి సదస్సూ, ఫెబ్రువరినుంచి అంచెలవారీ ఉద్యమం చేపడుతుంది మా యూనియన్.'' కామేశం.

''యీ సదస్సుల్తో, అవకాశవాద వుద్యమాల్తో, విద్యారంగం చచ్చినా బాగుపడదు. అసలు మన 'సెటప్'లోనే లోపం వుంది. యీ సెటప్‌లో విద్యకాదు, మరే రంగమైనా మాటల్లోతప్ప చేతల్లో ముందుకుపోదు. అందుకని...'' యాదగిరి అంటుంటే,

కామేశం బనాయింపు ధోరణిలో—''ఔా...సెక్రటరీ పదవిపోతే యూనియన్ని చీల్చిన ఘనులున్న రంగంలో గురుడు చెప్పింది కరక్టే . '' అని, 'దెబ్బకొట్టేను' అనుకొన్నాడు.

'కొట్టేర్రా దెబ్బ' అనుకొన్న యాదగిరి, మారుదెబ్బకోసం వెలికేదు గాని, మంచి ధరగల మాటలు దొరకలేదు.

రంగం — రణరంగపు రూపెత్తేలా వుందనుకొంటూ, రామ్మూర్తి—''అసలు ఛాన్సు కొట్టినవ్వాడ్న అడుగునేశారు. మన బుచ్చెయ్యలేడా? . ఏదీ ... మూడేళ్లకింద యీస్కూల్లో పిల్లలచే దెబ్బలు తిన్న బుసికళ్ల బుచ్చెయ్యకి—'బెస్ట్ టీచర్ అవార్డ్' వచ్చింది'' అన్నాడు.

''ఆం!''—అంతా

ఒక టీచర్‌కి 'అవార్డ్' వచ్చినందుకు కాదు ఆ 'ఆం!'... బుచ్చెయ్యకు వచ్చినందుకు.

బుచ్చెయ్య హయ్యర్‌గ్రేడ్ టీచర్. యూనియన్ కార్యకర్త కాడు. ఆఫీసుల్లో పలుకుబడీ లేదు. పాఠాలు తప్ప మరో ప్రపంచం లేలీని వ్యక్తి. అటువంటి అనామకునికి 'అవార్డ్' యివ్వడం, తమం దరికీ అవమానంగా తోచి ఆ—'ఆం...'

''అతనిలో ఏ మెరిట్ చూసిచ్చారండీ?''

''ఏ 'మెరిట్' లేకపోవడమే 'మెరిట్'!'' జోకేసేననుకొన్నాడు సుబ్రావు.

''గ్రాడ్యుయేట్ నాదిలేసి, హయ్యర్‌గ్రేడ్ కివ్వడమేమి టండీ?'' అన్నాడు జీవన్. అతను సెకండరీ గ్రేడ్‌గా ఉద్యోగంలో చేరి, ప్రయివేటుగా బి. ఏ. రాసి, అత్తెసరు మార్కులతో పాస య్యేడు. బి. ఏ. చదవని పంతుళ్లంతా మొద్దులని అతని మొద్దు నమ్మకం. పేరు చివరన బి. ఏ. అని రాయడం అతనెన్నడూ మర్చి పోడు. పోస్ట్ కార్డుమీదనైనా సరే!

''ఈసారి 'కో ఆర్డినేషన్' మీటింగ్‌లో యీ అవార్డ్ మీద దుమారం లేపుతాం చూడండి.'' ,నాయుడు.

''నా రీ–ఫిక్సేషన్ సంగతి మర్చిపోకు గురూ...'' రామ్మూర్తి.

''యీ—సిల్లీ, ఒక టీచర్‌కి అవార్డొచ్చినందుకు దుమారం అంటున్నారు గాని, ట్వంటీ పర్సంట్ లేనిదే 'బిల్' పాస్‌చేయని యల్. యఫ్. ఆఫీసర్‌మీద దుమారం లేపరేం?''

రోగ్ వాడ్ని కాల్చి పారేసినా పాపంలేదు. టీచర్ల సొమ్ము తిని, రోడ్ రోలర్‌లా బొర్ర పెంచేడు. వి షుడ్ నాట్ లీవ్ సచ్ స్టుపిడ్స్'' సుబ్బారావు 'జోక్'లా అనలేదు, క్రాక్‌గా అరిచేడు.

''సుబ్రావ్... మనం అరవడం తప్ప, యూనియన్ కివి పట్టవండీ ..మీకు తెలీదుగాని, ఆ ట్వంటీలో — ట్వంటీఫయివ్ పర్సంట్ వీళ్లకి ముడుతుంది.'' కామేశం.

''వెనకటి కెవడో—'గాలిని మూటగట్టేను, అంటే—నానెత్తి కెత్తు, మోసుకెళ్తాను' అన్నాడట నీలాటివాడు. ఏదైనా బుజువు చూపి మాట్లాడితే మంచిది. పైగా మేధావులం'' నాయుడు కాస్త సీరియస్‌గా అన్నాడు.

గాలి—సుడి తిరిగేలా వుందని గ్రహించిన రామ్మూర్తి, తన గోదావరీ పుష్కర స్నానానుభవాన్ని చెపుదామని నోరు తెరుస్తుంటే, సుడిగాలిలా దూసుకొచ్చేడు చెలం. పూర్తిపేరు జోగుల వింగోపాల వెంకటాచెలం. రిజిష్టర్‌లో జి. వి. జి. వెంకటాచలం అని వుంటుంది. వస్తూనే ''యిది విన్నారా?'' అన్నాడు.

కేంద్రప్రభుత్వంలో 'నందా'గారిలా చెలం— ఆ స్కూల్లో— రెండుసార్లు యిన్చార్జిగా వున్నాడు. ఆ కాలమే స్వర్ణయుగమనీ, తనను మించి స్కూల్‌ని క్రమశిక్షణతో నడిపిన నాథుడు లేడని బాహాటంగా బాధపడ్తాడు.

ఆమె పుట్టిందీ, పెరిగిందీ, చదివిందీ ఆ వూళ్ళోనే. ఆమధ్య విడుదలైన జి. ఓ. ప్రకారం ట్రాన్స్‌ఫర్ అయితే 'లీవ్' పెట్టేదేతప్ప ఊరొదల్లేదు. కాస్త వ్యవసాయం, యింకాస్త గ్రామ పెత్తందారీతనం వదులుకొని, కేవలం టీచర్‌గా బతకడానికి నేనేం బతకలేనోడ్నిగాను అనేదతనివాదం

''విప్పించే గురుడొచ్చిందిప్పుడేనా?'' నవ్వేడు సుబ్రావ్.

''ఏవిటి?'' రామ్మూర్తి.

''స్టూడెంట్స్ స్కాలర్‌షిప్స్‌లో ఫిఫ్టీపర్సంట్ కొట్టేడట హెడ్మాష్టర్'' అన్నాడు చెలం చిన్నగా.

పెద్దగా నవ్వేస్తూ యాదగిరి, ''ఓశ్... దొంగలుబడ్డ ఆర్నెల్లకి సావెతగా – కొట్టేయడం, ఆ డబ్బుతో అల్లుడికో స్కూటర్ కొనేయడం కూడా జరిగింది'' అన్నాడు.

''స్పెషల్ ఫండ్‌లో దొంగ రిసీట్ లెన్నో, 'కాంటిన్‌జెన్సీ'లో కమీషనెంతో నన్నడగండి.'' నాయుడు.

''అడ్మిషన్స్'లో అందుకొన్న 'డొనేషన్స్' ఎన్నివేలో నన్నడగండి.'' సుబ్బారావు.

''అడగరెందుకు మరి?''

''ఆడిట్ వస్తే జవాబు చెప్పేదతను. మధ్య మనకెందుకు?...'' రామ్మూర్తి.

''బెల్ అండ్ బిల్ మనుషులం.'' సుబ్బారావు.

''ఇగో...యీ ఉదాసీనతే దేశాన్ని సర్వనాశనం చేస్తుంది. ప్రజాస్వామ్యంలో ప్రతి పౌరుడూ ఒక ఆడిటరే! అడిగే హక్కు మనకుంది.'' చెలం.

''మనమెందుకోయ్?... స్టూడెంట్ యూనియన్‌ని ఉసిగొలిపితే సరి.'' కామేశం.

పోనివ్వండి... అధికారం ఆయన చేతుల్లోవుంది. 'లెసన్ ప్లాన్స్' దగ్గరో, 'సూపర్విజన్' మిషతోనో, సి. యల్. దగ్గరో– నొక్కేస్తాడు. జీవన్.

''నొక్కేస్తాడేం? యీ బడేవన్న వాడబ్బగాడిద? మనవేం వాన్నా నాడి నౌకర్లవాం?'' చాలా ఆవేశంగా చెలం.

''పోయినేడు నర్సింహం గతేమయింది.''

''చలవాం...మనం ఎంత నిజాయితీతోవున్నా, పై అధికారి, మరో అధికారికే సపోర్టిస్తాడు తప్ప, సబార్డినేట్ నెవడూ లెక్క చెయ్యడు.''

''అసలు నన్నడిగితే... ఈ దేశంలో అన్ని విలువల్నీ ధ్వంసం చేయకముందు, దేశంలోంచి 'పదవి' అన్న పదాన్ని తరిమేయాలి. ఏ చిన్న పదవిలోవున్నా–వెధవ లదోరకం పోజు పెడ్తారు.'' జీవన్.

''హెడ్, అంటే ఏవిటండీ? మిగతా అంగాల్లేనప్పుడు హెడ్ ఎక్కడుంటుంది?'' అన్నాడు రామ్మూర్తి నవ్వేస్తూ.

''మనహెడ్మాష్టర్ యింగ్లీష్ చెప్తుంటే వినాలి... ఆ ఉచ్ఛారణ పాడుగానూ...బట్లరింగ్లీషు నయం.''–సుబ్బారావు.

'వాడికి చెప్పడం వచ్చి ఏడిస్తేగా, ఏ జి. వో. ప్రకారం–ఏ టీచర్ని ఎలా ఏడిపించాలని ఆలోచిస్తాడే తప్ప...'' చెలం.

'యిటువంటి ఆఫ్ నాలెడ్జ్‌డ్ గాళ్ళుండబట్టే మన సిస్టమ్స్ అన్నీ స్పాయిలై పోతున్నాయి. రోగ్... ఎందుకులే బతకనీ అనుకొంటుంటే...''

''ఐదు నిముషాలు లేటొస్తే – లేట్‌మార్క్! వాడు క్రైమింగ్స్ చూట్టానికి పనికొస్తాడుతప్ప, టీచింగ్‌కి పనికిరాడు.''

''యిటువంటి వెధవల్ని వందరూపాయలు ఖర్చుపెట్టి తన్నించినా పాపం లేదు.''

''చూస్తా కలెక్టర్‌తో ఎంక్వయిరీ పెట్టించి, ఆ స్కాలర్‌షిప్స్, కాంటిన్‌జెన్సీ ఫండ్స్ సంగతి పేపర్ కివ్వకుంటే నేను చెలాన్నే కాదు.''

''ఓ తాకిడి తగలాల్సిందే గురూ...''

''నువ్వు నిలబడు. నీ అడుగుల్లో మేముంటాం.''

''వొర్తీ ఫూల్...''

''నంబర్ వన్ రోగ్ ''

''అడిగో,వస్తున్నాడ్రోయ్ ..పేడ మొహంవాడూ...ఆహా... ఏవాం–నడక, మధురవాణితో దెబ్బలు తిని కాలొంకరపోయిన కరకటశాస్త్రుల్లా...''–సుబ్బారావు.

మిగతా వారంతా చూసేరు. సుబ్బారావు జోక్ ఎవరిమీదా పనిచెయ్యలేదు. ఎవరూ నోరిప్పలేదు.

దుర్మార్గంనుంచి, దూరంగా జరిగే బుద్ధిమంతుల్లా ఒక్కొక్కరే. స్టాఫ్ రూంలోంచి వరండాలోకి వచ్చేరు.

హెడ్‌మాస్టర్ని చూస్తూనే శావు, ''సొత్తరవయ్యా...'' అని ప్రక్కగా నిలుచున్నాడు. విద్యార్థులు కొందరు కావాలని ఎదురై నమస్కరించేరు. కొందరు చూసీ, చూడనట్టు నటించేరు. ఓదేలు ఎదురేగి, దండం పెడుతూ బేగ్ అందుకొన్నాడు.

టీచర్స్–అద్దుపడి, గుడ్‌మోనింగ్ చెపుతూ పెదాలపై చిరునవ్వాడించేరు.

రిసీవ్ చేసుకొంటూ బదులు నవ్వు నవ్వేడు హెడ్మాష్టర్.

సంతకం పెట్టేందుకు హెడ్మాష్టర్ని వెన్నంటిన టీచర్స్, సంతకం పెట్టినా ఆ గది వదల్లేదు. హెడ్మాష్టరేదైనా ఆజ్ఞ జారీ చేస్తే తలూపడానికి సిద్ధంగా నిలుచున్నారు.

గాలిలేక పేపర్‌తో విసురుకొనే హెడ్‌మాస్టర్ బాధ చూస్లేనట్టుగా, ''వర్షాకాలమైనా ఎండాకాలాన్ని మరిపిస్తుంది సార్. ఫేన్ వేసేదా?'' అంటూ గోడకున్న స్విచ్‌నొక్కేడు చెలం!

~~~~~~~~
~~~~~~~~

శ్రీ సి. శ్రీనివాసులు

# కారల్ మార్క్స్ - వర్గ పోరాటం

కారల్ మార్క్స్ (1818 – 1883), 19 వ శతాబ్దిలోని ప్రముఖ జ్యోతిష్యవేత్త. ఇక్కడ నేను జ్యోతిష్యవేత్త అనడానికి నా అభిప్రాయ మేమిటంటే. ప్రపంచపు గత చరిత్రను ఆధారంగా చేసుకొని, తార్కిక పద్ధతితో, ఒక పరిపూర్ణమైన భవిష్యత్తును రూపొందించిన మహనీయుడు కారల్ మార్క్స్ మానవ సమాజ పరిణామాన్ని కనిపెట్టి, ముందు కాలంలో రాబోయే పరిణామాన్ని కూడా వూహించి చెప్పడం జరిగింది. అయితే అది వూహకే పరిమితం కాకుండ కొన్నిదేశాలలో కొంతవరకు అమలులో కూడ వచ్చింది. ఆనాటి ఆర్థికవేత్తం సిద్ధాంతాలను కూలంకషంగా పరిశీలించి, పెట్టుబడిదారీవ్యవస్థ అభివృద్ధికి వారు రూపొందించిన సిద్ధాంతాలు, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి విధానము, తనకు తాను ఏ విధంగా అంతం చేసుకొంటుందో వివరించినాడు.

కారల్‌మార్క్స్ 1818 మే, 5న ప్రష్యాదేశంలో జన్మించినాడు. 1841లో బెర్లిన్ విశ్వ విద్యాలయంలో న్యాయశాస్త్రాన్ని, చరిత్ర తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేసాడు. అప్పుడు ప్రభుత్వం అవలంబించుచున్న అభివృద్ధి నిరోధక విధానాలను గమనించి ప్రొఫెసర్‌గా గడువుదామనుకొన్న ఆలోచనకు స్వస్తి చెప్పినాడు 1842లో "రైనిషె సైటుంగ్" అనే పత్రికకు సంపాదకత్వం వహించినాడు. ఆ పత్రిక విప్లవ ప్రజాస్వామ్య ధోరణి నానాటికి పెరుగుతున్నందు వలన, 1843 లో ప్రభుత్వము ఆ పత్రికను నిషేధించినది. మార్క్స్ పారిస్ చేరుకొన్నప్పుడు అక్కడకు వచ్చిన ఫ్రెడరిక్ ఎంగెల్స్‌తో పరిచయం ఏర్పడింది. మళ్ళీ ప్రష్యన్ ప్రభుత్వపు కోరికచేత 1845లో పారిస్ నుండి అతనిని వెళ్ళగొట్టడం జరిగింది. అక్కడ నుండి 'బ్రస్సెల్' వెళ్ళి 1847 లో "కమ్యూనిస్టు లీగ్" అను రహస్య ప్రచార సంఘంలో చేరి, ఆ సంఘ కోరికపై ఫ్రెడరిక్ ఎంగెల్స్‌తో కలసి ప్రఖ్యాతి పొందిన "కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక" అనునది 1848 ఫిబ్రవరిలో రచించినారు. మళ్ళీ అదే సమయంలో బెల్జియం ప్రభుత్వం అతనిని బహిష్కరణ కావించినది. జర్మనీకి వెళ్ళి పత్రిక నొకదానిని స్థాపించి అక్కడ ప్రభుత్వానికి కంటకమై 1849 లో వెళ్ళగొట్టబడినాడు. తరువాత లండన్‌కు వెళ్ళి జీవితాంతం అక్కడే గడిపినాడు. ఇతడు విదేశీ ప్రవాసిగా, ఎంతో నికృష్టమైన జీవితాన్ని గడిపినాడు. దుర్భర దారిద్ర్యము అతనిని జీవితాంతం వెంటాడినది. ఎంగెల్స్ ఆర్థికంగా ఎంతో సహాయపడినాడు. ఇతడు రచించిన అర్థశాస్త్ర విమర్శపై వ్యాసాలు (1859) పెట్టుబడి (మొదటి సంపుటి 1867), ఫ్రాన్సులో అంతర్యుద్ధం (1871) మొదలైనవి. పెట్టుబడి గ్రంథాన్ని పూర్తి చేయలేకుండానే 1883 మార్చి '4' న పరమపదించినారు.

కారల్ మార్క్స్ వివిధ దేశాలను చూడడంవల్ల, ముఖ్యంగా పారిశ్రామిక విప్లవము వచ్చిన తరువాత శ్రామికులకు వచ్చిన కష్టాలను పరిశీలించి, వారి అభివృద్ధి కోసం తన పూర్తి జీవితాన్ని వెచ్చించినాడు. ఇతడు సమకాలిక కష్టజీవులను, ముఖ్యముగా పెట్టుబడిదారీ వ్యవస్థలోని, శ్రామికుల అగచాట్లను అవగాహన చేసుకొని విప్లవాత్మకమైన సిద్ధాంతమును ప్రతిపాదించినాడు. మానవ సమాజాన్ని పీడిస్తున్న దోపిడీ విధానాన్ని, చెడులను, దారిద్ర్యాన్ని తొలగించుకోవడానికి ఇతని సిద్ధాంతము మహాశక్తివంతమైన ఆయుధంగా ఉపయోగపడిందని చెప్పడంలో అతిశయోక్తి లేదు. నిరాశ, నిస్పృహలలో జీవిస్తున్న నికృష్టపు జీవితాలకు వెలుగునిచ్చిన మహాజ్ఞాని. అందుకే షూంపీటర్ అను ఆర్థికశాస్త్రవేత్త తన గ్రంథంలో "మార్క్సిజం అనునది ఒక మతము. ఎవరైనా మార్క్సిజాన్ని వ్యతిరేకించుట తప్పు, పొరపాటే కాదు. అటువంటి వ్యతిరేకత పాపం వంటిదని ఈ మతంలో విశ్వాసమున్న సాంప్రదాయిక మార్క్సిస్టువాది భావిస్తాడని"[1] తెలిపినాడు.

ఈ వ్యాసమునందు మార్క్స్‌యొక్క సంపూర్ణ విశ్లేషణకు పూనుకోవడం లేదు. మార్క్స్‌యొక్క వర్గపోరాట విషయంలో ఏ విధంగా వూహించినాడో వివరించ దలిచినాను.

'పురాతన స్వతంత్ర పౌరుడు, బానిస—రోమన్ కాలపు పాలక వర్గీయుడు, సామాన్యుడు—ఫ్యూడల్ యుగపు భూస్వామ్య ప్రభువు, దాసుడు—మధ్యయుగం నాటి వృత్తి సంఘ సభ్యుడు, వృత్తి సంఘ కార్మికుడు - ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థపు బూర్జువా వర్గం, కార్మిక వర్గాల—మధ్య ఇంతవరకు 'వర్గ పోరాటం' నగనుస్తుందని, దీని పర్యవసానంగా ఒక్కొక్కసారి మొత్తం వ్యవస్థ—సమాజం విప్లవాత్మకమైన పునర్నిర్మాణానికిలోనయ్యేది. ఒక్కొక్కసారి ప్రత్యర్థి వర్గాలు రెండూ నాశనమయ్యేవి."[2] చరిత్రలో ప్రతిచోట, ప్రతిసారి రెండు వర్గాలు తప్పనిసరిగా వుండేవని, ఈరెండు వర్గాలలో ఒకరు దోచుకొనేవారు, మరొకరు దోచుకోబడేవారు, అంతస్తుల తేడాలు, ఆర్థికపరమైన తేడాల వలన ఈ రెండు వర్గాల మధ్య విభేదాలు పెరిగి, ఒకరిని అంతం చేయడానికి మరొకరు ప్రయత్నించేవారని, ఒక్కొక్కసారి ఒక్కొక్క వర్గానికి విజయం చేకూరగా, ఒక్కొక్కసారి రెండు వర్గాలు అంతమయ్యేవని మార్క్స్ వాదన. ఇప్పుడున్న ఆధునిక బూర్జువా వర్గంలో రాను, రాను, అంతస్తుల అంతరాలు విపరీతంగా పెరుగుతున్నాయని, గతంలో జరిగిన వర్గ పోరాటాల

కన్న, ప్రస్తుతపు వర్గ పోరాటంవల్ల సంపూర్ణమైన మార్పు వస్తుందని, అందువలన ఇదే చివరి పోరాటం కాగలదని తెలిపినాడు.

లాభాలు పొందేవారు పెట్టుబడిదారులు. లాభనిర్ణయం, లాభాల పెంపుదల, మూలధనంయొక్క పెరుగుదలపై ఆధారపడి వుంటుంది. మార్క్స్ తన "మూలధనం" అను చారిత్రక గ్రంథంలో లాభాలు పెరుగడానికి శ్రామికశక్తి ఏ విధం ఉపయోగపడుతుందో వివరంగా తెలిపినాడు. 'పెట్టుబడిదారుల ఉత్పత్తి, వస్తువుల ఉత్పత్తి కాదు.' 'మిగులు విలువ' ఉత్పత్తి ముఖ్యమయినది. అదేవిధంగా శ్రామికుడు చేసే ఉత్పత్తి తనకోసం కాదు, మూలధన నిర్మాణంకోసం చేస్తాడు. మరి మూలధన నిర్మాణం ఈ 'మిగులు విలువ'పై ఆధారపడివుంది. అందువలన 'మిగులువిలువ'ను ఉత్పత్తిచేసే శ్రామికుడే నిజమైన ఉత్పాదక శ్రామికుడు.[3] పెట్టుబడిదారుల అభిప్రాయంలో వస్తూత్పత్తి ముఖ్యంకాదు. తన మూలధన నిర్మాణానికి శ్రామికుడు ఎంతవరకు సహాయపడుతున్నా , అంటే, శ్రామికుడు తను తీసుకొంటున్న వేతనానికంటె ఎంత హెచ్చుగా శ్రమిస్తున్నాడో అది ముఖ్యమంటాడు. ఆ హెచ్చు శ్రమనే 'మిగులు విలువ'గా చెబుతాడు ఈ మిగులువిలువ పెరగడానికి సహాయపడే అంశాలను మార్క్స్ 'నిరాపేక్ష మిగులు విలువ' శ్రామికుని పనిగంటలను పెంచడంవల్ల, సాపేక్ష మిగులు సాంకేతిక విప్లవం అంటే హెచ్చు యంత్రశక్తిని ఉపయోగించడం వల్ల ఈ 'మిగులు విలువ' ఉత్పత్తి అవుతుందని[4] తెలిపినాడు. శ్రామికునికిచ్చే వేతనం అసలుకూలికి సమానంగా కాదన్నమాట. తన మూలధన అభివృద్ధికోసం శ్రామికశక్తి దోపిడిచేయడం జరుగుతుంది. పారిశ్రామిక రిజర్వుసేన హెచ్చుగా పెరగడంవల్ల, ఈ దోపిడికి హెచ్చు అవకాశం దొరికింది. మూలధనం శ్రామిక శక్తిని భూతంలాగ పీడించి, అధికలాభాలకోసం సజీవ శ్రామిక శ్రమను పీల్చి పిప్పిచేస్తుందని తెలిపినాడు.

బూర్జువా వర్గపు ఆర్థికవేత్తల వాదాన్ని ఇతడు తీవ్రంగా ఖండించినాడు. ఆనాటివాదంలో వున్న వితండవాదం ఒకటి వుంది. అసలు మూలధన నిర్మాణం లేకుంటే శ్రామికులకు ఉద్యోగమే వుండకపోయేదని, శ్రామికునకు కూలి దొరకవలెనంటే, అంటే, పెట్టుబడి, కార్మికుని వినియోగించుకోకపోతే కార్మికుడు నశిస్తాడు. మరి పెట్టుబడి పెరగవలెనంటే శ్రామికదోపిడి తప్పక జరుగాలనే విధానం అమలులో వుందని, దోపిడి విధానంకూడ కార్మికులకు కావలసిన ఉద్యోగవకాశాలు లభింపజేయడానికేననే వాదాన్ని తీవ్రంగా ఖండించినాడు. దీనివలన కార్మికులకు అధికమైన నష్టం ఏర్పడుతుందని తెలిపినాడు. "ఉత్పాదక పెట్టుబడి పెరిగినకొద్దీ, శ్రమ విభజన, యంత్రాల వినియోగం విస్తరిస్తాయి. శ్రమవిభజన

యంత్రాల వినియోగం విస్తరించేకొలది, కార్మికులమధ్య పోటీ విస్తరిస్తుంది. దానితో వేతనాలు తగ్గుతాయి.''[5] పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధిచెందుతున్నప్పుడు జరిగే పరిణామాలు శ్రామికునకు ఏ విధంగా చేటు చేసాయోవివరించినాడు. ''పెట్టుబడిదారీవ్యవస్థ అభివృద్ధిపథంవైపు పయనిస్తున్నపుడు శ్రామికుల స్థానంలో యంత్రాలు ఏర్పడుతాయి. శ్రామికుల సంఖ్యకంటె అధిక సంఖ్యలో దుర్భర జీవితాన్ని గడుపుతున్న జనాభా హెచ్చుగా వుంటారు. శ్రామికుల కష్టాలకు అనుపాతంగా వీరి బాధలు అధికంగా వుంటాయి... పెట్టుబడివ్యవస్థయొక్క సాధారణసూత్ర మిదేనని''[6] మార్క్స్ వివరించినాడు. ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ శ్రామిక జనాన్ని బాధలకు గురిచెయ్యడమేకాక, ఇతర జనభాను హెచ్చు బాధలకు గురిచేస్తుందని, దానితో శ్రామికులమధ్య పోటీ పెరిగి తక్కువ, అతితక్కువ వేతనాలకు కూలికి వస్తారని, తద్వారాదోపిడి సుళువుగా జరుగుతుందని ఇతని భావన.

శ్రామికులదోపిడి వాళ్ల వేతనాలకంటె హెచ్చు శ్రమను ఉపయోగించుకోవడంతో పూర్తికాదంటాడు. శ్రామికుని దోపిడి, అతడు పనిచేసే పారిశ్రామిక సంస్థలలోనేకాక, ఫ్యాక్టరీ బయటకూడ దోపిడికి గురిఅవుతాడని, దానివలన అతడు మరీ దుర్భరజీవితాల్లోకి నెట్టబడుతాడని తెలిపినాడు ఒకవైపు ఫ్యాక్టరీ యజమానిచే దోపిడిచేయబడి కూలిడబ్బులు చెల్లించిన తరువాత యితర బూర్జువా దోపిడిదార్లు—యింటియజమాని, అంగడివాడు, వడ్డీ వ్యాపారస్థుడు మొదలైనవాళ్లు ముట్టడిచేసి అతనిని పూర్తిగా దోపిడిచేసి నిస్సహాయుణ్ణి చేస్తారనే [7] నగ్నసత్యాన్ని తెలిపినాడు.

ఒక వైపు ఫ్యాక్టరీలోపల, బైటా శ్రామిక దోపిడి జరిగి బీదరికంలో మగ్గిపోతుంటే వచ్చే లాభాలన్ని ఈ బూర్జువా వర్గానికి చెంది, వారి దగ్గిఅ సంపద కేంద్రీకృతం కావడం జరుగుతుంది. ''సంపద ఒకవైపు కేంద్రీకృతమవుతూ వుంటే, మరొక వైపు హానిసత్వము, దుర్భర జీవితము, అజ్ఞానము, మృగప్రాయము, మానసిక సంక్షోభము పెరుగుతుందని''[8] వివరించినాడు. ఇతని అభిప్రాయంలో మానవుని అన్ని సంక్షోభాలకు అంతిమ కారణము బీదరికమేనని, ఆ బీదరికానికి కారణం దోపిడి విధానమేనని ఇతని భావన.

ఒకవైపు నంపద కేంద్రీకృతం కావడం, ఒకవైపు దుర్భర జీవితాన్ని అనుభవిస్తున్న హెచ్చు ప్రజానీకం రెండు వర్గాల మధ్య విభజించబడుతారు. ఎల్లప్పుడు ఈ బూర్జువా వర్గం శాయశక్తులా తమ సంపదను పెంపొందించుకోవాలనే ప్రయత్నిస్తు వుంటారు. అంతేకాక స్వార్థం హెచ్చు అయి, తమలో తాము పోటీపడి ఒక పెట్టుబడిదారుడు ఎంతోమంది పెట్టుబడిదారులను అంతంచేసి[9] తన స్థానాన్ని సుస్థిరం చేసుకొంటాడు. అందువలన చిన్న, చిన్న బూర్జువాలు శ్రామికుల కోవలోకి చేరుతారు. అప్పుడు శ్రామికుల సంఖ్య కూడ పెరుగుతుంది. మరొక వైపు, బూర్జువాల మధ్య పోటీపెరగడం వల్ల పెట్టుబడి పెరుగుతుంది. దానితో పాటు పరిశ్రమలు పెరుగుతాయి. అంటే శ్రామికుల సంఖ్య పెరగడమే కాక, కొన్ని స్థలాలలో వాళ్ళు విశేషంగా కేంద్రీకృతమవుతారు. వాళ్ల బలం పెరుగుతుంది. ''బూర్జువా వర్గం ఏ నిష్పత్తిలో అభివృద్ధి అవుతుందో అంటే పెట్టుబడి ఏ నిష్పత్తిలో అభివృద్ధి అవుతుందో ఆ నిష్పత్తిలోనే అభివృద్ధి అవుతుంది 'ఆధునిక కార్మిక వర్గం'[10] అంటాడు మార్క్స్.

మొదట్లో కార్మికులు అందరూ ఏకంకారు. మొదట కార్మికులు విడివిడిగా పోరాడుతారు. తరువాత ఒక ఫ్యాక్టరీలోని వాళ్లందరు కలసి పోరాడుతారు. ఆ తరువాత ఒకే స్థలంలో కేంద్రీకృతమైన సంస్థలలోని శ్రామికులందరు కలసి పోరాడుతారు. ఈ పోరాటాలు నడుపడానికి బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మిక సంఘాలు, సమ్మేళనాలు ఏర్పడుతాయి. ఐక్యత పెరుగుతుంది. దీని సహాయంతో ఒక ప్రాంతానికి కాకుండ దేశవ్యాప్త పోరాటానికి సమాయత్తమవుతారు. ఇది శ్రామికులకు రాజకీయ రంగంలోకి రావడానికి సహాయపడతుంది. మరొకవైపు అనేక స్వార్థ ప్రయోజనాల కారణాల వల్ల బూర్జువా వర్గం కార్మిక వర్గాన్ని రాజకీయాల్లోకి లాగి, రాజకీయ విద్యను నేర్పించునని తెలిపినాడు అయితే తమ ప్రయోజనాలను కాపాడుకోవడానికి, తమ శ్రమకు తగిన వేతనాన్ని పొందాలనుకునే ఈ కార్మికవర్గం ఉద్యమాన్ని తీవ్రంగా చేయవలసి వుంటుందని, తమ సమస్యా పరిష్కారం కోసం వేళ్లు పాతుకొనియున్న విధానాలను మార్చవలసి వుంటుందని మార్క్స్ అభిప్రాయము ''ఈ కార్మికవర్గ ఉద్యమము అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాల కోసం, అత్యధిక సంఖ్యాకులు బుద్ధిపూర్వకంగా, స్వతంత్రంగా నడిపే ఉద్యమము సమాజంలోని అట్టడుగుపొర ఐన కార్మికవర్గం కదలాలంటే, లేచి నిలబడాలంటే తనమీద వున్న అధికారపు సమాజపు పొరలన్నింటిని మొత్తంగా ఆకాశంలోకి ఎగమీటక తప్పదని''[11] మార్క్స్ అభిప్రాయము.

కార్మికవర్గం కూటమిగా ఏర్పడిన తరువాత అప్పుడప్పుడు చేసే వ్యతిరేక ఉద్యమాల వలన ఒక్కొక్కసారి కార్మికవర్గాల వారికి లాభం కలుగ వచ్చునని చరిత్ర చెప్పుచున్నది. ఇంగ్లాండులో 1802, 1847 చట్టాల ప్రకారం పనిగంటలు తగ్గించడమే దీనికి గల గొప్ప నిదర్శనము. అయితే ఈ లాభం నిత్యం విస్తరించే కార్మిక వర్గ ఐక్యత మీద హెచ్చుగా ఆధారపడి వుంటుంది. ఇంకా సంపూర్ణమైన రాజకీయ ఆధిపత్యం సంపాదించుకోవాలంటాడు. ఇదీ తప్పదని ఇతని విశ్వాసం. ''కార్మికవర్గం ప్రప్రథమంగా రాజకీయ ఆధిపత్యం సంపాదించుకొని తన జాతిలో తాను ప్రధాన వర్గంగా అభివృద్ధి చెంది, జాతి అంటే తానే అనే స్థితికి రాక తప్పదని''[12] తెలిపినాడు. ''కార్మికవర్గం తన రాజకీయ ఆధిపత్యం ఉపయోగించి, బూర్జువా వర్గం నుండి సమస్త పెట్టుబడిని క్రమక్రమంగా గుంజుకొని, ఉత్పత్తి సాధనాలన్నింటిని రాజ్యం చేతుల్లో—అనగా పాలకవర్గంగా సంఘటిత పడిన కార్మికవర్గం చేతుల్లో కేంద్రీకరించి, మొత్తం ఉత్పత్తి శక్తులను సాధ్యమయినంత వేగంగా వృద్ధి చేస్తుందని''[13] వివరించినాడు.

కార్మికులకు విజయం తప్పదని, రాజకీయ ఆధిపత్యం తప్పదని, దీనికి కావలసింది కార్మికులలో ఐక్యతని, దీనికి తమ చారిత్రాత్మక గ్రంథమైన కమ్యూనిస్టుపార్టీ - ప్రణాళికలో ఒక గొప్ప నినాదాన్నిచ్చి, కార్మిక శక్తులను ఉత్సాహ పూరితులను చేసినాడు. ఒక సంస్థకు, ఒక ప్రాంతానికి, ఒక దేశానికి మాత్రమే తన నినాదాన్ని పరిమితం చెయ్యకుండ "సకల దేశ కార్మికులారా ఏకం కండి"[14] అని సకలదేశ కార్మికులను ఉత్సాహపూరితులను చేసిన మహనీయుడు మార్క్స్. ప్రపంచదేశాల కార్మికులందరు ఏకమయితే కార్మికులకు రాజకీయ ఆధిపత్యం తప్పదని అప్పుడు ప్రపంచంలోని దోపిడి విధానానికి, బీదరికానికి, ఆస్తిహక్కుకు, వారసత్వపు హక్కుకు ముఖ్యంగా ఏర్పడే వర్గ సంఘర్షణకు తిలోదకాలు ఇవ్వడం జరుగుతుందని వీరి విశ్వాసం.

అయితే భవిష్యత్తులో కార్మికులు, యజమానుల మధ్య సఖ్యత ఏర్పడుతుందని కార్మికునికి అన్ని సౌకర్యాలు కల్పించబడుతాయని ఈ వర్గ సంఘర్షణ చిరంజీవిగానే వుంటుందని మార్క్స్ వూహించినట్లుగా లేదు. కాని మార్పులుంటాయనిమాత్రం వూహించినట్లు తోచుచున్నది. 1872లో కమ్యూనిస్టుపార్టీ – ప్రణాళిక యొక్క జర్మన్ కూర్పుకు 'ముందుమాటలు' వ్రాస్తూ మార్క్స్ "గత 25 సంవత్సరాలలో పరిస్థితులు ఎంత మారినప్పటికి యీ ప్రణాళికలో చెప్పిన సూత్రాలు, మొత్తంమీద, ఎప్పటిలాగే సరిగానే యున్నాయి సూత్రాల ఆచరణ, ఆనాటి చారిత్రక పరిస్థితుల మీద ఆధారపడుతుంది. అందువల్ల రెండవ ప్రకరణం చివర ప్రతిపాదించబడిన విప్లవ చర్యలకు ప్రత్యేక ప్రాముఖ్యం యివ్వ లేదు. ఆ ఘట్టం ఈనాడు వ్రాయవలసివస్తే, అనేక సందర్భాలలో వేరు, వేరు పదాలు ఉపయోగించవలసి వుంటుందని"[15] తెలిపినాడు.

ఈ 20వ శతాబ్దిలోని శాస్త్రవేత్తలు కూడా మార్క్స్ యొక్క వర్గపోరాటానికి ప్రాముఖ్యమిచ్చినారు. "వర్గపోరాటం అనివార్యం. శ్రామిక సంఘాలు ఆ వర్గపోరాటాన్ని సాగించడంకోసమే నని"[16] – వర్గపోరాటంనుండి విముక్తి పొందడానికి వర్గపోరాట మొక్కటే ఏకైక సాధనమని జి. డి. హెచ్. కోల్ అభిప్రాయము. వర్గపోరాటం తప్పనిసరి అయినప్పటికి, సమానత్వం సమిష్టి ఒప్పందాలద్వారా శ్రామికుల సమస్యల పరిష్కారం సాధ్యమని (webbs) మరికొందఱి వాదన.

ఏది ఏమైనప్పటికి, మార్క్స్ సిద్ధాంతము శ్రామికుల దుర్భర జీవితాలను, తమ కష్టనిష్టూరాలను, తామే తెగింపుతో, ఐక్యతతో నిర్మూలించుకోవాలనే మార్గాన్ని చూపుతూ, ప్రపంచంలోని నేటి కార్మికులకు, ముందుతరాల కార్మికులకు మార్గదర్శకుడై వున్నాడు, వుంటాడు అనేది సత్యం.

# అధోజ్ఞాపికలు

1 J.M. Schumpeter—The Ten Great Economists. Page No : 5

2 కార్ల్‌మార్క్స్–ఫ్రెడరిక్ ఎంగెల్స్ – కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక – ప్రగతి ప్రచురణాలయం, మాస్కో – పుట సంఖ్య 36.

3 Karl Marx-Capital Volume I, Page No : 477. (1977 Reprint)

4 Karl Marx, Capital Vol. No: I, Page No. 477. (1977 Reprint)

5 కార్ల్ మార్క్స్–కూలి, శ్రమ, పెట్టుబడి–పుట సంఖ్య 42. తెలుగు అనువాదం–ప్రగతి ప్రచురణాలయం, మాస్కో.

6 Karl Marx–Capital Vol. No : I, Page No: 607. (1977 Reprint)

7 కార్ల్‌మార్క్స్–ఎఫ్. ఎంగెల్స్. కమ్యూనిస్టుపార్టీ–ప్రణాళిక పుట సంఖ్య : 44.

8 Karl Marx–Capital Vol. No I, Page No: 604.

9 Karl Marx–Capital Vol. No : I, Page No : 714.

10 మార్క్స్ – ఎంగెల్స్–కమ్యూనిస్టుపార్టీ – ప్రణాళిక, పుట సంఖ్య 43.

11 మార్క్స్–ఎంగెల్స్–కమ్యూనిస్టుపార్టీ – ప్రణాళిక, పుట సంఖ్య. 48.

12 మార్క్స్–ఎంగెల్స్–కమ్యూనిస్టు పార్టీ–ప్రణాళిక, పుట. సంఖ్య 58.

13 మార్క్స్–ఎంగెల్స్ – కమ్యూనిస్టుపార్టీ – ప్రణాళిక, పుట సంఖ్య–60.

14 మార్క్స్–ఎంగెల్స్. కమ్యూనిస్టుపార్టీ – ప్రణాళిక, పుట సంఖ్య 75.

15 మార్క్స్ – ఎంగెల్స్ – కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక ,పుట సంఖ్య 8.

16 G. D. H. Cole–The world Labour (1913) Page No. 21.

# పాషాణ నేత్రం

కదిలే అలల్లా
 బావురుమంటూ ఆకలి
నీరింకిన కళ్ళల్లో
ఎండిన ఆకసాన్నిచూసి
కేర్ మంది
పుట్టిన బిడ్డకు గుక్కెడు పాలివ్వాలని
ఉబికిన ఉరోజాలు పీధని పడ్డాయ్.

ఈ పూట కింత కషాయం దక్కింది
అదే చాలంటూ
నరాల నోళ్ళారిస్తూ
జనపథం ఉరకలేసింది
క్షణంలో చుక్క మిగల్లేదు
ఇంకా అంటుక వేలాడే పాలపుంతను
గుప్పున ముట్టించేసింది అగ్గిపుల్ల !
అంబరం కడుపురగిలి
దిక్కుమాలిన బతుకంటూ
చుక్క చుక్కకూ పేగులు పెనలేట్టు
ఉన్న కన్నీళ్ళు సెలయేళ్ళయ్యేట్టు
ప్రాసగుచ్చినట్టు చెప్పింది
'మీ పప్పులుడకవ్' అంటూ
చెప్పవచ్చిన చుక్కల్ని పట్టి
పప్పుగ చప్పరించేసింది
పైశాచికంగా జ్వలిస్తూ
ఉద్ధృత మదనోన్మాద విషపూరిత పాషాణ నేత్రం !

ఇహ వెలుగు ఎక్కడ ?
కిరసనాయిలు పెట్రోలయినట్టు
దావాగ్ని గోళంగా జ్వలిస్తూ ఆకలి !
చీలి చీలి
ఆకసంనిండా నిండి
అలుక్కుపోయిన క్షుద్ర వర్ణచిత్రంలా
చూస్తే చాలు పేగులూడిపడేట్టు
జుగుప్సగా కుళ్ళిన చెరువుమీది తెట్టులా మిగిలింది !
ఆ హీన కాంతిలో శిశువులు శిశువులుగా కళ్ళబడరు
మరి అంతా అణుమయం కదా ... !

# చప్పుడు చెయ్యని కన్నీళ్ళు!

ఎప్పుడూ అడగలేదు వెన్నెల్ని
 యింత సుఖ పెట్టమని !
ఔను ఎప్పుడూ అడగలేదు యీ సూరీడ్ని
యీ వొంట్లో యింత వేడి నింపమని !!
వొట్టు ! ఈ గాలి నెప్పుడూ అడగలేదు
య్యింతంటే య్యింత వూపిరి పొయ్యమని !!!

యుగ యుగాలుగా ఈ జాం చెట్టు
పాపం చిలకని ఏం అడిగింది ?
ఎంత పండించుకున్నా, భూదేవత
ఎప్పుడైనా కన్నెర్రచేసిందా ?
ముసలం అంతా మనలోనే ...
'నేనంటే నేనే ...'
ఇదే దృష్టి
దిక్కుమాలిన బుద్ధి !
ఎన్ని అవతారాలైన ఎత్తుతుంది
యుగ యుగే సంభవామి నటుంది
బతుకును స్వీకరించడం బతుకైతేగాని
ఎవరికుంటుంది బతుకు ?
వెతలకేం తక్కువ ? పల్లేరు పొదల్లా ...
అందుకే నాకుభయం !

ఎప్పుడైనా
వల్లనీ చందమామ జేబు తడువుతుందేమోనని !
ఔను ! సూరీడు కాల రుచ్చుకుంటాడేమో !!
పాపం ! చిలక యిహ బతకదు.
నన్ను సాతిపెట్ట గొయ్యితీస్తే
గద్దిస్తుందేమో భూమి
'లెండి వాడి బతికున్న గుండెకాయ' అంటూ
పాపం ! మీ మొగాలలో లప్పుడు
చప్పుడు చెయ్యని కన్నీళ్ళు !!!

శ్రీ రంధి సోమరాజు

# కలగూరగంప

## ఓ పరమేశ్వరా!
## కావ్యము నందలి పద్య పరిచయము

పీఠికాపుర సంస్థానానికి ఏకైక సాహిత్య ప్రతినిధులై సాహిత్యానికి పరిపుష్టి కలిగించినవారు బ్రహ్మశ్రీ శతావధాని ఓలేటి వెంకట రామశాస్త్రులుగారు. వెంకటరామకృష్ణులుగా జగద్విఖ్యాతి నొందిన వారిలో ప్రథములు. అప్పుడు సాహితీ రంగంలో విరవిహారం చేస్తున్న శ్రీ చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారికి దీటైన ప్రత్యర్థి. వారు పరస్పరం చేసికొన్న వాగ్యుద్ధాలు, పాశుపతాలు, పరాస్త్రపాశుపతాలు మనకి పాత పత్రికలు తిరగేస్తే సాక్షాత్కరిస్తాయి. ఒక ప్రభువును ఆశ్రయించుకొని మొదటి నుండి ఉండిపోవడం వల్లనే వారికి తగినంత గుర్తింపు లభించలేదనే అనిపిస్తుంది.

ఇటీవల బీరువాలో పుస్తకాలు సర్దుతుంటే ఒక మూల "నూట పదియార్లు" కనుపించాయి. సహజంగా వారి కవిత్వంపట్ల నాకు గల మక్కువ వల్లను, మా మాతామహుడైన మహాకవిగారి పద్యాలు ఏదైనా నోటికి రాకపోతే 'సిగ్గుచేటు' గా భావించడంవల్ల 'తొలదొంతర' తొందరగా చదవడం ప్రారంభించాను. మొదలుపెట్టిన కొద్దిసేపటిలో ఒకానొక దివ్యమైన రసానుభూతిలో తాదాత్మ్యము చెందాను. ఎందుకో...వీటికి తగిన ప్రాచుర్యం కలుగలేదనే బాధతో కళ్ళు చెమ్మగిల్లినవి. కొన్ని పద్యాలు పరిచయం చెయ్యాలనే ఆరాటం హెచ్చింది "తొలిదొంతర"లోని "అర్ధనూట పదహార్ల" లోనూ కొన్ని మాత్రం పరిచయం చేస్తాను. సులభగ్రాహ్యమైన ఈ పద్యాలకు విపులమైన విమర్శ అవసరంలేదనే భావంచేత, స్థలాభావంచేత మూలంలోని పద్యాలు యథాతథంగా మీముందుంచుతాను

అప్పటి రోజులలో ఒక వైపు నుండి భావకవితా ప్రవాహం మరొక వైపు నుండి సాంప్రదాయ కవితా యుద్ధం, అవధానముల సంరంభం, ఇటువంటి ప్రభంజనంలో వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొని ముందుకు సాగడం అంటే సామాన్యమైన విషయంకాదు. అటువంటి అంతర్మథనంతో వ్రాసిన పద్యాలు మనకి చాలా చోట్ల కనిపిస్తవి. ఈ కావ్యానికిగల విశ్వజనీనత ఓ పరమేశ్వరా! అనే శీర్షికలోనే కనబడుతుంది. ఆ సంబోధన అన్నిమతాలను బద్దలకొట్టుకు వచ్చిన ఆర్తనాదంలా అనిపిస్తుంది. ఆర్ద్రత – ఆర్తి ప్రతి పద్యంలోనూ కనిపించి కదలించివేస్తుంది. వీరికిగల పాండిత్యం – అనేక శాస్త్రముల పరిచయం. చక్కని కవిత్వం ఈ కావ్యంలో మనకి అంతటా దర్శనమిస్తాయి. సీస పద్యాలు నడపడంలో వీరి ప్రత్యేకత గమనించండి.

1) సుస్వర స్థాన విశుద్ధిగ నాదంబు పుట్టించి దాని కుద్బోధం దెచ్చి
శ్రుతి విలీనంబుగా శోధించి తన్నాద పూరంబులో రుచి పుట్టం జేసి
వ్యంజనంబులను వీడి కరుస నారోహణ క్రమమున నొకకొన్ని కళలు విసరి
యందుండి నేర్పుమై నవరోహణ మొనర్చి యచ్చోట నొక కొన్ని యలలు దేర్చి

రాగరస రక్తినీ మనోరంజకముగ
బాడగల శక్తి నాకు లభ్యంబు గాదు
ఆలకింపుము నీ కిష్టమైన యెడల
నాలకింపక యున్న నే నాలపింతు!

పై పద్యంలో "మనోరంజకముగ బాడగల శక్తి నాకు లభ్యంబు గాదు" అని చెబుతూ వారికిగల సమస్తమైన సంగీత పరిజ్ఞానాన్నీ మన ముందుంచారు. సంగీత సాంప్రదాయాలు—ఆరోహణ—అవరోహణ.. అలా ఉంచి "క్రమమున నొక కొన్నికళలు విసరి" అనేచోట కళలు విసరడంలో గల గొప్పదనాన్ని గ్రహించి – సంగీతంలో సిద్ధహస్తుడుగా మనకి కనిపిస్తారు. పద్యాన్ని ఇంత గంభీరంగా నడిపించి చిట్టచివర "అంతా నీదే పూచీ" అన్నట్లుగా నీ కిష్టమైతే విను లేకపోతే మానెయ్యి కానీ నేను మాత్రం యీ గానం మానను అని ఖచ్చితంగా భగవంతుని ముందర చెప్పగలిగారు.

2) సీ. భక్తి పానకము లోపల నెంత ముంచినం
దడియదేమో కదే కఠిది యెడంద
ప్రకృతి పుస్తకము లోపల నెంత సదివిన
నెఱుంగమోకదే యొడ్డెబుఱ్ఱ
భవ విశ్వంబు లోపల నెంత చూపినం
గానదేమోకదే గాజు కన్ను
ప్రార్థనాలయము లోపల నెంత నిలిపిన
దొరకదేమో కదే దురుసు మనసు

ఏమిసేయుదు? నీవు నన్నే విధమున
భక్తు నొనరించి యెపుడు నీ భజన సేయం
దగిన సాధన సంపత్తిం దగ ఘటించి
యేలుకొందువొ చెపుము! నీ మేలు మఱువ!

ఇది చాలా కఠినమైన మనస్సు, భక్తి పానకములో ఎంత ముంచితే మాత్రం తడుస్తుంది? ఎంత చదివితే మాత్రం ప్రయోజన మేముంది ఇది "యొడ్డె బుఱ్ఱ", ఎంత వెతికి చూస్తే మాత్రం ఏముంది? ఇది "గాజు కన్ను." ప్రార్థనాలయంలో దేహం ఉంటే సరిపోతుందా! మనసు ఏకోన్ముఖమై ఉండాలకదా. ఈ "దురుసు మనసు"కి ఏకాగ్రత ఎక్కడ నుండి వస్తుంది? ఇటువంటి నన్ను ఏం చేస్తావు? నీ భజన చేయాలంటే నాకే విధమైన సాధన సంపత్తి లేదు. నా కన్నిటినీ కలిగించు - నీ మేలు మాత్రం మరచిపోను.

ఈ పద్యంలో ఆయన తనకు వేసుకున్న ప్రతి విశేషణము విలక్షణంగా కనిపిస్తాయి ఇటువంటి పలుకుబడులు మనకి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి కవిత్వంలోనూ తత్ర తత్ర కనిపిస్తాయి. శ్రీ శాస్త్రిగారి ప్రభావానికి శ్రీ మధునా పంతుల వారు కూడ లోనుకాక తప్పలేదు. వారికి గురు స్థానము లోనివారు కదా! కడిది యెడద–యెడ్డెబుద్ధి–గాజుకన్ను – దురుసు మనసు. ఒకో దానికి ఒకో ప్రత్యేకమైన పద ప్రదర్శనము.

ఈ అంకితం పద్యాన్ని చూడండి ...

సీ. పోషించు చుంటివే ప్రొద్దు నీవే కదా
యాకటికింత మృష్టాన్న మొసఁగి ?
పాడించుచుంటివీ పాట లీవే కదా
యొకచోట నన్నుఁ గూర్చుండఁ బెట్టి ?
యిచ్చుచుంటివి మనోభీష్ట మీవే కదా
సరియైన కార్యావసరముఁ దెలిసి ?
మనుచు చుంటివి ప్రేమ మొనర నీవె కదా
యాత్మీయ వర్గంబునందుఁ జేర్చి ?

అట్టి వాఁడవు నీవకా కన్యుఁడెవఁడు
నాక నా కృతికిని మంచినాథుఁ డింక ?
నా మహారాజునకు నీకె నాదు సుకృతి
నంకితముఁ జేసికొందు నీ వవధరింపు.

ఆయన ఈ కావ్యాన్ని పరమేశ్వరార్పణం చెయ్యదలచి ఉండవచ్చు కానీ...ఆయన ఒక సంస్థానానికి ఆస్థాన కవి. ప్రభుభక్తి పరాయణుడు, అటు ప్రభువును పరమేశ్వరుడుగా భావించలేదు, వర్తమానంలో తనని సర్వ విధాలా పోషిస్తున్న 'రాజు'ను కాదనలేదు. ఈ రెండింటికి చక్కని అన్వయం చేస్తూ పద్యాన్ని నడిపించి అటు పరమేశ్వరుని వద్ద మోక్షమూ – ప్రభువువద్ద ''వెయ్యినూట పద హారులు'' బహుమానమూ సంపాదించి, ఇహ – పరాలు రెండూ చూసికొన్న లౌక్యుడైన కవిగా మనకి కనిపిస్తారు. పరమేశ్వరుని ''మహారాజు'' అని సంబోధించడంల్లోనూ, ''అవధరింపుము'' అన్న చోట ప్రాచీన కావ్యాల్లో రాజుల దగ్గర కావ్య పఠనాదులు చేసేటప్పుడు రాజా! అవధరింపుము! అనే సాంప్రదాయాన్ని ఇక్కడ వాడడంలో వారి చమత్కారం మనకి గోచరిస్తుంది.

*శ్రీ మధునాపంతుల సత్యనారాయణమూర్తి*

# నవ్య కవిత్వము - మాత్రా గణాలు

1979 ఆగస్టు 'భారతి'లో డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు వ్రాసిన కన్నడ 'భూమిగీత' – తెలుగు 'వసుధైక గీతం' అన్న వ్యాసం నాకు చాలా ఆసక్తిని రేకెత్తించింది. అందులో డా॥ రావుగారు పై రెండు కవితలనుగూర్చి తులనాత్మక పరిశీలన చక్కగా చేశారనే చెప్పాలి. కాని చివర కన్నడ కవి అడిగగారి గీతం వచన గీతమేఅయినా అందులో ఖండగతి నియతంగా పాటింపబడుతున్నట్లు కనబడుతుంది అన్నారు. ఇది చాలా విచిత్రంగా ఉంది. వచన గీతాల్లో పాదాలుంటాయిగాని ఆ పాదాల్లో ఏ ఒక్క ప్రత్యేక లయా నియతంగా ఉండదు. అంతర్లయ మాత్రం ఉంటుంది. కాన ఖండ గతిలో నడిచే 'భూమిగీత' వచన గీతమెలా కాగలదో గ్రాహ్యం కాదు. అడిగగారు ఖండ గతిలో నడిచే గీతానికి అంతర్లయల మూలంగా వచన గేయ గుణాన్ని ప్రసాదించారని మనం అర్థం చేసుకోవాలేమో తెలియదు. లేకుంటే డా. రావుగారి వాక్యానికి స్వవచన వ్యాఘాతం ఏర్పడుతుంది.

డా॥ రావుగారు అడిగగారి శైలి స్వేచ్ఛా శైలి అయినా ఛందస్సు మాత్రం గణాల గాడిలో ఇరుక్కుపోతుందనీ, అడిగగారికి శైలిని గురించి పట్టుదల లేకపోయినా ఛందస్సును గురించి అల వాటు మాత్రం పోలేదనీ అన్నారు. ఇందులో ఏం లోపం ఉందో నా కర్థం కాలేదు. మన తెలుగులో నవ్య కవితకూ, వచన కవితకూ శ్రీకారం చుట్టినవాడు శ్రీ శ్రీ. అతని 'మహా ప్రస్థానం' లో మాత్రా గణాలతో నడచిన గేయాలూ, వచన గేయాలూ కూడా ఉన్నాయి. 'కవితా, ఓ కవితా' అన్నది శ్రీ శ్రీ గారు వ్రాసిన గేయాల్లో చాలా ప్రశంసల నందుకున్నది. అది వచన గేయమే. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే మనకు దాని అనేక పాదాల్లో మాత్రా గణాలు కనిపించకపోవు. అంతమాత్రంచేత ఆ గేయానికేం లోటు ఏర్పడుతుందో డా॥ రావుగారే మనకు చెప్పాలి. ఛందస్సుల సర్వ పరిష్వంగం వదలి మాటలు తన ఎదలో అడుగిడినవని అందులో వారే చెప్పారు. శ్రీశ్రీగారి ప్రకారం అక్కడ ఛందస్సులంటే మాత్రాఛ్ఛందస్సులు కావు; సంప్రదాయిక ఛ్ఛందస్సులయిన ఉత్పల చంపక శార్దూల మత్తేభ సీస కందేత్యాదులు. ఈ సత్యం ఆయన 'మహా ప్రస్థానం' కావ్యం చదివిన వాళ్ళందరికీ బాగా అవగాహన కాగలదు. కాన మాత్రా గణాలతో నడిచే గేయం వచన గేయాని కెలా తీసిపోతుందో బోధపడదు.

డా॥ రావుగారు కన్నడ సాహిత్యాన్ని గురించి, వారివ్యాసంలో ఒక నిగమనాన్ని ప్రవచించారు. అది 'తెలుగులో లాగ సంప్రదాయిక ఛ్ఛందో వాహిక లేకపోవడం వల్లనే నేటి కన్నడ కవులు మాత్రా గణాలను పట్టుకుని ఊగులాడుతున్నారు' అన్నది. ఈ నిగమనం వింతల్లో వింత. తెలుగు కన్నడాలు సోదర భాషలు. రెండిటిలోనూ ప్రాచీన సాహిత్యం ప్రారంభమైంది చంపూ కావ్య రూపంలోనే. కానీ తరువాత తరువాత వాటి కావ్యాల మార్గాలు వేరైపోయినాయి. కన్నడంలో జైన కవులు చంపూకావ్యాలు వ్రాశారు. వారి తరువాత వచ్చిన శైవ వైష్ణవ కవులు చంపూ పద్ధతిని చేపట్టలేదు మాత్రా గణాలతో నడిచే షట్పదులను సృష్టించి ఆ వృత్తాలలో కావ్యాలు వ్రాశారు. షట్పదీ కావ్యాలు ప్రచారంలోకి వచ్చిన తరువాత చంపూ పద్ధతిని పునరుద్ధరించడానికి ఏ కవీ పూనుకోలేదు. ఎందుకంటే షట్పదీ కావ్యాలు చంపూ కావ్యాల కన్న సులభమైన భాషలో ఉండి, జనప్రియములై ఉండినాయి. వీర శైవ మత స్థాపకుడైన బసవేశ్వరుడూ, అతని అనుయాయులు కొందరూ 'వచనములు' అనబడే వచన గేయాలను కొన్ని వందల ఏళ్ళ క్రింద

టనే వందలకొద్దీ వ్రాశారు. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఆధునికు లయిన కన్నడిగులు మాత్రాగణాలతో మహనీయములైన కవితలనూ, కావ్యాలనూ వ్రాశారు. క్రొత్త యుగానికీ, క్రొత్త ఇతివృత్తాలకూ అనుకూలించే క్రొత్త ఛందస్సులను సృష్టించుకుని, క్రొత్త సంప్ర దాయాలను నెలకొల్పారు. మాత్రాచ్ఛందస్సుల్లో, ముఖ్యంగా ఖండ గతి, వాళ్ళ భాషలో ''స్పీచ్ రిథిమ్స్'' కు చాలా దగ్గరగా ఉందని గ్రహించి, దానిని ఆధునిక కన్నడ కవులు వాళ్ళ జాతీయచ్ఛందంగా మలుచుకున్నారు. సానెట్లను సృష్టించి కొందరు పెద్ద కవుల వందలాది సానెట్లను వ్రాశారు. మార్లో, షేక్స్పియర్ల లాగా బ్లాంక్ వర్స్‌లో నాటకాలను వ్రాశారు. డా॥ కె. వి. పుట్టప్పగారి 'రామాయణ దర్శనం' మిల్టన్ కవి 'పేరడయిస్ లాస్ట్'లాగా బ్లాంక్ వర్స్‌లోనే వ్రాయబడ్డది. ఆ బ్లాంక్ వర్స్‌నే ఆయన 'మహాచ్ఛం దస్సు' అన్నాడు, మహాకావ్య రచనకు అనుకూలమైనది కాబట్టి. నాటకాలకూ సానెట్లకూ, మహాకావ్యాలకూ ఆధునిక కన్నడంలో ఉపయోగింపబడుతున్నఛందస్సు మాత్రాచ్ఛందస్సయిన ఖండగతియే కానీ మరింకేదీ కాదు. ఇంగ్లీషుభాషకు 'అయాంబిక్ పెంటామీటర్' ఏలాగుగా నాటకాలకూ, సానెట్టుకూ, మహాకావ్యాలకూ వాహిక అయిందో, ఆలాగుగానే ఆధునిక కన్నడానికి ఖండగతి వాహికగా తయారైంది. మన తెలుగు కవులకు చంపూ పద్ధతీ, ద్విపదపద్ధతీ తప్ప మూడవ కావ్య పద్ధతి తెలియదు. 'ముత్యాలసరాల'తో మొద లయిన మాత్రాచ్ఛందస్సుల కవిత శ్రీశ్రీ గారి 'మహాప్రస్థానం' ప్రచురించబడిన పిమ్మట బాగా ప్రచారంలోకి వచ్చింది. మాత్రా చ్ఛందస్సులలోని మంత్రశక్తిని ఎఱింగిని శ్రీ శ్రీ వచన గేయా ల్లోనూ పలుచోట్ల వాటినివాడి అద్భుతములైన ఎఫెక్ట్స్ తెచ్చాడు. తిలక్ 'వసుధైక గీతం'లో కూడా జాగ్రత్తగా గమనిస్తే ఖండగతి అంతర్లీనంగా కనిపించకపోదు. క్రింద పొందుపరచిన తిలక్ 'వసు ధైక గీతం' వచన గేయపాదాలను ఇంచుకంత సవరిస్తే ఖండగతితో నడిచే గేయంగా తయారవుతుంది.

భూమధ్య రేఖ నా గుండెలోంచి పోతోంది
భ్రుకుటి లోపల నక్షత్ర గోళం తిరుగుతోంది
ఈవేళ నన్నానవాలు పట్టలేవు నువ్వు
సూర్యుణ్ణి చూడు నాతలలోన పువ్వు

సవరించిన తరువాత

త ర ర త
భూమధ్య రేఖనా గుండెలో పోతోంది
నగ త ఆ సల
భ్రుకుటిలో నక్షత్ర గోళంతి రుగుతోంది
త త త త
ఈవేళ నన్నాన వాల్‌పట్ట లేవ్ నువ్వు
త ర సల త
సూర్యుణ్ణి చూడునా తలలోన ఓపువ్వు

కన్నడానికే కాదు, తెలుగుకు కూడా ఖండగతి స్పీచ్ రిథిమ్స్‌కు చాలాసన్నిహితమైంది. అందుచేతనే ద్విపదలూ, జానపద గేయాలూ ఇంచుమించు ఖండగతికిదగ్గరి నడకను కలిగిన ఇంద్రగణాలతోనే ఉంటాయి. కన్నడంలో ఖండగతి అంతగా ఆధునికయుగంలో ప్రచా రంలో ఉన్నది కనుకనే అడిగగారి కవిత లెక్కువగా ప్రజల భాషకు దగ్గరిదైన ఖండగతిలో నడిచాయి. కాని డా॥ రావుగారన్నట్లు కన్నడ భాషకు వేరే ఛందోవాహిక లేనందువల్ల కాదు. ఆధునిక కన్నడ కవు లలో అగ్రగణ్యులైన డా॥ కె. వి. పుట్టప్పగారు 'కింకిణి' అన్న వచన కవితా సంపుటాన్నే ప్రచురించారు. డా॥ బేంద్రేగారు కూడా వచన కవితలను వింత వింతగా నడిపారు. మరికొందరు కన్నడ కవులు బసవేశ్వర వచనముల లాంటి వచన గేయాలను వందలు వందలు వ్రాశారు; వ్రాస్తున్నారు. కాన కన్నడకవులకు వచన కవితాప్రక్రియ తెలియదనుకొనడం అపోహ. ఆప్రక్రియలో ఎవరూ కవితలల్లకుండా మాత్రాగణాలనే పట్టుకుని ఊగుల డుతున్నారని ప్రవచించడం ప్రాచీ నార్వాచీన కన్నడ కవితా స్వరూపాన్ని గూర్చి సమగ్ర సదవగాహన లేకపోవడమే.

డా॥ రావుగారు చిట్టచివరగా 'తెలుగు కవితా కన్య ఉంచు కుంటే ప్రాచీనచ్ఛందస్సుల పట్టుచీరల సమగ్ర ఆచ్ఛాదన వుంచు కుంటుంది. లేకపోతే పూర్తిగా మాత్రాగణాల అంగవస్త్రాన్ని కూడా పరిత్యజించి, దిగంబరంగా దర్శన మిస్తుంది' అన్నారు. ఈ వాక్యాన్ని చదివితే—ఉంటే ఉగాది, లేకుంటే శివరాత్రి-అనే సామెత గుర్తుకు వస్తుంది. కవితాకన్య దిగంబరంగా దర్శనమిస్తే చూసి ముచ్చట పడాలని డా॥ రావుగారి లాంటివారు ఉవ్విళ్ళూరుతారేమో కానీ మామూలు మనుషులకు మాత్రం ఉన్నంతలో కవితాకన్య ముచ్చటగా ముస్తాబై దర్శనమిస్తేనే—అందం, చందం. ఆమె దిగంబరంగా దర్శనమిస్తే పిచ్చెత్తిందేమో అనుకుని విశాఖపట్టణం పంపిస్తారు!

శ్రీ శంకరగంటి రంగాచార్యులు

## పులిచెర్లవారికి పునరాహ్వానం

శ్రీ పులిచెర్లవారు (భారతి ఆగస్టు) ''పాతమాట''లయిన ''చెవిటికి శంఖాదినట్లు'', ''బూడిదలో పోసిన పన్నీరు'' వంటి వర్జనీయాలైన సామెతలను పలుపుకుంటూ దణ్ణం (''నమస్తే'') పెట్టి తప్పించుకొనిపోతే సరిపోదు.

ఏప్పైన ఒక రచయితప్పై విపరీతమైన అభిమానం ఉండడం నేరమేమీ కాదుకదా! విశ్వనాథమీద వారికి లేదా? అటులనే వుండ వలె కూడా. తిండివిషయంలోనూ, కవిత్వ విషయంలోనూ, అన్నింటి మీద కొంతమట్టుకు అభిమానమున్ననూ, కొన్నింటిమీద ప్రత్యేకాభి మానమూ. ఒకదానిప్పైన విపరీతాభిమానమూ వుండడంలో ఆశ్చర్యం పడనవసరంలేదు. కాళిదాసుకు ''ఉపమ''ప్పై అభిమానమున్నట్లు (''ఉపమాకాళిదాసస్య''), ఒకనికి పెసరట్టుప్పై ప్రీతి వుండ వచ్చును. ఇట్టి సందర్భాల్లో మనము నవ్వుకుని తాలిమి చూపవలెనే కాని విరుచుక పడితే ఎలా! ఉదాహరణకు: రాబర్ట్ బర్న్స్

(స్కాట్లాండు), పాటియర్ (ఫ్రాన్సు), పుష్కిన్ (రష్యా), హీన్ (జర్మను), నెరూడా (ఛిలీ), విట్మన్ (అమెరికా), భారతి (తమిళం), నజ్రుల్ (బెంగాల్) వంటి కవులకు చెల్లే అపురూపమైన ''ప్రజాకవి'' అనే పెట్టక వచ్చిన బిరుదును, ప్రజలమధ్య నివసిస్తూ కవిత్వం చెప్పేవాడనే అర్థంలో శ్రీ చిలుమాపిళ్ల సుబ్బ దాసుగారికి పులిచెర్లవారు ఇస్తే నేనేమైనా ఆక్షేపించినానా? అది పులిచెర్లవారి విపరీతాభిమానమై ఉంటుంది అనుకొన్నాను.

సత్యహరిశ్చంద్ర నాటకం ఇప్పటికీ అనేకచోట్ల అసంఖ్యాక ప్రదర్శన లందుతుందనే చిన్న విషయం నాకు తెలియకపోవడం తమకు ఆశ్చర్యం గొల్పలేదంటారు పులిచెర్లవారు. నేను చెప్పింది బలిజేపల్లివారి సత్యహరిశ్చంద్ర గురించి. అది అన్నిచోట్ల అన్ని సార్లు ప్రదర్శనలందుతూ ఉండడం నాకు పెద్ద విషయమే. ఆ వూరి మిద్దెలు ఆకాశానంటుచున్నాయి వంటివాక్యం వంటిదే శ్రీ పులిచెర్లవారి క్లెయిం. ఆ నాటకం ఏ కంపెనీలు ఎచ్చటెచ్చట వేస్తున్నారో శ్రీ పులిచెర్లవారు చెప్పతారా? వారు ఏ ప్రదర్శన ఎచ్చట ఎప్పుడు చూచిరో వ్రాయగోరుతాను.

''గురజాడకు అర్థమయిన భారతీయ సంస్కృతి'' అని నాకు తోచినంత వ్రాసినాను. విశ్వనాథను భారతీయ సంస్కృతికి ఏకైక ప్రతినిధిగా శ్రీ పులిచెర్లవారు పరిగణిస్తే ''విశ్వనాథకు అర్థమయిన భారతీయ సంస్కృతి'' అను వ్యాసం వ్రాయవచ్చు కదా! నా జూలై వ్యాసం చివరన శ్రీ పులిచెర్లవారికి 'సెల విస్తారా'' అనే ప్రశ్నవేసినాను. ఎప్పుడూ నకారాత్మక విమర్శేనా? సకారాత్మక విమర్శ వ్రాయండి. విశ్వనాథవారి ఖర్మకొద్దీ, చాలా మంది ఆయనను పొడిమాటల్లో పొగడడమేకాని, ప్రాతిపదికయైన సమగ్ర విమర్శ వ్రాసినవారు లేరు. నన్నయకు, తిక్కన్నకూ లేని గొప్ప శిష్యగణం చెళ్లపిళ్లవారికి కలదని విశ్వనాథవారు వ్రాసినారు. గురువుకు మంచి శిష్యుడు దొరకడం ఎట్లదృష్టమో, ఒక కవికి తగు విమర్శకుడు దొరకడం, ఆ కవికీ, సాహిత్య పిపాసువులకూ మహా భాగ్యమే అని నిస్సంశయంగా చెప్పవచ్చును. షేక్సుపియరుకు బ్రాడ్లీ, ఇబ్సెనుకు బెర్నార్డుషా, జాన్‌డన్‌కు టి. యస్. ఇలియట్, టర్నర్ అనే చిత్రకారునకు రస్కిన్‌వంటి కళాకార హృదయావగాహి విమర్శకులుండడం మన అదృష్టమే. విశ్వనాథవారికట్టి విమర్శకుడు కావలయును. అది చారిత్రకావసరం.

ఇంతకీ శ్రీ పులిచెర్లవారి తిరోగమనతత్వం నాకు నిస్పృహే కలిగించింది. విశ్వనాథపై అంత అభిమానం వుంటే వ్రాయండి. నామీద అలిగితే ఎట్లా? విషయమూ, పెద్దది. ఆరుకోట్ల ఆంధ్రు లున్నారు. ''భారతి''వారు వ్యయప్రయాసలకోర్చి మన భావాలకు ప్రచారం కల్పిస్తున్నారు. రాష్ట్రాంతరాల్లో, ఖండాంతరాల్లోని తెలుగు సాహిత్యాభిమానులు ''భారతి'' చదువుతున్నారు. వీరికోసమైనా వైశ్వనాథీయ భారతీయ సంస్కృతీ పన్నీటిని అందరిమీద చల్లండి.

పన్నీరంటే జ్ఞాపకం వచ్చింది. ''ఇక బూడిదలో పన్నీరు పొయ్యలేను'' అంటూ శ్రీ పులిచెర్లవారు ఎక్సిట్. ఇచట బూడిద తక్కువనీ, పన్నీరెక్కువనీ సంకేతం. నేను ఒక కవిని సమర్థిస్తూ వ్రాసేది బూడిదనీ, వారొక కవిని గర్హిస్తూ వ్రాసేది పన్నీరనీ అభ్యాహార్యం. ఇటువంటి తొందర వ్రాతల పర్యవసానాన్ని భావించినారా? యతులు, యోగులు, శివుడు బూడిద పూసికొంటారు. నట విట ధూర్తులు పన్నీరు చల్లుకొంటారు. బూడిద పూసికొంటే హానికర సూక్ష్మక్రిములు చస్తాయి చర్మం ఆరోగ్యవంతం అవుతుంది. పన్నీటిని పూసుకొంటే కొంచెం సేపటికి కంపుకొడుతుంది. బూడిద వేస్తే పంటలు బాగా పండుతాయి. అందుకే ఐశ్వర్యంకు బూడిద పేరే పర్యాయపదంగా పెట్టినారు. పంచత్వం చెందిన ఆత్మీయుల చితాభస్మాన్ని పవిత్రంగా భద్రపరచుకొంటాము. పవిత్రనదుల్లో, క్షేత్రాలలో కలుపుతాము. వారి సెంటుబుడ్లు (ఏమైనావుంటే) కుప్పతొట్టిలో పారవేస్తాము. నా వ్రాతను అట్టి బూడిదతో పోల్చి నందుకు శ్రీ పులిచెర్లవారికి కృతజ్ఞత తెల్పుకొనుచున్నాను. సామెతల్ని జాగ్రత్తగ వాడకుంటే ఈలాగే బెడిసి కొట్టుతాయిసుమా! పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా అనే సామెతనే తీసికోండి పన్నీరుకంటె బురద లొచ్చని ఆంతర్యం. అది నిజమా? బురద సారవంతమైన భూమి. కొన్ని పంటలు (వరి) బురదలోనే పండేది. పద్మాన్ని పంకజం అన్నారు. పన్నీరజం అనలేదు. గాంధీజీ ప్రకృతి చికిత్సలో బురదనే వాడేవాడు. పన్నీరును వాడినట్లు దాఖలాలేదు. తర్కానికి మారుగా అలంకారాల్ని ప్రయోగిస్తే శ్రీ పులిచెర్లవారికి కలిగిన చిక్కులులాంటి చిక్కులే సంభవిస్తాయి. మన తెలుగు విమర్శకులు విషయ విమర్శచేయ శక్తిలేక వ్యక్తి విమర్శ చేస్తుండడం చూస్తున్నాను. నేను ''టెంపర్'' కోల్పోక అనంతంగా వాదించగలను. విమర్శలో దాక్షిణ్యంలేనివాణ్ణి. నా''కన్యాశుల్కనాటకకళ''లో గురజాడనే వివిధ దృక్కోణాలద్వార విమర్శించినాను. అయితే ఆ విమర్శకు ఆయన రచనలు నిలువగల్గుతున్నాయి. ఎర్రగా కాల్చి, దాయపైపెట్టి సుత్తిపెట్లు పెట్టినప్పుడు కమ్మచ్చులా సాగేదే కదా అపరంజి! అట్టి రచన గురజాడది. నా పోరాటం అంతా విషయావిష్కారంకోసమే. స్పర్ధయా వర్ధతే విద్యా అనే ప్రాచీన భారతీయ సంస్కృతీ ప్రవచనాన్ని స్పర్ధలెందును విద్యలందే అని గురజాడ అన్నాడు. కేవలం దానినమసరించే విద్యార్థిని నేను. అధ్యాపకులైన శ్రీ పులిచెర్లవారు పెద్దమనస్సు చేయవలెను. గురజాడను ఎందుకు తీసివేస్తున్నారో నా కర్థం కావడంలేదు. విశ్వనాథ గొప్ప రచయిత కావడానికి గురజాడ తక్కువ రచయిత కావలెనా ఏమి? ఎవరు ఏమన్నా గురజాడ అగ్రగామి. టాగూరుకంటె ముందుగా జాతీయగీతం వ్రాసినాడే! ''ముత్యాలసరాలు'' తెచ్చినాడే! సహజమైన జీవద్భాష వ్రాసినాడే! దక్షిణాంధ్ర యక్షగానాల్లోనూ, వేదంవారి ప్రతాపరుద్రీయంలోనూ ఉండేది రంగస్థలీయ పాత్రోచితభాష మాత్రమే. ఇది ప్రాచీన సంస్కృత నాటకాల్లోనూ ఉంది. గురజాడ బాట మూడవేటు. సంభాషణలు అనితర సాధ్యంగా వ్రాసినాడు. తిక్కన నూరనల తర్వాత గురజాడవలె సంభాషణ వ్రాసినవారు లేరు. తరువాత విశ్వనాథ కవిరాజు, చింతా దీక్షితులు జీవంగల

౦భాషణలు వ్రాసినారు. ప్రతీ సాహిత్య ప్రక్రియకు ఆధునికతను తెచ్చిన గురజాడను ఏటూ పోటూ మాటలంటే సహించేదిలేదు. శ్రీ పులిచెర్లవారికినుట్టుకు గురజాడపై వేయదలచిన అభాండాలై పోయినాయికదా, ఇక 'విశ్వనాథకు అర్థమైన భారతీయసంస్కృతి'' అనే చర్చ వ్రాయండి. చూస్తాను. విశ్వనాథ వారిని కొంతవరకూ పైకెత్తి పిదప ఆయనను, ఆయన వ్రాసిన రామాయణంలోనే వస్తాడే–త్రిశంకుడు–ఆయన ''మానోపలి''గా ఉండే లోకంలో వదిలితే ఎట్లా? విశ్వనాథ సంస్కృతి గురించి శ్రీ పులిచెర్లవారు వ్రాయవలెనని వారిని మరలా ఆహ్వానిస్తున్నాను.

**శ్రీ సర్దేశాయి తిరుమలరావు**

# శా లి వా హ న శ క ము
# విమర్శ - పరామర్శ

'భారతి', 1979 జూలై సంచికలో ప్రకటితమైన 'శాలివాహన శకము'' అను నా వ్యాసము మీద, 'భారతి' 1979 అక్టోబరు సంచికలోని కలగూరగంపయందు ప్రచురితమైన డా. ఘంటా జవహరులాలు గారి విమర్శ కేవలము పరామర్శ యోగ్యము. ఆ విమర్శలోని అంశము లివి :

1 ''1964వ సంవత్సరములోనే డా॥ బి. యస్. యల్. హనుమంతరావుగారు ఒక ఆంగ్లవ్యాసమును ప్రకటించియున్నారు అది డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారు చూచినట్లు తెల్పలేదు ... సరిగ్గా వారు ప్రతిపాదించిన ప్రతిపాదనలే డా॥ శ్రీరామమూర్తిగారి వ్యాసములో గూడా చోటు చేసుకొన్నవి. డా. బి. యస్. యల్. హనుమంతరావుగారి వ్యాసముపై నా విమర్శ 1965వ సంవత్సరములోనే ప్రచురితమైనది. ఇదియు డా శ్రీరామమూర్తిగారు జూ (?) చినట్లు బోధపడదు॰''

పయి రెండు వ్యాసములును నేను చూడలేదు. అవి రెండు మాత్రమే కాదు; అనేక వ్యాసములు నేను చూడనివి ఉండవచ్చును. అవియెల్ల చూడవలసిన ఆవశ్యకము కలుగవలయును గదా! నేను చూడని డా. బి. యస్. యల్. హనుమంతరావుగారి ప్రతిపాదనలే నా వ్యాసములోకూడ చోటు చేసికొన్నచో, హనుమంతరావుగారి ఆలోచనా సరణి, నా ఆలోచనా సరణి ఒక విధముగా సాగినదని మాత్రమే అర్థము. హనుమంతరావుగారు చరిత్రాధ్యాపకులు. నేను సాహిత్యాధ్యాపకుడను. సాహిత్యాధ్యాపకులు చరిత్ర వ్రాయుట సాహసమే. అది బాధాకరమా? శాతవాహనుల చరిత్ర నేను వ్రాయుటకు కారణము కలదు. తెలుగువారైన చరిత్రకారులు రచించిన శాతవాహనుల చరిత్రను, తెలుగువారుకాని చరిత్రకారులు చాలమంది అంగీకరించలేదు అంగీకరించక పోవుటకు హేతువు అప్రామాణికతయే. కనుకనే తెలుగువారైన చరిత్రకారుల ఆంగ్ల వ్యాసములైనను అంతగా నేను చూడలేదు. చూచిన గ్రంథములెల్ల, వ్యాసములెల్ల ఎక్కడికక్కడ మూదరించితిని. అది గమనింపకుండ, హనుమంతరావుగారి ప్రతిపాదనములను నేను అపహరించినట్లు డా జవహరులాలుగారు అపోహపడుట దురదృష్టము. చరిత్రాధ్యాపకులైన హనుమంతరావుగారి ప్రతిపాదనలు సాహిత్యాధ్యాపకుడనైన నా ప్రతిపాదనలు సంవదించుట నా అదృష్టము.

2 ''డా శ్రీరామమూర్తిగారు చెప్పుకొన్నట్లు వారి వ్యాసములో వ్యక్తబ(?)రచిన? విషయాలు వారి సొంతంగాదు.'

నా వ్యాసములో ఎక్కడను అందలి ఏ అంశమును నా సొంతమని నేను చెప్పుకొనలేదు. అయినను ''చెప్పుకొన్నట్లు'' అని డా. జవహరులాలుగారు అనుటలోని ఆంతర్యము దురవగాహము. అంతేకాదు. హనుమంతరావుగారి వ్యాసము 1964వ సంవత్సరమున ప్రకటితము. నా వ్యాసము 1968వ సంవత్సరము నందలి చరిత్ర మీద ఆధారపడినది. అది నా ''సొంతము''కాక, 1964లోని హనుమంతరావుగారి ''సొంతము'' అగునా? అట్లు హనుమంతరావుగారు అంగీకరింతురేమో తెలియకపోయిన డా. జవహరులాలుగారు హనుమంతరావుగారిని అడిగి తెలిసికొనుట ఆరోగ్యకరము. ఇట్లు నా వ్యాసమును అన్యథాకరించుటలోని డా. జవహరులాలుగారి ఆంతర్యము కూడ అవశ్య గమనార్హమైన విశేషము.

3 ''కుషాణ చక్రవర్తుల చరిత్రపై వెలువడిన పరిశోధనా గ్రంథములను డా. శ్రీరామమూర్తిగారు చూచినట్లులేదు''

నావ్యాసములోని సూచికలందు **India Under Kushanas The Early Kushanas**అను రెండు గ్రంథములు నేను చూచినవి కలవు. అవి ''కుషాణ చక్రవర్తుల చరిత్రపై వెలువడిన పరిశోధనా గ్రంథములు'' కావా? ఆ గ్రంథములకు ముందు వెలువడిన కుషాణుల చరిత్రకు సంబంధించిన విషయములెల్ల అందులేవా? ఎందుకీ అకాండ తాండవము? – ఆ నాటకు వచ్చిన, 1968వ సంవత్సరమున కుషాణ చక్రవర్తుల చరిత్రపై వెలువడిన పరిశోధనా వ్యాసమును డా. జవహరులాలుగారు చూచినట్లు లేదు.

4 ''వెల్లడైన చరిత్రాంశములనుబట్టి కనిష్క చక్రవర్తికి ముందు ఇద్దరు కుషాణ రాజులు గిలరు ... కాని ముగ్గురు మాత్రం గాదు. డా. శ్రీరామమూర్తిగారి చరిత్ర సృష్టి చాలా చింతవ్యము.''

ఇందు ప్రథమతః ''చింతవ్యము'' అను పద ప్రయోగము డా. జవహరులాలుగారి శబ్ద జ్ఞానమునకు పరమనిదర్శనము. విష్ణుకుండులు సుశబ్దము, విష్ణుకుండినులు అపశబ్దము అని తెలియని వారు చరిత్రకారులైన ఈ కాలమున ''చింతవ్యము'' అను చరిత్రకారుల సద్ప్రయోగము అచ్చు తప్పనుటకు అవకాశము లేదు. తదుపరి, కనిష్కునికి పూర్వము కుషాణ రాజులు ఇద్దరు కలరనుట ''ఇతః పూర్వ సమన్వయము'', ముగ్గురు కలరనుట ''అద్యతన సమన్వయము'' అని నా వ్యాసమున ఇదమిత్థముగ కలదు. (పుట 62) ఇది డా. శ్రీరామమూర్తిగారి చరిత్ర సృష్టి కాదు రష్యన్

చరిత్రకారుడు ఎం. ఇ. మస్సన్, బ్రిటిష్ చరిత్రకారుడు మేక్డొవాల్ గార్ల చరిత్ర సృష్టి. అది నా వ్యాసమునందు ఆవశ్యకమైనంత వఱకు ఉట్టంకితము. ఉదాహరణపూర్వకముగ సూచితము. తన్మూలమైన ఆంగ్లవ్యాసమును డా. జవహరులాలుగారు అభ్యసింతురు గాక.

5 "వారు శకముల (Eras) పుట్టుపూర్వోత్తరములపై వెలువడిన గ్రంథాలు చూచినట్లు లేదు. ఒకవేళ చూచినా అవగాహన చేసికొన్నట్లు గానరాదు."

నేను చూచిన గ్రంథాలు చాలావఱకు సూచికలందు తెలిపితిని. నేను అవగాహన చేసికొన్నట్లు వ్రాసితిని. సాధకబాధకములను చర్చించి, సమన్వయమును సిద్ధాంతము చేసితిని. అది సమంజసము కాదేని అనంగీకర్తవ్యము. అవి చూడలేదు ఇవి చూడలేదు అను ఆక్రోశమేల? నా సమన్వయము సరియైన అవగాహనము లేనిది అగునుగాక. మఱి, తమకు సరియైన అవగాహనము కలదన్న ఆత్మప్రత్యయము కల డా. జవహరులాలుగారి విమర్శనములోని సమన్వయము ఎంత సదవగాహన సంభరితమో అవశ్యగమనార్హము.

ఆ విషయ మిది :

6 "భారతావనిని ఏలిన శకులచే ఎడతెగకుండా యీ శకనామం వాడబడి శకశకమై చివరకు యాదవుల రాజ్యకాలంలో శాలివాహనశకముగా మారినట్లు శాసనములు చెప్పుచున్నవి."

ఇది స్థూలముగ, డా. జవహరులాలుగారి సొంత అభిప్రాయముకాదు. చరిత్ర గ్రంథములందు చర్వితచర్వణము. పిష్టపేషణము. ఇక సూక్ష్మముగ, శకుల శాసనములందు శకసంఖ్య కలదుగాని శకనామము లేదు. లేనిది శకశకమైనదట! అసలు శకశబ్దమునకు అర్థము చెప్పినను డా. జవహరులాలుగారికి అవగాహన కాలేదు. ఊహామాత్ర శరణ్యమైన శకశకము శాలివాహన శకముగ మారినట్లు శాసనములు చెప్పుటలేదు. శకకాలము శాలివాహన శకముగ మారినట్లు పాత చరిత్ర గ్రంథములు పాట పాడుచున్నవి. అయినను "శాసనములు చెప్పుచున్నవి" అని డా. జవహరులాలుగారు అనుట బూకరింపు. శకనామము కల శకుల శాసనమునుగాని, శకశకమని కల శాసనమును గాని, శకశకము శాలివాహన శకముగా మారినట్లు చెప్పు శాసనమును గాని డా. జవహరులాలుగారు ప్రకటించిన స్వాగతము, సుస్వాగతము. "ఈ విధంగ చరిత్ర రచన సాగిస్తే చరిత్రకు, 'పుక్కిటి పురాణాల'కుగల వ్యత్యాసం శూన్యం" గక "మాన్యం" అగునేమో సరియైన చరిత్రకారులు సమాలోచింతురు గాక.

7 "డా. శ్రీరామమూర్తిగారు పేర్కొన్న 'మాఢరీపుత్ర శివస్వాతి' శాతవాహన రాజులలో అనామకుడు."

మాఠరీపుత్ర శివస్వాతి శాతవాహన రాజులలో అనామకుడు అనుటకు హేతువు అతడు నిజముగ అనామకుడు అగుటా? అతని గుఱించి మనకు తెలియకపోవుటా?—ఇది డా. జవహరులాలుగారు గ్రహింతురుగాక.

"అష్టావింశతి వర్షాణి శకసేనో భవిష్యతి
యమాహుర్మాఢరీపుత్రం శివస్వాతిం మహాజనాః"

మహాజనులు శకసేనుని మాఢరీపుత్ర శివస్వాతి అందురను భవిష్యోత్తర పురాణములోని శ్లోకము పూత్కారయోగ్యమా? శకసేన సంజ్ఞ అర్థరహితమా?—అయిన, శాతవాహనులు ఆంధ్రులనుటకు తెలుగువారైన చరిత్రకారులు పురాణములను పట్టుకొని పురణింతురేమి ?

8 "శాసనపరంగ యీతని ఉనికి యింకనూ స్థిరపడలేదు. అతనికి శకకర్తృత్వము ఆపాదించుట సాహసమే. పైగా వారు కీ. శే. డా. రామారావుగారి పుస్తకం అనుసరించినట్లు గోచరిస్తుంది...దానిపై యాధారపడి ప్రతిపాదనలు చేయరాదు."

నా "శాలివాహనశకము" అను వ్యాసము పూర్వాపరములు కలది. ఆ వ్యాసమునకు పూర్వము మూడు వ్యాసములు భారతిలోనే ప్రకటితమైనవి. అపరమున ఒక వ్యాసము భారతియందే ప్రకటితమైనది. మఱొక వ్యాసము భారతికి పంపితిని. ఇంకను మూడు నాలుగు వ్యాసములు పంపవలసినవి కలవు. శాతవాహనుల శాసనములు అను అయిదవ వ్యాసమునందు మాఠరీపుత్ర శివస్వాతి శకసేనుని శాసనముల గుఱించి కలదు. శాతవాహనుల నాణెములు—I అను ఆరవ వ్యాసమునందు మాఠరీపుత్ర శివస్వాతి శకసేనుని నాణెముల గుఱించి కలదు. అది కేవలము డా. రామారావుగారి పుస్తకమును అనుసరించినదికాదు. ఏయే పుస్తకములను అనుసరించినదియు ఆ వ్యాసము చదివిన స్వయంవేద్యము కాగలదు. ఆ యీ పూర్వాపరములు గమనింపకుండ డా. జవహరులాలుగారు నా సమన్వయము లను విడ్డూరములనుట దొడ్డ విడ్డూరము. సాహసమనుట మహాసాహసము.

9 "నా దృష్టిలో చెప్పాలంటే శకశకము, శాలివాహన శకముగ మారుటకు కేవలం "to Indianise the Saka-era" మాత్రమే. ఇది కేవలం నా వూహ మాత్రమే. దీనికి యే చరిత్రాధారములేదు."

ఇది డా. జవహరులాలుగారి ప్రతివాదమునకు నిగ్రహస్థానము. ఆధారము లేని ఊహ చరిత్ర అయి; సప్రమాణ నిరూపణాత్మకము, సంభావ్య సమన్వయాత్మకము అయిన సిద్ధాంతము పుక్కిటి పురాణము అగును కాంబోలు!

"—Thus the migration of the Iranian Sakas in India took place at the close of the first century B. C. The Vikrama era had already been in vogue in India before this date, and we have instances of its use in the kharosthi records. The Taxila plate was evidently issued for popular information, and thus it can naturally be infered that the popular Vikrama era has been used in it."

అను సుధాకరచట్టోపాధ్యాయగారి విక్రమశక సమన్వయము (The Sakas in India–P. 30) పుక్కిటి పురాణమైన, మదుపజ్ఞమైన శాలివాహనశక సమన్వయమును పుక్కిటి పురాణమగును. ఏది చరిత్ర అయిన ఇది చరిత్ర అగును. అసలు చరిత్ర అన్నది మన దేశమున ఆధునిక ప్రక్రియ. స్థిరసిద్ధాంతముకాదు. చరసిద్ధాంతము. ఆధారములు తక్కువ. ఆలోచనలు ఎక్కువ. కనుక అభిప్రాయభేదములు అపరిహార్యము కాని, శబ్దార్థములు తెలియకుండ, సమాస సౌష్ఠవము ఎఱుగకుండ, సంస్కృత ప్రాకృతములు చదువకుండ చరిత్ర రచించుట చింతయితవ్యము. అన్యథాకరించుట అక్షంతవ్యము. స్వమత పతన ప్రమాదము కాంబోలు, డా. జవహరులాలు గారిని పరమత నిరసనమునకు పాల్పడజేసినది. అయినను సాహిత్యాధ్యాపకుని చారిత్రిక వ్యాసమును పట్టించుకొన్నందుకు, మఱల పలికించినందుకు వారికి అభినందనము.

*డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి*

# మల్లికార్జున పండితుడు - బ్రాహ్మ్యంబుతో పొత్తు

శివలెంక మంచన పండితుడును, మల్లికార్జున పండితుడును బసవేశ్వరుని సమకాలికులు. మంచెన పండితుడు కల్యాణమునకు **బోయి**, బసవని భక్తిప్రభావము వలన ప్రభావితుండై అతని సాన్నిధ్యమునందు కొంతకాలముండెను. అప్పుడు అతడు అనుభవ మంటపమునందలి శివానుభవ గోష్ఠులలో పాలుగొని తన అనుభావ వచనములను వచించెననుటకు అతని (కన్నడ) వచనములే సాక్షి.

మల్లికార్జున పండితుడును, బసవని దాసోహ భక్తి, అనుభావ ప్రకాశము, అనుభావ మంటపము నందలి శివానుభవ గోష్ఠుల వివరములను విని, బసవని సందర్శించు కోర్కెతో కల్యాణమునకు ప్రయాణమయ్యెను కాని, వారిరువురి సమాగమమునకు విధి అనుకూలముగా లేకుండెనన్నట్లు, అతడు కల్యాణమునకు చేరక మునుపే కల్యాణమునందు చెలరేగిన రక్తపాతమునకు, తన అసమ్మతిని తెలుపు నుద్దేశములో, బసవేశ్వరుడు కల్యాణమును విడిచి కూడల సంగమ క్షేత్రమునకు బోయి, అందు లింగైక్యమయ్యెను. అందుచే మల్లికార్జున పండితునకు, బసవని సందర్శించు భాగ్యము గాని, కల్యాణమునందలి అనుభావ సంపదను పొందు అవకాశముగాని కలుగకపోయెను. మల్లికార్జున పండితుని పాండితీ ప్రతిభను, శివైక్యతను బోధించుటయందు అతడు పరసమయులతో జేయుచుండిన వాదోపవాదముల సరణిని విని, బసవేశ్వరుడు అతనికి ప్రసాధ భస్మమును పంపినట్లును, మల్లికార్జున పండితుడు ఆ భస్మమును అత్యంత భక్తితో తన నుదుట ధరించుకొనినట్లును, ఆ భస్మ ప్రభావమువలన అతడు కన్నడ భాషయందు ఉత్తమ గ్రంథములను రచింపగలిగినట్లును అతని చరిత్రమువలన తెలియుచున్నది. ఇట్లు జరిగినందుననే మల్లికార్జున పండితునకు బసవని సందర్శించుకోర్కె గలుగుటయు, అతడు కల్యాణమునకు ప్రయాణమగుటయు సహజము!

ఇట్టి దృఢభక్తుడును, శివాద్వైతియును అగు మల్లికార్జున పండితుడు ''భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు, బాయలేను నేను బసవలింగా,'' అని అన్నట్లు వాడుకయందుండుట కడు విచిత్రము! ఈ మాటలనే పురస్కరించుకొని కా**బో**లు శివశ్రీ నిడదవోలు వెంకటరావుగారు, శివతత్త్వసారమునకు, వారు వ్రాసిన పీఠిక (పే. 85) యందును, తర్వాత వెలువడిన 'శివజ్యోతి' యందలి తమ వ్యాసము (పే. 28) నందును ఈ విషయమును వ్రాసియున్నారు. కాని ఆ రెండు సందర్భములలో వారు వ్రాసిన తీరులు, ఒకటితో నొకటి సరిపోకపోవుటయేగాక, భిన్నముగా నున్నవి.

బసవేశ్వరుండే మల్లికార్జున పండితుని జందెమును తీసి, జాతిని విడిచి తనతో కలువుమని కోరినట్లు, అందుకు పండితుడు పై మాటలను పలికి నిరాకరించినట్లు, శివతత్త్వ సారమునందలి 'పీఠిక'యందు వ్రాసి యున్నారు. కాని బసవని వద్దనుండి వచ్చిన పోరండ్ల సూరసానమ్మ, చెలిదేవు వేమనారాధ్యులు, పండితుడు—బసవడు (ఇరువురును) శివభక్తి ప్రబోధమును చేయుచున్నారు; కావున, వారిరువురును కలిసి ఆ ప్రబోధమును చేసిన శైవమత మధికముగా వ్యాప్తిచెందునని (వారు) మల్లికార్జునపండితునకు సలహా ఇచ్చినట్లు, అందుకు పండితుడు పై మాటలను పలికి తన అసమ్మతిని తెలిపినటులు 'శివజ్యోతి' యందలి వ్యాసము (పే. 28) నందు వ్రాసి యున్నారు. పండితారాధ్యుడు ఆ మాటలను ఏ సందర్భములో పలికినను, అసలు ఆ మాటలు అతనివేనా? అను విషయము పండితుని ప్రబోధనలను కుణ్ణముగా పరిశీలించినచో తెల్లమగును.

'బ్రాహ్మ్యంబుతో పొత్తు'నకు వైదిక మార్గమునందు కర్మల నాచరించుట, పంచసూతకముల నొప్పుకొనుట, వర్ణాశ్రమ ధర్మముల నంగీకరించుట, హింసాత్మకమగు యజ్ఞయాగాది కామ్యకర్మల నాచరించుట మొదలగు ఆచరణలను గలిగియుండవలయుననునది నిర్వివాదాంశము. ఈ దిశయందు పండితుని బోధనలే మనునది తెలుసుకొనిన, ఆ మాటలు పండితునివి కావనియు, బ్రాహ్మ్యంబుపై వలపు గలవారెవరో, వ్రాసి పండితునకు తగిలించియుందురనియు గోచరించును. శివతత్త్వ సారమునందలి పద్యములవలననే, 'బ్రాహ్మ్యంబుతో పొత్తు'నకు అవసరమగు పై ఆచారములను పండితుడు ఖండించినట్లు తెలియుచున్నది.

శ్రీ గురుడు దీక్షాసమయమునందు హస్తమస్తక సంయోగముచే, భక్తుని భౌతిక (మాయా) శరీరమును మంత్ర శరీరముగా నొనర్చి, భక్తుని హృదయ స్థలమందలి శివకళను బహిర్గతపరిచి ఇష్టలింగరూపమున ధారణ యొనరించుటవలన, భక్తుని దేహము లింగదేహమగును. అందుచే అతని పూర్వకులము నశించగా అతడు శివకులజుండగును. కనుక లింగధారులయందు (పూర్వకులము ననుసరించి) ఉచ్చనీచ తారతమ్యము చేయరాదనుట; వారందరును సమానులనుట, వీరశైవ మతతత్త్వము. దీనినే పండితుడు ''గురు

కృత శివదీక్ష మెయిన్! విరహిత మలదేహులగు పవిత్రులుభక్తుల్'' (228) అనియు, ''శివభక్తుల గని జాత్యా! ది విచారముల—విడు వలయు దృఢభక్తి మెయిన్'' (121) అనియును వచించి యున్నారు. అంతేగాక ''జంగాలుండైన భూతి — శాసనధరుండై! యుండిన బూజ్యుండె'' (119) అనియు, ''నీ నిజభక్తుం డంత్యజు! డైన బవిత్రుండు పూజ కర్హుడు జగతిన్'' (131) అనియు వచించి మానవ సమాజమునందుగల అంటరానితనమును తొలగించినాడు. అంతేగాక,''శ్వపచుండైనను శివభక్తి పరుండగునేని నతఁడద్విజ వర్యుండా! శ్వపచునకుంగడు శివభక్తి పరాఙ్ముఖుండైన యట్టి—ద్విజుడు మహేశా'' (194) అనుచు మాలవాడు శివ భక్తుండైన అతడు బ్రాహ్మణునికన్నను అధికుండను. బసవని వచ నమును సమర్థించినాడు

శివభక్తుడు ఏ దేశంబున, నే పురంబున నివసించునో, ''దేశంబుననాపురి! నా దెస వసియించియుండు హరతీర్థంబుల్'' (207) అనుచు ''శివభక్తులు యుండెడిచోట విముక్తక్షేత్ర మంద్రు దాధిక ప్రతిన్'' (201) అనుచు తీర్థక్షేత్రములకన్నను శివభక్తుని నివాసమే పవిత్ర స్థానమని మల్లికార్జున పండితుడు తెలిపినాడు.

అంతేగాక శివభక్తుడు మరణించిన, దుఃఖించుటకు బదులు, అతడు శివసాయుజ్యము (లింగైక్యము) నొందెనని బండుగ సేయవలయుననియు, వారికి పరలోక విధులను జేయవలదనియు; అట్టివారి సంతతి వారలకు జాత్యాశౌచము, మృతాశౌచములు మొద లగు సూతకములు నుండవనియు కూడ తెలిపియున్నారు. వారిక దహన సంస్కారము జేయక ఖనన సంస్కారము (సమాధి) చేయ వలయునని కూడ అతడు తెలిపియున్నాడు.

ఈ ప్రకారముగా పండితుడు, జాతి విశిష్టమగు వర్ణ కల్ప నను ఖండించుటయే గాక, ఆశ్రమ వ్యవస్థను కూడ ధిక్కరించి, సన్యాసాశ్రమమును వదలి జనులకు శివభక్తిని, శివ ధర్మమును బోధించుచు, జనులకును జగత్తునకును ఉపయోగపడు నుద్దేశ ముతో గృహస్థాశ్రమమును స్వీకరించి సంసార శివయోగి యయ్యెను.

ఇంతటితో విడువక, పండితుడు వైదిక కర్మలగు—జప, తప, హోమ, అర్చన, దానముల కన్నను భక్తియే పరమేశ్వరుని కృపకు ముఖ్యమనియు, ముక్తికి మూలమనియు (489) వచించియున్నాడు.

పండితుడు బాల్య దశయందుండినపుడే భూతి రుద్రాక్షలను ధరించుట, వైదిక కర్మల నిరసించుట, శుద్ధ భక్తిని బోధించుటను చూచి, అతనిజన్మస్థానమగు, ద్రాక్షారామము నందలి బ్రాహ్మణులు అతనిని వెక్కిరించుటయు, కులము నుండి వెలివేయుటయు జరిగి నందున అతడు విసుగుజెంది, ఆ చోటును విడిచి, శ్రీశైల మల్లి కార్జున క్షేత్రమునకు వచ్చి, అచ్చట తన నిశ్చలభక్తితో శివు నారా ధించి అఖండ పాండిత్యమును, ఆత్మబలమును పొందెను. అప్పటి నుండి అతడు ఉత్పత్తి స్థితి లయములకు శివుడొక్కండే కారకుం డని, దించుచు పరసమయుల నోడించుచు నుండెనని అతనిచరిత్ర వలన తెలియుచున్నది.

ఇటులే పండితుని బోధనలను, అతని జీవితము నందలి ముఖ్య ఘటనలను చూచినచో అతడు 'బ్రాహ్మ్యంబుతో పొత్తు'ను ఆశించలేదనియు, అది అతని జీవనధ్యేయము కాదనియు తెలియును. కనుక ''భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు బాయలేను నేను బసవలింగా'' అను మాటలు అతనివి గావని ధ్రువమగుటయేగాక, ఏ పుస్తకములో లేని మాటలను అతని మాటలనుట భ్రమయేయగును.

''బసవలింగా'' అను మకుటముగల పద్యములు శివకవి పాల కుర్కి సోమనాథుడు రచించిన 'చతుర్వేద సారము' నందు గలవు. కాని పై చరణములు గల పద్యము ఆ పుస్తకమునందు గానరాదు. అదిగాక సోమనాథుడు వీరశైవ చౌషష్టి శీలము నిర్దేశించి, ఆచ రించిన శీలసార్వభౌముడు. సోమనాథుడు ఆనాటి జనులను 'భవులు, భక్తులు' అని విభజించి, భక్తుల చరిత్రలనే కీర్తించెను. వైదిక కర్మల నాచరించు బ్రాహ్మణులను త్రాటిమాలలని సంబోధించెను. అట్టిచో ''బ్రాహ్మ్యంబులో పొత్తుబాయలే''నను, పండితారాధ్యుని 'గణ సాహస్ర మాలిక' యందు చేర్చి స్తుతించ కుండుటయే గాక, అతని చరిత్రను కూడ వ్రాయుటకు బూనుకొన కుండె ననిన సత్య దూరము గాదు.

బసవేశ్వరుడును, వర్ణ భేదము, వర్గభేదము, వృత్తి భేదము లను పాటించక, అంత్యజుడు మొదలుకొని విప్రుని వరకు అందరును నొక్కటేయని, అందరికిని అనుభవ మంటపమున సమాన ప్రతి పత్తిని కలిగించిన సాహసుడు. అతనికి మల్లికార్జున పండితు నే కుల మును విడిచి తనలో కలువుమని అనునంతటి ఆసక్తి ఎందులకు కలిగినదో? కాని రూపుమను 'ఆ కులము, ఈ కులము' అను వ్యాకులములకు లోనైన వారు గారనునది సుస్పష్టము.

బసవని భక్తి ప్రభావము వలనను, అతని బహుముఖ సంస్కా రణముల వలనను, జనులు ప్రభావితులై, తమంతటతామే గుంపులు గుంపులుగా వచ్చి కల్యాణమునందు అనుభావజ్ఞాన సంపన్నులయ్యారే గాని, అతడు ఎవ్వరిని గాని అట్లు వచ్చి కలువుమని కోరలేదనుట సత్యసమ్మతము.

మల్లికార్జున పండితుడు, బసవని జీవితకాలమునందే కల్యాణ మునకు బోయి, అనుభావ మంటపము నందలి శివానుభవ గోష్ఠుల విని శివశరణుల వచనము లందలి అనుభావ సంపదను పొందియుండి నచో; అతని బోధనలు వచన సాహిత్యమునందు గౌరవ స్థానమును పొందుచుండెననిన అసమంజసము గాదు.

*శ్రీ రేకళిగెమఠము వీరయ్య*

# లేఖలు

## అప్పారావుగారిని గురించి

గురజాడ అప్పారావుగారిని గురించి శ్రీయుతులు తిరుమల రావు, సాంబశివరావుగారలు రేపి వదిలిన వివాదంలో దిగక తప్పటం లేదు. ఈ విలేఖరి అభిప్రాయాలకీ 'భారతి'లో చోటు ఉంటుందన్న ఆశతో అతను ఈ ఉత్తరం రాస్తున్నాడు!

అసలు వివాదం ఏమిటి? "అప్పారావుగారు అసభ్యంగా ఏమయినా రాశారా లేదా?" ఇదే కదా? ఉపవివాదాలు ఎన్నో వచ్చాయి కాని అవి అంత ముఖ్యమయినవి కావు.

ఈ విలేఖరి సంస్కృతం చదువుకునే రోజులలో కాళిదాసు శ్లోకాలలోని మాటలకి కొన్నిటికి అప్పటి టీచరు అర్థం చెప్పేవారు కారు. "సూరి వ్యాఖ్య ఉందికదా మీరే చదువుకోండి" అని తప్పించుకునేవారు. తెలుగు పద్యాలని గురించి ఇటువంటి సంఘటనలు ఎందరు ఎన్నయినా చెప్పవచ్చు కదా!

అప్పారావుగారి పుస్తకాలలో "ఇలాంటి"(?) మాటలువస్తే మాత్రం "బూతు" అవుతాయని ఎవరయినా అంటే వారికి ఆయన మీద అభిమానం తక్కువ అని అనుకొనవలసి వస్తుంది. పెద్ద రచయితలకి కొన్ని నిబంధనలు వర్తించవన్న వాదం ఈనాటిదికాదు.

"గురజాడ అప్పారావుగారు ఎంత గొప్ప రచయిత?" అన్న ప్రశ్నకి ఎన్నో రకాల సమాధానాలు ఉంటాయి. కమ్యూనిస్టులు కొందరు ఆయనకి ఊరికే డబ్బా వాయించకుండా ఉంటే (పాపం) అప్పారావుగారిని తక్కువ చెయ్యటానికి ఇందరు ముందుకు వచ్చేవాళ్లు కాదని ఈ లేఖకుడి నమ్మకం. ఈ లేఖకుడికి అప్పారావుగారంటే తక్కువ అభిప్రాయం లేనేలేదు. అయితే ఆయనని నన్నయ, తిక్కన, ఎర్రాప్రగడ, పోతన, సోమనాథుడు, శ్రీనాథుడు, శ్రీకృష్ణదేవరాయలు వంటివారి సమానుడుగా (ఈ విలేఖరి) ఎప్పుడూ పరిగణించలేదు.

ఇంగ్లీషు పోలికలు తీసుకువస్తే "విడంబనం" ఆరోపణలు వస్తాయి; అయినా అవి లేకుండా మాట్లాడటం కష్టం. [ఒక భారతీయ రచయిత ఒక ఇంగ్లీషు లేదా గ్రీకు రచయితతో సమానమయినవాడు అంటే ఈ విలేఖరికి పరమ చిరాకు. ఆ విదేశీవాడే "మన" వాడితో సమానమయినవాడు అని ఎందుకు అనకూడదు?] వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు, భవభూతి, నన్నయగార్లలాంటి వాళ్లు మళ్లీ పుట్టలేదు, పుట్టరు. అలాగే షేక్స్పియర్, మార్లో, హోమర్, దాంటె లాంటి వాళ్లూను. నవలల విషయం తీసుకుంటే ఇంగ్లీషులో ఫీల్డింగ్, స్మాలెట్, డికెన్స్‌తో సమానులన్న తగినవారు ఇప్పుడు లేరని అనిపిస్తుంది. (పి. జి. ఉడ్ హవుస్‌ని మాత్రం కొంచెం ఎక్కువగానే విలువ కడుతున్నాడు ఈ విలేఖరి). గురజాడ అప్పారావుగారు నవలలు రాసి ఉండవలసినవారు; నవల లాంటి నాటకం ఒకటి రాసేశారు. బహుశ, ఆయన కాలంలో చదివే నాటకాలనే రాయాలన్న "సిద్ధాంతం" కొంచెం బలంగా ఉండేదేమో! "కన్యాశుల్కా"న్ని "నాటకం—నవల"గా చూస్తే దానికి ఉన్నతమయిన స్థానం ఉండి తీరుతుంది. ఉన్నత స్థానం ఇచ్చిన 'కన్యాశుల్కం" ఎక్కువగా సర్కారు జిల్లా బ్రాహ్మణులకి (అందులోనూ రెండు శాఖలకి) సంబంధించిన 'సెటయిర్" అని మర్చిపోకూడదు.

జవహర్‌లాల్ నెహ్రూ తమ ఆత్మకథలో "నా వెనుక వంద తరాల బ్రాహ్మణులు ఉన్నారని నేను మరిచిపోలేను" అన్నారు. అలాగే అప్పారావుగారు ఎంత వెక్కిరించినప్పటికీ ఆయనకి (తమకే తెలియకుండానే నేమో) లుబ్ధావధానులు, అగ్నిహోత్రావధానులు అంటే సానుభూతి ఉన్నట్లు తోస్తుంది.

అప్పారావుగారు అసలే పాత నడకలని వదిలేసి "పద్యాలు" రాశారా? నిజానికి "పుత్తడి బొమ్మ పూర్ణమ్మ" విని ఈ విలేఖరి ఒకసారి ఎంతో కదిలిపోయాడు. కాని కన్యాశుల్కం ఇచ్చి ఆడ పిల్లలని కొనుక్కుంటే పూర్ణమ్మకి కష్టం బాధ రావటం గమనించ తగిన విషయం కాదూ?

వీరేశలింగం పంతులుగారు, భాండార్కర్ గారు, చందావర్కర్ గారు, రాజారామమోహనరాయిగారు సంఘ సంస్కర్తలే కాని వాళ్లు "ఎంతో లోతుకి వెళ్లే సంస్కర్తలు" వారు. అలాగ వెళ్లే సంస్కర్తలు ఎవరంటే గాంధీగారు, మహాత్మా ఫూలేల పేరులు వెంటనే జ్ఞాపకం వస్తాయి. గురజాడ అప్పారావుగారు "ఆంగ్ల మానస పుత్రుల తెగ"కి చెందిన మధ్య తరగతి సంస్కర్తలలో ఒకరు. ఆయనని తిక్కన గారితో పోల్చటంలో అర్థమే లేదు — ఒక ఆధునిక కవి చేసినట్లు.

ఇంకొక్కమాట కూడా చెప్పక తప్పటం లేదు విశ్వనాథ సత్యనారాయణగారు ఆధునికులలో అగ్రగణ్యులనటంలో సందేహమే లేదు. ఆయన కవీ, నవలా రచయితా కూడా. అప్పారావుగారిని గురించి ఆలోచించినప్పుడు సత్యనారాయణగారు నిజంగా ఎంత గొప్ప నవలలు రాశాడో అని గుర్తు చేసుకోవటంలో తప్పులేదు! (ఈ ఉత్తరం రాసిన వాడికి ఆయన పద్యాలు అంతగా తలకి ఎక్కవు — గుండెనీ తాకవు — కాని ఆయన నవలలు అద్భుతమయినవని అనిపిస్తాయి.)

సర్దేశాయి తిరుమలరావుగారు ఎన్నో విదేశీ రచనల ప్రసక్తి తీసుకువచ్చారు. చాలామంచి పని చేశారు! ఆయన దృష్టి ఎంత విశాలమయినదో మరొకసారి తెలిసింది ఈ చదువరికి.

సూరి

## విజ్ఞానము ఎంతపెరిగినా కుక్కతోక వంకర వంకరే!

కుక్కతోకకు రోలు కట్టినా రోకలి కట్టినా ఏం లాభం? వంకర వంకరే. అట్లాగే ఉంది నందిని సిధారెడ్డిగారి పరిస్థితి.

కలకూరగంపలో లేఖలమీద పాప్యులర్ కావాలనుకుంటే అంజయ్య 'అంకె'గా మారాల్సిన అవసరంలేదు. 'భారతి'కి, పాఠకులకీ క్షమాపణలు చెప్పి నాతో ముఖాముఖి దిగాలనుకుంటే భారతిలో కలగూరగంపనే తమరికి తడికలా కావాల్సి వచ్చిందా? ఇదోరకం పాప్యులర్ పద్ధతా? లేక నా అడ్రసు మర్చిపోయారా? మరిచిపోతే లెటర్‌కొనన రాస్తున్నా. జాగ్రత్తచేసుకో. అందుకే మీ పిడివాదానికి ఇదే ఆఖరి జవాబు. 'కాదంటే ముఖాముఖిగానే చర్చించుకోవచ్చు లెండి. ఏమంటారు? అమాత్రం ధైర్యముందా ?

నందినిగారు ఒక్కసారి ఆత్మపరిశీలన గావించుకుంటే బాగుంటుందేమో? లేదూ వెనక్కి తిరిగి చూసుకొని తాము చేసిన ఘనకార్యాలు జ్ఞప్తికి తెచ్చుకుంటే మంచిది. అపుడు తెలుస్తుంది 'దాఢి' బులెటిన్ ఎవరు తీశారో? లేదూ 'ఎల్లోరా ది క్లీబా'ను రచించి, మరియు రెడ్డి శివయ్యగా మారిన మీరూ, ''యద్దనపూడి విజయకుమారిగా, విజ్జెరావుగా'' మారిన విజయారావుగారూ, ''కో. వాశిరెడ్డిగా అయినాల బాలసుందరంగ మారిన కె. శివారెడ్డి గారూ, డి. వేణుబాబుగా మారిన దేవరాజ మహారాజుగారూ ఎవరు ఆత్మపరిశీలన చేసుకున్నాసరే. 'దాఢి' మీరే తీశారని తెలుస్తుంది. పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగినట్లుంది, మీరు 'దాఢి' తీయ లేదనడం. పైగా విరసం, అరసం, ఎబిఆర్ అంటూ రూమర్లను సృజించడము మీకే చెల్లుతుంది. చేసిన పనిని ధైర్యంగా చాటుకునే తత్వం లేకపోగా సంజయ్‌గాంధి ఎమర్జన్సీలో ఎలాంటి తప్పిదాలు చేయలేదని ఇందిర దభాయించినట్లు దభాయించడం, మీ అబల త్వాన్ని మూర్ఖత్వాన్ని మరొకరికి అంటకట్టడము మీ గొప్పదనాన్ని మరో నిదర్శనము అనుకుంటా?

ఇంటిపేరు మార్పులూ, అసలుపేరు మార్పులూ (సిద్దా రెడ్డి సిధారెడ్డిగా) మీరు చేసుకోగా లేనిది, అంజయ్య అంకెగా మారగానే పట్టించుకోవాల్సిన అగత్యం మీ కెందుకేర్పడిందో అర్థం గావడములేదు. మీకు నచ్చినట్లు మీరు మార్చుకుంటే తప్పులేదు కాని ఇతరులు మార్చుకుంటే అందులో మీకు ఏవేవో ద్యోతక మౌతాయి. పట్టాభి పరాభిగా మారడము చూసి సిద్దారెడ్డి సిధా రెడ్డిగా అనుకరించి మార్చుకోవడం పాప్యులర్‌కోసమో పెంటకుప్ప కోసమో మీకే తెలియాలిలెండి?

శివారెడ్డి ఎవరో ఏమిటో మీకూ నాకూ ఇద్దరికీ బాగ తెల్సిన విషయమే. శివారెడ్డి కవిత్వంపై నేను రాసిన వ్యాసాలు ఆ కవిత్వం ఎందుకు నచ్చుతుందో అని పొగడడానికి కాదు. ఆ కవి త్వాన్ని పరిచయం చేయడం మాత్రమే. అంతమాత్రాన మీ ఇచ్ఛా రీతిగా ఊహిస్తే నేను చేయగలిగింది ఏమీలేదు. మీ అజ్ఞానానికి ఇది మరో నిదర్శనము మాత్రమే అవుతుంది మినహా మరేంకాదు. నేను శేషేంద్రను సమర్థిస్తున్నట్లుగా మీరు భావిస్తే వప్పులో కాలేసినట్లే. శేషేంద్ర, శివారెడ్డి ఇద్దరూ జనజీవితాల్లో ప్రవేశించలేని కవిత్వాన్ని సృష్టిస్తున్నారు. (భా. నవంబర్ '78, పేజి 70) ఎవరో శేషేం ద్రను ఉషస్సూర, యుగకవి అనగానే అతడు అయిపోయాడా? మీలాంటి వాళ్ళేకాదు ఎవరైనా అనగలరీ మాట (ఒక పొగడిన రచయిత, శేషేంద్ర శిష్యబృందాలు మినహా). మీరు శివారెడ్డిని అలా పొగుడుతూ రాసినాజరిగేది అంతే. అమాత్రం జ్ఞప్తికుంచు కుంటే చాలు.

శివారెడ్డిని శేషేంద్రనూ కలుపకుండా ఒక శేషేంద్రను దులిపితే బాగుండేది (కవిసేన మానిఫెస్టో పరిశీలనలా). అక్కడే అడుసు తొక్కారు కాళ్ళు కడక్కోవడానికి ధైర్యం చాలడంలేదు (నీవు తప్పు చేశాననుకోవడం నీకు సహించదు కాబట్టి). పొగిడించు కోవడం శివారెడ్డికి అవసరమని ఎవరన్నారు? మరెందుకా భుజాలు తడుముకోవడం. దీన్ని మీ తెలివి మీరడంగా పరిగణించుకోవాలా?

పదచిత్రాలు మన ఇంద్రియాల్ని తాకి ఐంద్రియక అను భూతుల్ని మేల్కొల్పాలే తప్ప అవాస్తవికత, అస్పష్టతలను జొప్పిం చేవిగా రూపొందరాదు (చూ భా. జూన్ '78, పే. 62). ప్రతీ కలూ అంతే. ప్రతీకలు కాకుండా, ఇజాలు కాకుండా, పొలిటిక్స్ కాకుండా, ప్రయోజనం కాకుండా, అనుభూతులు కాకుండా, ఆవేదనలు కాకుండా కవిత్వమంటూ ఒకటుంటుందని నేను అనలేదు. అలా మీరు కళగంటే ఎవరైనా చేయగలిగింది ఏమీలేదు. ఉన్నదానికీ, లేనిదానికీ విపరీతార్థాల్ని సృజించుకొని బాధపడితే అది మీ పరిజ్ఞా నాన్ని తెల్పుతుందేతప్ప మరేంకాదు.

మావోను, కొ. కు., రా రాలను ఒకేగాట కట్టిన సిధారెడ్డి గారి అతి తెలివిని ఏమనాలో అర్థంకాదు. మావో—సేటుంగ్‌గా మావోగార్ని పిలవడం అరుదు. కొడవటిగంటి కుటుంబరావుగార్ని కొ. కు. గా, రాచమల్లు రామచంద్రారెడ్డిగార్ని రా. రా.గా పిలవడం అరుదు. రెండూ ఒకే గాటకట్టే మీ అంత పరిజ్ఞానము మరొకరికి అరుదే

దుఃఖాన్నీ, విషాదాన్నీ, కన్నీళ్ళనీ వేర్వేరని చెప్పడం మీ డొంక తిరుగుడుతనాన్కి ప్రతీక. పోతే శ్రీశ్రీగారు సమాజములోఉన్న కాన్సెప్ట్‌ను ఖండించలేదనుకోవడం మీ భ్రమ. శ్రీశ్రీగారి కవిత్వంపై సరియైన అవగాహన లేనివారు అనేమాట అది. ఇక శివారెడ్డిగారి కవితను ముగింపుదాకా తీసుకెళ్ళారు, కానీ మీరు మర్చి పోయారనుకుంటా (మీరన్నమాటే ఇది). కవితలో ఏ భాగానికి ఆ భాగాన్ని తీసుకోవచ్చునని అన్న విషయము. మర్చిపోతే శ్రీశ్రీ గారి 'అవతారం' కవితలోని భాగాన్ని మీ ఇచ్ఛారీతిగా ఊహించి రాయకపోయేవారు (ఆంధ్రభూమిలో). ఒక తప్పును సమర్థించు కుంటూ మరో తప్పు చేస్తున్నారని మరోమారు తెలియపరుస్తున్నా.

ఒకరుకాదు మరిద్దరు (దినకర్, లింగంపల్లి రామచంద్ర) చెబుతున్నా గ్రహింపజాలక పిడివాదాన్ని చెడమడ వినిపిస్తూ మిడిమిడి తనాన్ని పెంపొందించుకోవడం మీకే చెల్లింది. ఇతరుల్ని తిట్టేముందు మిమ్మల్ని మీరు పరిశీలించుకోవడం మంచిది (మీచేతగాని తనాన్కి మరో ప్రతీకగా తిట్లు).

మేధావి వర్గం ఆడంగి వెధవల్లా కూర్చోకపోతే ఏం చేశారు ఎమర్జెన్సీలో? ప్రతిదానికీ రాజకీయాల పులుముడు రుద్దడం

మీలాంటివారు కాక మరెవరు చేస్తారు? ఇవన్నీ చూస్తూ కూర్చునే ప్రజలు దౌర్భాగ్యులు కాక మరేమవుతారు. వారిని మూర్ఖులుగా చిత్రించడం మీవంతే. పోతే ప్రజలంటే అందులో వ్యాపారస్థులు, భూస్వాములు మినహా మిగిలిన వాళ్ళు కారని నిర్వచించడానికి మీరు పడిన తంటాలు చూస్తుంటే నవ్వొస్తుంది. ఇది మీ అతిజ్ఞానాన్ని బట్టబయలు చేస్తుందే తప్ప మరేంకాదు.

సిధారెడ్డిగారు వేమన పద్యాలు మారుమూల పల్లెల ప్రజానీకంలోకి ప్రవహించడానికి కొందరు వ్యక్తులు కారణమైనారన్నారు. వేమనని సుమారు మూడువందల ఏళ్ళదాకా అజ్ఞాతంగా తొక్కిపెట్టారంటారు. ఇది వారి మూర్ఖత్వానికి మరో నిదర్శనము. పల్లెప్రజల నాలుకలపై నాట్యమాడుతున్న వేమన పద్యాల్ని సేకరించుకోవడానికి, ఒక్కచోట పుస్తకరూపం తెచ్చుకోవడానికి మనకు వందల ఏండ్లు పట్టింది. ఈనాటి వరకూ పల్లెల ప్రజానీకానికి వేమన పద్యాలు తెలుసుకాని వేమనను ఎవరైతే మీరు వెలుగులోకి తెచ్చారంటున్నారో వారి పేర్లైనా తెలియవు.

కమ్యూనిజం మేకప్ చేసుకున్న రచయితలే శివారెడ్డి, శేషేంద్రగారలు. ఈ నిజాన్ని నమ్మలేక (తెలిసే నమ్మలేక) మీరు పట్టిన కుందేటికి మూడేకాళ్ళంటే పాతకలోకం నవ్వుతుంది.

శేషేంద్రను శేశేంద్రగా, ఊసరవెల్లిని ఊసరవెళ్ళిగా రాయడమనేది తొందరపాటులో జరిగినదని నేనూ ఒప్పుకోగలను. భాషా దోషాల్ని విడిచి భావాల్ని అర్థం చేసుకుంటే ఆరోగ్యదాయకము.

నందినిగారు తడికచాటు పద్ధతి విడనాడి ముఖాముఖి దిగదల్చుకుంటే నా అడ్రస్—

కె. అంజయ్య,
ఇం. నం. 5–2–85,
పారిపల్లివీధి,
సిద్దిపేట–502103.

లేదూ ఇంకా తమరు లేఖలమీదనే పాప్యులర్ కావాలనుకుంటే మీకు భారతి 'కలగూరగంపే' శరణ్యం.

శ్రీ కె. అంజయ్య

## శ్రుతిమించిన ప్రతి విమర్శ

ముదిగొండ శివచరణుల ప్రతి విమర్శ శ్రుతిమించి రాగాన పడ్డది. వారి సత్యాన్వేషణ 'మిధ్యాడంబర దేవార్చన'.

"మల్లికార్జున పండితారాధ్యుడు ద్వైతిఅని రాసింది నిడుదవోలు వేంకటరావుగారు కాదు. శివతత్త్వసార తొలిముద్రణ పీఠికా కర్తలు కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారే" అని ఒ.వి రాస్తే దానికి ప్రతి విమర్శగా "నిజంగానే నేను శ్రీ ల. రా. గారు పరిష్కరించిన ప్రథమముద్రణ చూడలేదు. చూడాలని కూడా అనుకోలేదు. ఇప్పటికీ అనుకోవడం లేదు" అని మొండిగా జవాబిస్తే అది సత్యాన్వేషణం అవుతుందా? పరిశోధక పండితులమని చెప్పుకొంటే అట్టివారిని ఎవరు ప్రామాణికంగా గౌరవిస్తారు?

వేంకటరావుగారి ఎడిషన్ ఉంది కదా! దాన్నే మరోసారి తిరగవేస్తే 84 పేజీ నుండి 88వ పేజీవరకు ప్రథమ ముద్రణలో నుంచి ఎత్తి వ్రాసిన వాక్యాలు అని స్పష్టంగా ఉందే? 84పుటలో "శివతత్త్వసార తొలి ముద్రణమున మత సంప్రదాయములు వాని విమర్శ యిట యిచ్చుచున్నాను" అని మొదలుపెట్టి 88 వ పుట తిప్పగానే "పై శివతత్త్వసార పీఠికలోని అంశములే బసవ పురాణ ప్రథమ ముద్రణమున గైకొనబడినవి" అని ఉంది కదా! అప్పుడు శివచరణులు విమర్శించిన 86 వ పుటలోని వాక్యాలు యెవరివి అవుతాయి?

ఈపాటి చిన్న విషయాన్ని పరిశీలించలేని వారు విజ్ఞానాత్మక జిజ్ఞాసోపేత కృషి ఎట్లా చెయ్యగలరు?

శివచరణులు తమ మొదటి వ్యాసంలో శివశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రులవారిని స్తుతిస్తూ "మల్లికార్జున పండితాదులు శుద్ధాద్వైతము ఖండించి యున్నను వారి మతము శివాద్వైతమే" అని సిద్ధాంతం చేశారని వ్రాశారు కదా! ఆ "నాగలింగ శాస్త్రిగారే" మల్లికార్జున పండితులవారు శివతత్త్వసార మందును, శ్రీహరదత్తాచార్యుల వారు శ్రుతిశూక్తి మాల యందును అద్వైతమును ఖండించి ద్వైతమునే సిద్ధాంతము చేసియున్నారు" అని 1961 శైవమత ప్రకాశిక 4, 5 సంచికలలో వ్రా రే?

వేంకటరావుగారు, కొమర్రాజువారికి శైవ సంప్రదాయాలు తెలుసో, తెలియదో తర్వాత ముచ్చటించుకోవచ్చు. "ఆరాధ్య సంప్రదాయానికి అమూల్యమైన సేవచేసి తమ సాహిత్యం చేత పునరుజ్జీవనం కలిగించిన మహామహోపాధ్యాయ శివశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రిగా"రని శివచరణులు కీర్తించిన ఆ నాగలింగ శాస్త్రిగారికి కూడా శైవ సాంప్రదాయం తెలియదంటే ఏం జవాబిస్తారు?

తమ వ్యాసంలోని దోషాలను ఎత్తి చూపినందుకు మండిపడి కుమిలి రోడ్డుమీద నాలుగు మాటలు ఏరి ప్రతి విమర్శలో విసిరితే అవి ఎవరికి తగులుతాయో ఇప్పుడు తెలిసిందా!

మళ్ళీ ఒ. వి.

## గురజాడ - అసభ్యం - మరి అదంతా!

పూజ్యులు సర్దేశాయి తిరుమలరావుగారు, తీవ్రఅభిమానంతో వ్రాసిన "గురజాడకు అర్థమైన భారతీయ సంస్కృతి" చదివిన తరువాత విపరీతమైన దురభిమానం మనలోని తార్కికశక్తిని నశింపజేసి మన అ(దుర)భిమానాన్ని చూరగొన్న వారిలోలేని అంశాలను పైకెత్తి పొగడింపజేస్తుందో విశదమైంది. ఇదే విషయాన్ని ఇటీవల గ్రంథసమీక్షలో కూడా చర్చించడమైనది. విశ్వనాథపై అభిమానంకల వ్యక్తి వేయిపడగలపైన రచించిన విమర్శనా

వ్యాసంలో ఆ నవలలోలేని ''కుండలీని విషయంపై'' అనవసర రచన సాగించారని, సమీక్షకులు విమర్శించారు.

తమ సుదీర్ఘ వ్యాసంలో తమకెన్నో విషయాలు తెలిసే మాట్లాడుతున్నాను సుమా అని భారతి పాఠకులకు హెచ్చరిస్తూ గురజాడను అనవసరంగా పొగడిపారేశారు. పులిచెర్ల విమర్శకు మరో విమర్శ వ్రాస్తూ ''ఒక్క లంజఅన్న శబ్దం అసభ్యమైతే, అది విశ్వనాథవారి రామాయణంలో వుం''దని గొప్ప సత్యాన్ని వెలి బుచ్చారు. ఒక చిన్న మనవి. రామాయణం కొన్ని అసభ్య ప్రస్తావన లను వుండికూడా హిందువు లందరికీ (రంగనాయకమ్మను వదలి వేయండి. వారిని హిందువులుగా మేము భావించం. వారు కూడా ఈ విషయాన్ని గర్వంగా స్వీకరిస్తారు. తిరుమలరావుగారు కూడా ఈ జాబితాలోనే చేరగల్గితే, ఇక వాదనకు అవకాశమే వుండదు. అయితే కేవలం గురజాడమీద దురభిమానంతో మహత్తరమైన ఆదికావ్యాన్ని కించపరచచూడ్డం వారి స్థాయికి చెందిన చర్యకాదు) శిరోధార్యమైనది. కన్యాశుల్కం అటువంటి బూతులువున్నందు వల్లే తిరస్కారీయమైనది.

మన నిజజీవితంలో వుపయోగించే పదజాలంలో, విడదీసి చూస్తే, ఎన్నో అసభ్యాలు వినవస్తాయిసుమా! అని సోదాహరణంగా నిరూపించి ఎంత గొప్ప సత్యాన్ని పరిశోధించి నెలకొల్పారు. నిజంగా 'మిరుమాల' (మీ రుమాలు అనడానికి)వంటి ప్రయోగాలు హాస్యా నికి, ఛలోక్తికి, అప్పుడప్పుడు వుపయోగించినా అశబ్దాలుగ యోగ్యమైనవికావు. సభామర్యాదను ''సంస్కృతి''ని అతిక్ర మించే భాష నిషేధనీయమే. కొన్ని విషయాలు గ్రంథస్థం చేసి వుండవొచ్చు. అయితే వాటిని ప్రదర్శించేటప్పుడు, అవి సంఘ సంస్కృతిని, సంస్కారాన్ని ఏవిధంగా ప్రతిబింబజేస్తాయి, ఈ ప్రద ర్శనలు ఆ సంస్కృతిపై ఏలాంటి ప్రభావాన్ని చూపుతాయి, మొద లగు విషయాలను గుర్తించక, నాటకాన్ని వ్రాసిన రచయితకు, ఆ దేశ సంస్కృతి ఏవిధంగా అర్థమైంది? మహోన్నతమైన భార తీయ సంస్కృతి ''విధవ ఆడపడచులతో'', కొందరు ''మోసకారు లతో'' భోగం వాండ్రలో మాత్రమే నిండిపోలేదు. ఈ సత్యాన్ని గురజాడ గ్రహించాడో లేదో కానీ, తిరుమలరావుగారికి తెలిసి కూడా దురభిమానంతో ఈ సత్యాన్ని కాలదన్నుతున్నారు.

వేదకాలంనాటి ఆర్యుల లైంగిక జీవనానికి, తరువాత హిందు వుల క్రమబద్ధ సంసారజీవనానికి ఎంత భేదముందో చరిత్ర తెలిసిన వారందరికీ అవగతమైతుంది. కనుకనే ఇప్పటికీ పౌరాణికులు మహా భారతంలోని వివిధ వ్యక్తుల జన్మాలు, వివాహబంధంనుండి కాక జరిగినవి—'దేవరహస్యాలు'గ అతికష్టంతో సమర్థింపజేయగల్గుతారే కానీ, వాటిని ఆచరణయోగ్యంగా ఎన్నడూ చెప్పరు. కారణం ఈదేశ సంస్కృతి ఒక విలక్షణమైన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనివుంది. ఈ సంస్కృతికి ఆపేక్షమైన విషయాలు సర్వదా నిల్చిపోయాయి. కానివి రాలిపోయాయి. ఉదా:—మహాభారతం మనకు ఆదర్శమైనా ఎంతమంది హిందూ స్త్రీలు ''ద్రౌపది'' అని పేరుగల్గియున్నారు. సీత, సావిత్రివలె కారణం ఆనాటి ఆ విచిత్ర సంబంధాన్ని ఈ సంస్కృతి తిరస్కరించింది. కాబట్టి, ఆ సంబంధం అమలుకు రాలేకపోయింది. ఉన్నది ఉన్నట్లుగా బహిర్గతంచేస్తే ఈ సాంస్కృ తిక ఆవిర్భావాన్ని గుర్తించని వ్యక్తులు ''ఋషులు తాగేవారు. కాబట్టి తాగేద్వారా మేమూ ఋషులువంటివారమే'' అన్న వక్రభాష్యం చేయ వచ్చు కాబట్టే కొన్ని నిషేధాలు అమలులోకొచ్చాయి. ప్రతి సిద్ధాం తానికిపరమార్థ భావం, వ్యావహారిక భావం అని రెండు సూత్రాలు వున్నాయి. ఈవ్యావహారిక భావంతో సిద్ధాంతాలను బహుళప్రచారం చేసే వాటిలో నాటిక ఒక్కటి. కనుకనే భరతముని కాలం నుండీ కూడా దీనిపై విపరీత నిషేధాలు. కారణం వీటిని అవలోకించేవారి సాంస్కృతిక స్థాయి తక్కువ. కాబట్టి వారిలో ఈ సాంస్కృతిపై అభిమానం పేర్కొనేటట్లు ఈ సంస్కృతి మూలతత్వాం వారికి విడమఱచి చెప్పేటట్లు చేయవలసిన బాధ్యత నాటక కర్తది. ఈ నిషేధాలు లేకపోతే, తక్కువ స్థాయిలోవున్న ఈ ప్రజలు, సంస్కృ తిని వక్రంగా అర్థం చేసుకోవచ్చు.

ఇదే విషయాన్ని పానుగంటివారి సాక్షిలో ''తోలుబొమ్మలు'' వ్యాసంలో చూడవొచ్చు. తోలుబొమ్మలుద్వారా రామాయణ, మహా భారత గాథలు ప్రచురించడం ఒక ఎత్తు. సమాజ నైతిక విలువ లను నశింపజేసే, వావి వరుసలులేని లైంగిక సంబంధాలు చూపడం మరో ఎత్తు. ఇటువంటి ప్రదర్శనలతో మన సంస్కృతిని ద్రోహ పఱచడం లేదా ? ఇదే ప్రశ్న సినిమాలకు అన్వయిస్తుందీ, కొద్ది తేడాతో గురజాడగారికీ తగులుతుంది.

మరి ప్రాచీన సాహిత్యంలోని అసభ్యం మాటలేమిటి ? దీనికి సమాధానం ఇది. కాళిదాసు కుమారసంభవంలోనూ అసభ్యంవుంది. చౌడమ్మగారి కందాలలోనూ అసభ్యం వుంది. అయితే, కుమార సంభవం చదివి అర్థం చేసుకొనేవారు ఎటువంటివారు ? వారి సంస్కారం, సంస్కృతి, మేధాశక్తి, విచక్షణాజ్ఞానం ఎటువంటిది? చౌడమ్మ రచనలను మెచ్చుకొనేవారి స్థాయి ఎటువంటిది ? ఈ విషయం విశ్లేషించండి. ఎవరినుండీ సంస్కృతికి చెఱుపో, మనమే గ్రహించవచ్చు. అటువంటి వారికై రచింపబడ్డ నాటకంలో జాగ్రత్త వహించక, ఏదో జమీందార్ బాబు కులాసా కోసమై వాడిన పదజాలం, ఏ విధంగా నాటక కర్తను బాధ్యతాయుత రచ యిత చేస్తుంది ? ఏ విధంగ ''ప్రజాకవి చేస్తుంది.'' సంస్కృతి అన్న అంశమే మృగాలను మనుష్యులను వేరుపరుస్తుంది. రచయిత దేశ సంస్కృతికి పునాది. ఈ సంస్కృతిని సంఘంలో పంచేవాడు. అటువంటప్పుడు తన రచన ద్వారా ఈ సంస్కృతిని కించపరచిన వ్యక్తి ''ప్రజాకవా? తన నాటక పరిణామాలను గుర్తించక, తనను సాకిన జమీందారుబాబు కులాసాకు నాటకం వ్రాసిన గురజాడ, పోలెండ్ దేశం ఏ విధంగా వుంటుందో కలలో కూడా వూహించక, ఆ దేశానికి రాజ్యాంగాన్ని వ్రాసిన అరిస్టాటిల్ ఇద్దరూ ఒక్కటే ! ఇద్దరూ మేధావులే సుమా !

ఇంక గురజాడ 'దేశభక్తి' గీతం వ్రాసాడు అన్నది ఒక వాదన. ఏ గీతం ద్వారా, ప్రజలు ఉత్తేజితులౌతారో, ఏ గీతం మన లోని అంతరాళాల దేశభక్తిని ప్రదీప్తం జేస్తుందో, ఏ గీతం మన

మహత్తరమైన సాంస్కృతీ గరిమను మనకు జ్ఞప్తికి చేస్తుందో అదీ దేశభక్తి గీతం. దాన్ని వ్రాసినవాడు దేశభక్తుడు. ఆ విధంగాచూస్తే వందేమాతరం లేకుంటే ఆర్. ఎస్. ఎస్. వారి నమస్తే సదావత్సలే లేకుంటే మా కొద్దీ తెల్లదొరతనమూ వంటి విదేశభక్తి గీతాలు, ఈ గీతాల గొప్పతనం చరిత్ర విదితం. వందేమాతరం పాట వలన ప్రేరితులైన యువకులు మాతృదేశ విమోచనానికై ఉరికంబాలను సైతం చిరునవ్వుతో కౌగిలించారు. ఈ లెక్కలో గుఱజాడది ఒక రచనమా ? అది ఎవరిని ప్రేరేపించింది ?

*డా. మురళీధర్*

## "వ్యాసుడు : గ్రన్థ చౌర్యమా"

నేను అక్టోబరు 1979 'భారతి'లోగల "వ్యాసుడు: గ్రన్థ చౌర్యమా"యను దానిని జదువగా, యందు శ్రీపెద్దాడ నారాయణ శాస్త్రిగారు వాల్మీకి రచనా వైశిష్ట్యముతో వ్యాసమహర్షి రచనా వైశిష్ట్యము నుగ్గడించెను. కాని వాల్మీకి త్రేతాయుగపువాడు, వ్యాసుడు ద్వాపరయుగపు చివరివాడు. వ్యాసుడు సారూప్య వైరూప్యములతో రామాయణము ననుకరించియే మించెననుట యంత సమంజసముగాలేదు. ఇరువురు తపశ్శాలురు. వారు చేయు యోగ శక్తి యమోఘము, అపురూపము. యోగశక్తిచే పరబ్రహ్మాదే సాక్షాత్కారము జేసికోవచ్చు అందుచే యోగశక్తిద్వారా వెలువడిన శ్లోకముల వ్యాసమహర్షి విరచించెగాని, యనుకరించలేదు. తరువాత వ్యాసుడు నలోపాఖ్యాన రచన కాలమున వల్మీకమును స్మరించలేదు. ఆయన కవితా శిల్పములను తన మనమునందిడు కొనలేదు. నలోపాఖ్యానమునకు తత్పూర్వమే యోగమునందు గూర్చుండె, యోగానంతరము నలోపాఖ్యాన రచనకు గడంగెనేగాని వేరొండుగాదు.

*శ్రీ సి. బ్రహ్మయ్యాచారి*

## సంస్కృత వ్యతిరేక క్రియలు ఏర్పడుటకు పాణినీయ సూత్రములు కలవా ?

22–9–'79న జరిగిన ఒక యూనివర్సిటీ సంస్కృత లెక్చరర్ పోస్టు ఇంటర్వ్యూలో సంస్కృత వ్యతిరేక క్రియలు ఏర్పడుటకు పాణినియమునందలి సూత్రములేవి? అని నన్ను ఇంటర్వ్యూ కమిటీలోని ఒక ప్రొఫెసర్‌గారు ప్రశ్నించిరి. పై ప్రశ్న సముచితముగా లేదని కొందరు పండితులు సూచించుచున్నారు. కావున విజ్ఞులయినవారు పై ప్రశ్నకు సమాధాన విషయములో తమ అభిప్రాయములను తెలిపి సందేహ నివృత్తి చేయ ప్రార్థించుచున్నాను.

*శ్రీ ఆచంట వెంకట సీతారామమూర్తి*

## సంకలనం

ఆధునిక తెలుగు కవిత ఆంధ్రదేశం పరిధి దాటి పోవటం లేదు. మళయాళీ, బెంగాలీ, పంజాబీ, ఒరియా, హిందీ కవుల సంకలనాలు ఆంగ్లంలో అనేకం రాగా ఒక సమగ్రమైన ఆంగ్లీకృత తెలుగు కవితా సంకలనం ఇంతవరకు రాలేదు. తెలుగులో సుమారు నలభై, యాభై మంది వచన కవులను ఎన్నుకొని ముఖ్యంగా యువ కవులకు మంచి ప్రాతినిధ్యం ఇచ్చి ఒక్కొక్కరివీ రెండు మూడు కవితలను అనువదించి "తెలుగు కవిత – ట్రాన్స్ పొయిట్రీ" అనే ఆంగ్ల సంకలనాన్ని నా సంపాదకత్వ, పరిచయ వాక్యాల, అనువాద, ఉపోద్ఘాత బాధ్యతలో వెలువరించాలని నిశ్చయించాను.

ఈ కృషికి కవుల, విమర్శకుల, సాహితీప్రియుల ప్రోత్సాహాన్ని అర్థిస్తున్నాను. ఆదిల్ జస్సావాల పెంగ్విన్ వారికోసం సంకలికరించిన "ఇండియన్ రైటింగ్ టుడే"లో ఒక్క తెలుగు రచయితా చోటు చేసుకోలేకపోయాడు.

అనువాద బాధ్యతని డా. వెల్చేరు, డా. బి. వి. ఎల్. నారాయణరావు, రాయప్రోలు శ్రీనివాస్, డా. ఎస్. ఎన్. ప్రభాకర్, శ్రీ విజయకుమార్, శ్రీ ఎస్. వి. ఎస్. రావు, శ్రీ సంజీవదేవ్, శ్రీ తపస్వి, శ్రీ శ్రీరమణ, శ్రీశ్రీ, శ్రీగోదావరిశర్మ, స్మైల్, శ్రీ ఇస్మాయిల్, నిఖిలేశ్వర్, వజీర్ రహ్మాన్, శ్రీ వాకాటి పాండురంగారావు, డా. కె. వి. ఎస్. మూర్తి, శ్రీ రోణంకి అప్పలస్వామి గార్లు పంచుకుంటారు.

కవులు తమ తెలుగు కవితలను ఉంటే వాటి అనువాదాలను అనుమతి పత్రాలతో సహా పంపవచ్చును. కవితా ప్రియులు తమ అభిమాన కవుల కవితలను అనువదించి ప్రచురణకై పరిశీలనార్థం పంపవచ్చును.

ప్రచురణ పూర్వ మూల్యం ఇరవై రూపాయలు. సాహిత్యాభిమానులు ఈ ప్రోత్సాహాన్ని కూడ ఇవ్వవచ్చు.

**వి. మోహన్ ప్రసాద్,**
డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఇంగ్లీష్,
సిద్ధార్థ కళాశాల,
విజయవాడ–10.

## విలువ

1979 నవంబరు 'భారతి' సంచికలో శ్రీ కేతవరపు వెంకట రామకోటిశాస్త్రి వ్రాసిన "కావ్యముయొక్క సాపేక్ష విలువ సిద్ధాంతం" అనే వ్యాసము పాఠకోత్తములకు సద్విమర్శ యందు తావిచ్చుచున్నది. అందును లభించిన సవిమర్శలిట నుదహరణీయము లగుచున్నవి. కావ్య వస్తువు విలువ అనేక రూపాలతో కన్పిస్తున్నది. క్షేమేంద్రుడనే అలంకారికుడు వచ్చి కావ్య వస్తువుకు విడిపడగా ఉన్న ఈ విలువ రూపాలన్నింటికీ రిలేటివ్ విలువ రూపంగా ఔచిత్యాన్ని నెలకొల్పాడు. అందుకనే గుణాలంకారాది కావ్యం విలువ యొక్క విస్తృత రూపమంతా పరిమాణాత్మకం. ఔచిత్యం కావ్యం విషయంలో సామాజిక బాధ్యతను నిర్వహిస్తున్నదంటే ఆయా (పాత్రలు, దేశ కాలాలు, పాఠకులు) రకాల సమాజాలకు కావ్యము యొక్క విలువను తన ముఖంగా వ్యక్తీకరిస్తున్నదని అర్థం. కావ్య

గతమైన సమస్త రచనా శిల్పంతోనూ సమస్తమైన దేశ కాల పరిస్థితులతోనూ ఔచిత్యం విలువ సంబంధాన్ని ఐకకాలికంగా చూచుకోగలుగుతున్నదన్నమాట.

కావ్యముయొక్క స్వరూపస్వభావాలకున్న అన్యోన్యమే ఔచిత్యమంటే, అన్యోన్యాన్ని సంపాదించే శిల్ప మర్యాదనే ఔచిత్యమన్నట్లవుతున్నది. చెప్పబడుతున్న దానికీ, దాన్ని చెప్పటాని కుపయోగిస్తున్న రచనా శిల్ప విధానానికి తగి వుండటం వల్లనే కావ్యం అనన్యంగా ప్రకాశిస్తున్నది. భౌతికమైన శరీరంతో వ్యవహరించే మనిషి, తన అనుభవ జ్ఞానానికి వ్యవహార యోగ్యతను కలిగించాలంటే దానికి వాఙ్మయ రూపమైన భౌతిక భాషాశరీరాన్ని సమకూర్చాలి. అముక్తమైన ఆధ్యాత్మిక స్వభావానికి అనురూపమైన వాఙ్మయ శరీరం స్వరూపమవుతుంది. వ్యవహార యోగ్యత అనే ఉపయోగపు విలువ ఐకకాలికంగా వస్తుగతంగానూ, వస్తు రూపంగానూ ఉంటుంది.

క్షేమేంద్రుడు ఇట్లు నిర్దుష్టమైన ఔచిత్య సిద్ధాంతాన్ని నిరూపణం చేశాడు. ఈ ఔచిత్యమనే సాహిత్యం విలువకున్న ఏకైక కొలమానం. అతడీ విధంగా సామాజికులే సాహిత్యం విలువకు కొలమానమని ఔచిత్య సిద్ధాంతాన్ని క్రొత్తగా నెలకొల్పాడు. క్షేమేంద్రుని ఔచిత్య సిద్ధాంతం సామాన్య కావ్య పాఠకుల నీ రీతిగా సాహిత్య ప్రపంచంలో తీర్పరులుగా చేసిసమున్నత స్థానంలో కూర్చోబెట్టింది. కవి యొక్క పాండిత్య వైభవంమీద అంతవరకూ నిలబడ్డ కావ్యముయొక్క విలువనిట్లు అందులో వర్ణించబడ్డ మానవ జీవిత ప్రకార యథార్థ దృశ్యాల ఉచితానుచితాల మీదికి మళ్ళించబడింది.

*శ్రీ మంచికంటి వెంకటేశ్వరరావు*

## లేఖ

అపారము, అనర్ఘములగు సంస్కృత సాహిత్య సముద్రములో పరశ్శతము లగు సుభాషిత రత్నములు కలవు. వీటిని అన్నింటిని సంగ్రహించి, డాక్టర్ స్టెర్న్‌బాక్ అను ఫ్రెంచిభారతీయ సంస్కృతి విద్వాంసుడు ఇరువది సంపుటములలో వెలువరించుచున్నాడు మూడు సంపుటములు అప్పుడే విడుదల అయినవి. సర్వంకష పాణ్డిత్య మణ్డనుడైన డాక్టర్ స్టెర్న్ బాక్ విశేష సముల్లసితమయిన ఉపోద్ఘాతం గూడ సంతరించి ఉన్నాడు. కాని వారు సేకరించిన కొన్ని శ్లోకములందు కొన్ని పాదములు అదుకక, అనన్తర పూరణములున్నవని నా ఆశంక. విద్వజ్జనుల ముందు ఒక శ్లోకమును ఉంచుదును. సరియగు (తృతీయ పాదమును) పాఠమును ఇవ్వ ప్రార్థన.

భారతః పఞ్చమో వేదః
సుపుత్ర స్సప్తమో రసః।
... ... ... ... ... ...
జామాతా దశమో గ్రహః॥

*ఇప్పగుంట మూలదేవ*

## మరుపూరు : తెనుగు అనుప్రాస

'భారతి' అక్టోబరు'79 గ్రంథవిమర్శలు''గోరంతదీపాలు''—

కళాప్రపూర్ణ మరుపూరువారి యీ క్రింది మాటలు గమనించ గోర్తాను —

1 తెనుగుకు ప్రాణమైన అనుప్రాస ఉంటే ప్రాణం పోసుకొంటుంది.

2 మంత్రాలకు చింతకాయలు రాలవు (తెనుగు అనుప్రాసకు మామిడికాయలు అని ఉండాలి.) పై మాటలమీద నాకు ఈ క్రింది సందేహాలు ఏర్పడుతున్నవి; వివరించ ప్రార్థన —

1 ''తెనుగు అనుప్రాస'' అని ఒకటి ఉన్నదా ? సంస్కృతం మొ. భాషల అనుప్రాస వేరేనా?

2 తెనుగుకు 'అనుప్రాస' ప్రాణమా ? ''తను వగు శబ్దార్థంబులు, ధ్వని జీవము, అలంక్రియా వితానము సొమ్ముల్'' అంటారు ఆలంకారికులు.

3 ''మంత్రాలకు
చింతకాయలు
రాలవు'' అనే సామెతలో —

''మంత్ర—చింత''అన్నప్పుడు, దాన్ని 'ప్రాసం'గా గుర్తించాలి.

''మంత్రాలకు
మామిడికాయలు
రాలవు'' అని ఉండాలంటే—

అప్పుడు అక్కడున్న ప్రాసపోతుంది. ''మంత్ర—మామిడి''లో 'యతి' కుదురుతుంది గాని ప్రాస కాదు.

4 మకారం ఒకటి మళ్లీ ఆవృత్తి కావడం (మం — మా) ''వృత్త్యనుప్రాసం'' అనేటట్లయితే, పూర్ణబిందు పూర్వక తకారమైనా (ంత్రా-ంత) అవృత్తమవుతున్నది గనుక అదీ వృత్త్యనుప్రాసమే.

5 మరొక విషయం —
'79 మే, అక్టోబరు సంచికలో ''కొండవీటి రెడ్డి రాజ్య మహోదయము'' పుస్తక సమీక్షలు రెండు ఒకే కావ్యాన్ని గూర్చినవి కావా ?

*శ్రీ బండి నాగరాజు*

## శాతవాహనుల శాసనములు

డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు 1979 ఆగస్టు 'భారతి' మాసపత్రికలో పై పేరుతో సుదీర్ఘమైన వ్యాసం వ్రాశారు. వారి వ్యాసం పూర్తిగా చదివిన తర్వాత నానాఘాట్ శాసనంపై క్రొత్తగా వెలువడిన వ్యాసాలను వారి దృష్టికి తీసుకు

చావాలనే కాంక్షతో యీ లేఖ వ్రాయుచున్నాను. అసలు నానాఘాట్ శాసనం ఐదు పంక్తులు కలదని వాదన. చాలా భగ్నమై శాసన పరిశోధకులకు గూడ కంఠకప్రాయమై నిలిచి ఉన్న శాసనం అతి కష్టముమీద ఐదు పంక్తులు (అదీ అనుమానమే) చారిత్రికులు చదువగలిగారు. కాని ఏ పంక్తి ఎచ్చట మొదలై ఎచ్చట నిలిచినదో వారు తెలుపలేకపోయిరి. కావున ఆనాటి 'బూహలర్' మొదలు నేటి చారిత్రికులుసైతం ఏ పంక్తి ఎచ్చటనుండి మొదలైనదో ఇదమిత్థంగా చెప్పలేకపోవుచున్నారు. కావున ఎవరికి ఇష్టం వచ్చినట్లు వారే 'కామా'లు 'ఫుల్‌స్టాపులు' పెట్టుకొని వారి వారి సిద్ధాంతాలకు అనుగుణంగా పై శాసనపు పంక్తులను విభజించి, వారి వూహలకు అనువుగా అన్వయించుకొని ఆ శాసనంపై వివిధ రకాలుగా వివరణలను వ్రాసిరి. ఇది వారి అసమర్థతకు తార్కాణంగాదు. అసలు మూలశాసనమే పలుసిద్ధాంతాలకు ఆలంబనై పలు వూహలకు తావిస్తూంది.

ఇక డా॥ శ్రీరామమూర్తిగారు, వారికిగల సంస్కృతభాషా పాండిత్యముచే, చొరవతీసుకొని తొలి శాతవాహనుల శాసనాలపై దృష్టి జూపినందులకు వారికి నా ధన్యవాదాలు ఇంకొంచెం శ్రద్ధ జూపినవారు 'తొలి శాతవాహనుల చరిత్ర'లో అపరిష్కృతంగా మిగిలిన పలు సమస్యలను తీర్చగలరని నా వుద్దేశ్యం. నానాఘాట్ శాసనంపై క్రొత్తగా వెలువడిన విషయాలు వారి దృష్టికి తేవటమే నాయీ లేఖ సారాంశం. ఇక డా॥ శ్రీరామమూర్తిగారు నానాఘాట్ శాసనంపై వెలుబుచ్చిన విషయాలు క్రొత్తవిమాత్రంకావు. అవి ఎవరో ఒకరు సూచించినవే. 1975వ సంవత్సరములో డా॥ పరమేశ్వరలాల్ గుప్తాగారు నానాఘాట్ శాసనంపై చాలా విలక్షణమైన సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. వారి వ్యాసం "స్టడీస్ ఇన్ ఇండియన్ ఎపిగ్రఫీ", రెండవ సంపుటంలో ప్రచురితమైనది. అవి ముఖ్యంగా డా॥ శ్రీరామమూర్తిగారు చూడవలసింది. కాని చూచినట్లు వారి వ్యాసంలో చెప్పలేదు. డా॥ గుప్తాగారు వ్యక్తపరచిన విషయాలను క్లుప్తంగా యిందు పొందుబరుస్తున్నాను.

1 నానాఘాట్ శాసనంలో రాణిపేరు తెలుపలేదు. ఆమె "అంగెయ" కులానికి చెందినది. కాని శాతవాహనుల రాణి మాత్రంగాదు

2 ఆమె ఒక మహారథికి భార్య. అతనిపేరు "శ్రీ"తో మొదలు స్తుంది.

3 ఆమె దక్షిణా పథానికి చెందిన గొప్పరాజు కూతురు.

4 ఆమె 'వేదిశ్రీ'కి 'సతిశ్రీ'కి తల్లి.

5 శాసన కాలానికి 'వేదిశ్రీ' రాజ్యం చేయుచున్నాడు.

తదుపరి డా॥ గుప్తాగారు నానాఘాట్ శాసన కాలాన్ని ఇక్ష్వాకుల కాలానికి తీసుకుపోయిరి. డా॥ గుప్తాగారి సిద్ధాంతం చాలా విచిత్రంగా ఉంది. ఏలయన నాటి చారిత్రక పరిశోధకుడు 'బూహలర్'నుండి నేటివరకు అందరూ 'నానాఘాట్ శాసనం'లో తెలిపిన రాణి 'నాగనిక' యనియు 'శాతకర్ణి భార్య' యనియు నమ్మిరి. డా॥ గుప్తాగారి సిద్ధాంతం చూడటానికి విలక్షణంగా ఉన్నా, ఆలోచించి నిర్ధారించవలసినదేగాని ఊరికనే ప్రక్కకు నెట్టవలసినది మాత్రంగాదు. డా॥ మిరాషీగారు డా॥ గుప్తాగారి సిద్ధాంతాన్ని విమర్శిస్తూ 'అదే' జర్నలు 3వ సంపుటంలో ఒక వ్యాసాన్ని ప్రచురించినారు. కాని వారు వారి పాత సిద్ధాంతాన్ని బలపరుస్తూ వ్రాశారు. కావున డా॥ శ్రీరామమూర్తిగారు యీ రెండువ్యాసాలు జూచి వారి ఉద్దేశ్యాన్ని వ్యక్తపరచితే బాగుంటుందని నా నమ్మిక. అప్పుడు వారి వాదన చారిత్రిక సమ్మతమైనదీ, కానిదీ పాఠకులకు చారిత్రకులకు బోధపడుతుంది.

శ్రీ జి. జవహరలాలు

# నవ్వాలా? ఏడ్వాలా?

'భారతి' పత్రికలో ప్రచురిత మౌతున్న వచన కవితల్ని చూస్తుంటె నవ్వాలో, ఏడ్వాలో తెలియకుండ ఉన్నది. వారి భావమేమిటో, దానికి వారు అనుసరిస్తున్న మార్గమేమిటో మాకు అగమ్యగోచరంగ నున్నది. ఇంతో అంతో చదువుకొన్నవారికే అర్థము గానప్పుడు సామాన్యుని సంగతి చెప్పాలావేరే! పెద్దలంటారు 'అర్థముకాని చదువు వ్యర్థమ'ని అది అక్షరాల నిజమనిపిస్తుంది వీనిపట్ల. నా సూచన ఏమనగా వీరు వ్రాసే కవితలకు భావమేమిటో క్లుప్తంగ నాల్గుమాటల్లో తెలియజేసి ఇక కవిత ప్రారంభిస్తే అప్పుడు వీళ్ళు ఇక ఎంత అపర శ్రీశ్రీలో మరెవరెవరో, వారి రచనల పసలేమిటో తెలియగలవు. అప్పుడు పై రెంటిలో మేము ఏదో ఒకటి చేయగలము.

ఆచార్య తల్లోజు

# యువరచయిత(త్రు)ల మహాసభలు

సాంస్కృతీ సమాఖ్య (యువసాహితీ వికాసవేదిక — ఆంధ్రప్రదేశ్) ఆధ్వర్యాన యువరచయిత(త్రు)ల మహాసభలు జరుగనున్నాయి. ఈ మహాసభలో ఆధునిక సాహిత్య, సాంస్కృతిక రంగాలకు సంబంధించిన వివిధ ప్రక్రియలపై అధ్యాయన తరగతులు, యువరచయిత(త్రు)ల సమాహారం, చర్చలు, గోష్ఠులు మొదలగునవి సాహిత్య ప్రధానమైన కార్యక్రమాలుగా వుంటాయి. ఈ మహాసభల్లో పాల్గొనటానికి ఆసక్తివున్న రచయిత(త్రు)లు, కార్యకలాపాలకు బాధ్యత వహించ ఆకాంక్షించే ఔత్సాహిక సాహితీప్రియులు తమ పూర్తి వివరాలను సమాఖ్య రాష్ట్ర అధ్యక్షులు శ్రీ వి. శిరీష్‌కుమార్, సాంస్కృతీ సమాఖ్య, నున్న, (వయా) విజయవాడ- 521 212 అను చిరునామాకు తెలియపర్చాలి.

వెక్కలంక పద్మావతి

# గ్రంథవిమర్శలు

## ఆర్ష విజ్ఞాన గ్రంథములు

### ఆర్ష వాఙ్మయ చరిత్ర

[గ్రంథకర్త: శ్రీ వేదాంతం శ్రీనివాసాచార్యులు క్రౌను సైజు 20+88 పేజీలు. వెల: 4.లు. ప్రతులకు: గ్రంథకర్త, మంచికలపూడి, గుంటూరు జిల్లా.]

ఈ చిన్న పుస్తకంలో ఆర్షవాఙ్మయానికి చెందిన వేదాలను గురించి చాలా సంగ్రహంగానూ, వేదాంగాలలోని కల్పాన్ని గురించి విపులంగానూ చెప్పబడింది. అందువల్ల యిది ఆర్ష వాఙ్మయంలోని ఏకదేశపు చరిత్ర అని గ్రహించవచ్చును. గ్రంథకర్త భగవచ్ఛాస్త్రానికి సంబంధించిన వైఖానసాగమంలో సిద్ధహస్తులు. ఆ ఆగమ తత్త్వాన్ని బాగా ఆకళించుకొని ఆచరణలో పెట్టినవారు.

'మహోన్నతమైన హైందవ విజ్ఞాన సంస్కృతికి ఆటపట్టుగానున్న వేదకల్ప తరుశాఖలను గనుగొని నుత్సుకత నొందు స్వధర్మాభిమానులకు'' మార్గదర్శకంగా ఉండగలదనే సంకల్పంతో ఈ పుస్తకం వ్రాయబడినట్లు రచయితచెప్పున్నారు. రచయిత చెప్పుకున్న స్వవిషయాన్ని బట్టి యించుమించు అరవైయేళ్ళుగా ఆర్ష ధర్మ స్థిరత్వానికీ, తత్ప్రచారానికీ పాటుపడుతున్నట్లు, కొంతకాలం విఖనస్, దేవాలయ ప్రతిభ, అర్చకపత్రిక నడిపినట్లు, ఆయుర్వేద వైద్యంలోనూ సిద్ధహస్తులైనట్లు తెలుస్తున్నది. దేవాలయాల్లోని అర్చకత్వ అధికారాన్ని గురించి న్యాయస్థానాలకు ఎక్కి విజయం సాధించినట్లుకూడా తెలుస్తున్నది. కల్పానికి సంబంధించిన అష్టాదశ సూత్రాలలోనూ అయిదుసూత్రాలే దక్షిణదేశంలో ఆచరణలో ఉన్నవనీ, వాటిలో వైఖానసం మొదటిదనీ చెప్తున్నారు. వీరు వైఖానసులు కావడంవల్లనూ, దేవాలయాల్లో అర్చకత్వాధికారం ఉన్నవారగుట వల్లనూ, వాటిని గురించిన విషయాలు ప్రధానంగా వ్రాయబడినవి. ఇందులోఉన్న 'అర్చనాధికారము—సుప్రీంకోర్టు తీర్పు' పుస్తకం చివరి అనుబంధాలు, రచయితకు వైఖానస సూత్ర వైశిష్ట్య ప్రతిపాదన పయి అభినివేశం ఉన్నట్లు తెలుపు తున్నవి.

ఇది ఆర్ష వాఙ్మయంయొక్క సమగ్ర చరిత్ర కాకపోయినా, వేదాంగములలో ఒకటియైన కల్పాన్ని గురించి ఎన్నో విషయాలను తెలియజేస్తున్నది. ఈ పుస్తకాన్ని చదివితే గ్రంథకర్తగారి బహు గ్రంథ పరిశీలన, ఆయన పాండితీ ప్రతిభ, వైఖానసాభిమానం ఎట్టివో గ్రహించవచ్చును. ఏతద్గ్రంథ పఠనంవల్ల పాఠకునికి ఆర్ష వాఙ్మయంపట్ల గౌరవం, ఆసక్తి ఏర్పడగలవు.

శ్రీ కరుణశ్రీ (జంధ్యాల పాపయ్యశాస్త్రి)గారు, పండిత నారాయణం రామానుజాచార్యులుగారు, పండిత పురుషోత్తమ గురుక్కల్‌గారు, నారాయణం — రామాచార్యులుగారు మున్నగువారు ఈ పుస్తకంపై యిచ్చిన సదభిప్రాయాలూ ప్రకటింపబడినవి. ఆర్ష వాఙ్మయాభిమానులు ఆదరించవలసిన గ్రంథం యిది.

### కుండలిని

[రచయిత: శ్రీ రాగి చిన్నయ్య, తెలుగు పండితుడు, జి. ప. ఉన్నత పాఠశాల, ధర్మారం. క్రౌను 16+70 పేజీలు. వెల: 4 రూపాయలు, ప్రతులకు: శ్రీ గోవింద గిరిస్వామి, వినాయక్ నగర్. ఇం. నం. 1-1 127, పులాంగ్, హైదరాబాదు రోడ్, నిజామాబాదు-503001.]

ముక్తిని పొందడానికి తగిన మార్గాలు భక్తిమార్గం, కర్మమార్గం, జ్ఞానమార్గం, యోగమార్గం అనేవి నాలుగుమార్గాలు. వీటిలో వరుసగా ఒకదానికంటె మరొకటి కష్టసాధ్యమైనది. అయినా ఒకదానికంటె మరొకటి తక్కువ కాలంలో ఫలాన్ని ఇచ్చేది. యోగమార్గాలలో అనేక భేదాలున్నవి హఠయోగం మున్నగునవి కొన్ని మిక్కిలి కష్టసాధ్యాలే కాకుండా-ఏమాత్రం లోపం కలిగినా ప్రమాదంకూడా సంభవించవచ్చును. కుండలినీయోగం మాత్రం కొంత సులభమైనదీ, ప్రమాద రహితమైనదిన్నీ. ఆ కుండలినీ యోగాన్ని గురించిన విషయం సమగ్రంగా ఇందులో ఉన్నది.

రచయిత రాగి చిన్నయ్యగారు కుండలినీ జ్ఞానయోగులు, అవధూతలు అయిన శ్రీగోవింద గిరిస్వామివారి అంతేవాసులై, ఆ కుండలినీ యోగాభ్యాసం చేసి కృతార్థులయారు. స్వామివారివల్ల ఆ యోగతత్త్వాన్ని బాగుగా తెలుసుకున్నారు. స్వామివారి ఆదేశాన్ననుసరించే ఆ విషయాన్ని, అనుభవాలను గ్రంథస్థంచేసి యీ పుస్తక రూపంగా ప్రకటించారు కుండలిని పేరుమాత్రం విని, దాన్నిగురించి తెలియనివారికి సరళమైన భాషలో చక్కగా బోధపడే యీ రచన మిక్కిలి ఉపకరిస్తుంది. యోగాన్ని అభ్యసించే విధానాన్ని గురించి చాలా గ్రంథాలున్నవి. ఆ గ్రంథాలను చదివి స్వయంగా అభ్యసించడం సరియైన పద్ధతి కాదనీ, గురువునాశ్రయించి, ఆయన చెప్పిన రీతిని అభ్యసించాలనీ, ఆచరణలో లోపాలుంటే గురువు సక్రమ పద్ధతిలో పెడతారనీ ఇందులో స్పష్టంగా చెప్పబడింది. ఆ పద్ధతియే సరియైనది.

ఇందులో జీవేశ్వరుల సంబంధం, యోగస్వరూపం, యోగప్రయోజనం, కుండలిని — నాడీమండలం... అష్టాంగయోగం, శ్రీస్వామివారి యోగదీక్షా పద్ధతి, సాధకుల యోగానుభవాలు, గురు శిష్యుల సంబంధాలు, మన కర్తవ్యం తెలుపబడినవి. కుండలినీ యోగాన్ని సులభ పద్ధతిలో ప్రచారానికి తెచ్చిన శ్రీ గోవిందగిరి స్వామివారి సంగ్రహ జీవితచరిత్రం కూడా ఒక ప్రకరణంలో ఇయ్యబడింది.

ఈ కుండలినీయోగాన్ని గురించి చక్కగా వివరిస్తూ అందె వెంకటరాజంగారు కూర్చిన ''ఉపహార''మనే పీఠిక దీని వైశిష్ట్యాన్ని వివరిస్తున్నది. ఇది అవధూత శ్రీ గోవిందగిరిస్వామివారి ఆశీస్సులను అందుకున్నది. ఆలోపతీ వైద్యులు వై. మనోహరరావుగారు దీనిపై సదభిప్రాయాన్ని ఇచ్చిఉన్నారు. యోగాన్ని గురించీ, ప్రత్యేకంగా కుండలీయోగాన్ని గురించి స్పష్టంగా, సంగ్రహంగా తెలిపే యీ పుస్తకానికి మంచి ప్రచారం లభించవలసి ఉన్నది.

# నారద హృదయము

[రచయిత : శ్రీ రొంపిచెర్ల కృష్ణమాచార్యులు, క్రౌను 14+64 పుటలు. వెల: 2 రూపాయలు. ప్రతులకు : విశాఖ జిల్లా భీమునిపట్నంలోని రచయితకు వ్రాయవలెను.]

భగవంతుని అనుగ్రహాన్ని పొందడానికి జ్ఞాన-వైరాగ్య-కర్మ-భక్తిమార్గాలు సాధనాలు. వీటన్నింటిలోను సులభమైనది భక్తిమార్గం. అది సర్వజన సులభమైనది. ఆ భక్తిని గురించిన వివరాలు నారదముని రచించిన భక్తిసూత్రాలలో ఉన్నవి. నారద మహర్షి పరమభక్తాగ్రేసరుడు భక్తితత్త్వం అతనికి తెలిసినట్లుగా మరొకరికి తెలియదు. ఆ భక్తిసూత్రాలను బాగా అవగాహన చేసుకుని రచయిత యీ చిన్నపుస్తకంద్వారా ''నారద హృద''యాన్ని పాఠకులకు వ్యక్తపరుస్తున్నారు.

ఇందులో భక్తి, సాధన, సాధకుడు, జపము, సిద్ధుడు, మహాత్ములు, మోక్షము, భక్తి మహిమ అనే శీర్షికలలో ఆయా విషయాలను గురించిన వివరాలియ్యబడినవి

భగవంతునియెడగల ప్రేమయే భక్తి. అది అనిర్వచనీయమైన అనుభూతి. పరిశుద్ధమైన భక్తి భగవంతునిపట్ల ఉన్నప్పుడు ఆయనప్రేమ-వాత్సల్యం భక్తునికి లభిస్తుంది. కేవలం స్తోత్రాలూ, భజనలు భక్తికి సరియైన సూచకములు కావు. సరియైన భక్తి ఎట్లు కుదురునో యీ గ్రంథం చదివి తెలుసుకోవచ్చును. ఆయా విషయాలను తెలియజేస్తున్నప్పుడు రచయిత, తాము చెప్పినదానికి ప్రమాణాలుగా నారద భక్తిసూత్రాలను, భగవద్గీతా శ్లోకాలను, బమ్మెర పోతనామాత్యుని భాగవతంలోని పద్యాలను ఉదాహరించారు. నారద మహర్షి వివరించిన భక్తితత్త్వాన్ని తెలిసికోగోరువారు దీన్ని చదివితే చాలు. భక్తిలేని వారికి కూడా బగవద్భక్తిపట్ల ఆసక్తి కలుగుతుంది.

సుప్రసిద్ధ పండితులు శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు, న్యాయవాది పప్పు రామలింగశర్మగారు దీనిమీద సదభిప్రాయాలిచ్చారు.

రచయిత ఈ పుస్తకం ముద్రించడానికి ధనసహాయం చేసిన వారి పేర్లు వారి ఛాయాచిత్రాలతోకూడా ప్రకటిస్తూ కృతజ్ఞత తెలియజేశారు. అచ్చుతప్పులు లేకుండా ఉంటే ఇది యింకా బాగా ఉండేది.

"ఆంగీరస"

# దేవరకొండ దుర్గం

[గేయకావ్యం. డాక్టర్ ముకురాల రామారెడ్డి, పేజీ–16 పుటలు; దర 2 రు, ప్రతులకు : డాక్టర్ ముకురాల రామారెడ్డి, డెప్యూటీ డైరెక్టర్, తెలుగు అకాడమి, హిమాయత్‌నగర్, హైదరాబాదు–24.]

గట్టిపాండిత్యం కవిత్వాన్ని పిడసకట్టిస్తుంది – ఇన్నది మామూలుమాట. ఇంగ్లీషు తెనుగు సంస్కృతం ఉరుదు పాండిత్యాలలో పిహెచ్ డి. పైస్థాయి పాండిత్యము, రామారెడ్డి ముకురాలలో ప్రతిబింబిస్తూ, ఈ చిన్న గీతంలో వీరరసం పొంగారుతున్నది. ''తెలుగు మొనగాని వంచిన కన్నెకథ'' ఈ గేయం, ప్రతిబంధంలో కవితాశిల్పం చేవనెక్కి ఉన్నది. కవి ఈ దుర్గాన్ని చూచి ''అంతరంగాన ఒక చిత్రరంగమై భ్రమింప'' వీర్యవంతమైన భాషతో పాఠకుని భ్రమింపజేస్తున్నాడు.

దేవరకొండ నేలిన – ''వెలమలన్నంతవీనులు నిక్క పామ లెక్కు, వెలమబిరుములు విన్న పులకలే మొలకెత్తు; వెలమలన కోడి పుంజులకె ఈకలు నిక్కు, వెలమలన్నపుడె గుండెలు గుబాళించుగా'' అని శ్రీనాథుని పల్నాటి వీరుల చరిత్రను. బొబ్బిలి యుద్ధాన్ని కన్నుల కట్టెదుట నిలుపుతున్నాడు. ''సామ్రాజ్య తటవెందలాలపై క్రూర రక్తంబు విసురింపజేయు'' అని శ్రీనాథ కవిసార్వభౌముడన్నది ఈ వీరగథను గురించే. బయర గీతాలకు (Ballad–జంగంకథ) జానపద భాషశైలే కండ–నెత్తురు

ఈ కవి దేవరకొండ గతవైభవమును వర్ణించి ''వేడికన్నీరు'' కారుస్తున్నాడు. చదువరికి శివమెత్తించి ఊగించి–''సిగ్గులో నెత్తురెత్తరా నాటి వెలమపులి మీసం'' అని, ఆ కోట గాలిలో తిరుగాడే వాడికి భయము భక్తిని కలిగిస్తున్నాడు ''వెన్నుపోటు కటారి చిలుము బాయగ నూరి''స్తున్నాడు.

వీరావేశాన్ని రేకెత్తే వాక్యాలు కొన్ని:– ఫిరంగులపేటలరాశి కూలిపోయె, నేడు పులు (గడ్డి)బీడాయె; మూరు రాయలగండవీర కర ఖడ్గమది ఖంగుమనినంత గుహలలో మారుమ్రోగినదిరా; రేచర్ల గోత్రాలు కీపురాళ్లేపాడు; ఏ రాచకన్నియల బంగారు ప్రాయాలు త గేమల్లె పూచె; ఖిలగోడలు బరువై కొండల గుండెలు క్రుంగెనా; ఏమాయెరా కొండ రామాలయము మెది దిదికి దారుణమ్ము దీప కళక; మనసు కరగ నేడు వినిపించు ఒక్కటే గాలి పిల్లవాని జాలి పాట.

ఉప్పుకారం దిన్న ప్రాణంగదా కవిది – ప్రణయంలోనడి రెండు గీతాలు వ్రాసినాడు. ఆంధ్రులకు అభిమాన గేయమైన – ఊర్మిళనిద్రను వ్యాఖ్యానిస్తూ (లక్ష్మణ జాగరణ) ''ఊర్మిళా, దుర్విదగ్ధ వియోగస్మృతుల అరగనుల నిద్రవీడి, జాగరణానా'' అని మధురభావాన్వితంగాగాచెప్తున్నాడు. ''స్వతంత్రతుంకోటా''లో, రాజకీయ వాముల దోపిడి భాగాన్ని అంగడిలో నరితూకం పంచిపెట్టుతున్నాడు.

మొత్తానికి తెలంగాణా తెనుగు గడుసుదనమున్నది కవిలో.

## ఉ ద్గీ థ

[కవితా సంకలనము. ఏసుమూర్తి. డెమ్మి–128 పేజీలు; వెల : 6 రు; ప్రతులకు : పి. భవానీశంకర్, 1-106, పాత ఆల్వాల్, సికిందరాబాదు–500010.]

నలభై ఏండ్లుగా ఈ కవి హృదయంలో పుట్టిపారిన ఊహా ప్రవంతి, భాష భావంలో పరిణామమొంది, చివరకు ఉద్గీథగా ఉపనిషత్తుల సత్యాన్వేషణ లక్ష్యంగా రూపొంది, అనుభవైక వేద్యమైన కవిత ఇది. ఈయన కమ్యూనిస్టు భావాలు దాస్యాన్ని పోకార్చి స్వాతంత్ర్యాన్ని నెలకొల్పాలని ప్రపంచమంతా క్రుమ్మరు తున్నవి. వేడెక్కిన భావవైశాల్యంవల్ల అక్కడక్కడా భాష కుదించు కొనిపోయి విస్పష్టతను కోల్పోయినది. ''పిరికి పరుగులు''లో ఊరకే మెకార్థర్ అంటే, కమ్యూనిజంపై కత్తిగట్టిన అమెరికా పౌరుడని ఎందరికి తెలుస్తుంది. ''పుడమితల్లి'' ఉద్దేశమేమో బయటపడటంలేదు.

ఈ ఉద్గీథ ఖండికలో, విశ్వవిమానయాత్రలో, హైజాకర్–ఎల్లాపి (ఎల్లమీద ఆపేవాడు) చేసిన ఆగయిత్యం ప్రపంచ పరిస్థితు లను వర్ణిస్తున్నది. ''నేను బానిసను''లో నేటి ప్రపంచం మూఢ ఆచారాలలో అంధవిశ్వాసాలలో ఇరుక్కొనిపోయి ఉన్న భావదాస్యాని ఆవేదనపడుతున్నాడు. అన్ని బానిసీడు తనానికంటే మానవుని హీన పరచేది మూఢాచార దాస్యమేగదా!

రామాయణంలో పిడకలవేట (ఉద్గీథ) అన్నది మామూలు చాటవ. ఈ పిడకలు పొయ్యిలోకి పొయ్యే పేడ పిడకలుగావు–బౌద్ధ గ్రంథాలైన త్రిపిటకాలని కొందరంటారు. రామాయణంలో సత్య కామ జాబాలిచేసే నాస్తిక బౌద్ధవాదం ప్రక్షిప్తమంటూ, ఈసామెత పుట్టినదంటారు; ఇదే సమంజసమనిపిస్తున్నది.

మొత్తంమీద, ఆధునిక వాస్తవిక స్పృహతో మంచి నుడి కారంతో వ్రాసిన గ్రంథమిది.

## పు వ్వు లు

[గేయసంకలనం. సంపాదకుడు : ఆర్. బాలప్రసాద్, డెమ్మి 32 పుటలు; ప్రతులకు : ఆర్. బాలప్రసాద్, 2–4–104, శివాలయం వీధి, పెద్దపల్లి, కరీంనగర్ జిల్లా–505172.]

''రేపటి పౌరులైన నేటి బాలలకు'' విద్యాబుద్ధులు గరపను గేయరూపంగా చెప్పిన హితోక్తులు ఈ సంకలనం. చాలామంది వ్రాతగాండ్రు పిల్లకాయల మనసుకెక్కునట్లు చాలా సులభమైన భాషలో చెప్పి ఉన్నారు. ''అవినీతి అశ్లీలత అసభ్యతలను చూపి భావిపౌరుల మెదళ్లను పాడుచేయవద్దు'' అని వినయపూర్వకంగా ఈ పెద్దలు కోరుతున్నారు. నేటి సాంఘిక వాతావరణం కుళ్లిపోయిన సంగతి అందరికి తెలిసినదేగదా! ప్రతి పొరట క్రింద అర్పిస్తే వ్రాసిన చక్కటి బాలురను గూర్చిన సూక్తులు చేర్చబడి ఉన్నవి. పాప నవ్వులో ప్రకృతి పులకరిస్తుంది; నేడు పిల్లలు నవ్వితేనే రేపు జాతి నవ్వుతుంది; బాలభానుడు చీకటిని తొలిగిస్తే బాలలు దుఃఖాన్ని తొలగిస్తారు; పువ్వులు పొదరింటికి అందమైతే పిల్లలు ప్రపం చానికే అందం; నీటి బొట్టులో మహాశక్తి ఉన్నట్లే బాలల బ్రతుకులో జాతి శక్తివుంది.

''చిన్నారి నవ్వు'' ''పువ్వు–నవ్వు'' శీర్షికలు అకళంక ఆనందమయ శిశుహాసాన్ని మంచిగా వర్ణిస్తున్నవి. ''జాతిమొగ్గలు'' బాలబాలికలు ఆచరించవలసిన దినచర్యను, పాటించవలసిన విధులను చెపుతున్నది.

ఇది అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా ప్రచు రింపబడినది; ఔచిత్యపూర్ణము.

## సమాజానందస్వామి

[కార్టూన్ కవితలు. దేవిప్రియ. డెమ్మి, 64 పేజీలు; వెల : 5 రు; ప్రతులకు : దేశిబుక్ హౌస్, నారాయణగూడ, హైదరాబాదు–500024.]

వ్యంగ్యరచన వక్రోక్తి మనకున్న సాహిత్య ప్రక్రియలే. కాని, ఇంగ్లీషులో ఇది ఒక మహా కళగా మారింది. వికటకవి — ఎటుతిప్పి చదివినా ఒకటే అయినట్లు, ఇట్టి కవి వ్రాతలుగూడ ఎటుతిప్పినా దెబ్బలే. ఈ లక్షణం వేమనయోగి తర్వాత వేణుగోపాలశతకం, కవి చౌడప్ప శతకాలచే కొల్లగొట్టబడినది. కొంటెమాటల రామలింగని కున్నంత ఖ్యాతి ఇతరు లెవరికైనా ఉన్నదా? అంటే — వ్యంగ్యానికి ప్రాణమున్నదనుట. ఒంటికి తగిలిన దెబ్బల గాయాలు మానతవి గాని, మనసులోని పుండు సులభంగా మానదుగదా! కాబట్టే వ్యంగ్య రచన వేషధారుల పాలిటి వజ్రాయుధం. ఇప్పుడు పత్రికలలో వచ్చే కార్టూనులు ఒకకాలం మ్యాటరుకు వ్యాఖ్యానంగా ఉంటున్నవి.

ఈ దేవిప్రియుని కార్టూన్ కవితలు పాఠకునికి ప్రియంగా ఉన్నవి. సమాజానందస్వామి అన్నపేరే నేటి ప్రపంచ రీతులనే కొప్ప రిస్తున్నది. వక్రచిత్ర శీర్షికలు దొంగస్వాములను, కుటిల రాజకీయా లను, లంచగొండితనమును, ఇల్లాండ్ర సినిమాపిచ్చిని, సినిమా నటీ నటకులను చావుదెబ్బ కొట్టుతున్నవి. విషయానికి తగిన భాష కొరడా దెబ్బలు. ముఖచిత్ర స్వాములవారి ధూపమే పుస్తకం లోపలి సరుకు రుచి చూపిస్తున్నది. పట్టణాలలో తిరుగాడే పశువులను వర్ణించను, పోలీసు కాన్‌స్టేబుల్ నడివీధిలో పండుకొనిఉన్న ఒక పసరంమీద కూర్చొని ట్రాఫిక్ కంట్రోల్ చేస్తున్నాడు; ఇది ఆబు, లక్ష్మన్ కార్టూనులవలె నున్నది.

ఆడపడుచు సిగ్గు చిమడబెట్టుకొని, అంగమొలల అందాన్ని పావలా టికెట్ రసికులకు అమ్ముకొనే సినిమా నటిని చూడండి:— జోతిలచ్మి తొడలందాలు, అబ్బా! ఎంత చక్కటి సిన్మా! తెలు 'గోడా' నీదే జన్మ; సెంటుకంటె విలువైంది కిరసనాయిలు; ''బిరుద వరద''ను గురించి ఏకి పారవేస్తున్నాడ; గంజికీ గతిలేని

బతుకు—గోచిగుడ్డకు కూడా అంగుళానికో అతుకు; కృత్రిమ సాను భూతి చూపే రాజకీయ నాయకుల సంగతి వినండి:— హెలికాప్టర్ మీదినుంచి సానుభూతి జల్లు తడిసి కూలిపోతున్నయ్ మిగిలి ఉన్న ఇళ్లు; గోవర్ధన మెత్తితే యేం గొప్ప, మన సిటీబస్ ఒకసారి ఎక్కి క్షేమంగా దిగితే చాలు; లాల్చీల్లో సూట్లల్లో చెప్పుల్లో బూట్లల్లో రకరకాల మృగాలు—అని, నేడు జనం వెర్రెత్తినట్లు అమెరికా హిప్పీల అలంకరణాలను అనుకరించడాన్ని బాగా అపహాస్యం చేస్తున్నాడు. పందిని "బురదేశ్వర" అని మార్చగలిగిన భాషా చమత్కారాలుగూడ ఈ రచనలో గలవు. తనది కుల నిర్మూలన సంఘమంటూ కులం పేరిట ఓట్లు అడిగే రాజకీయ వేషధారులను (42 పేజి) విమర్శి స్తున్నాడు. నేటి తెనుగు సినిమా సంగీతాన్ని క్రిందుచేస్తున్నాడు. సినిమా సంగీతం నిజంగా అరవంలో హిందీలోనే వినాల.

## జనగీతం

[కె. పద్మారావు. డెమ్మి, 40 పేజీలు; ధర : 3 రు; ప్రతులకు : గ్రంథకర్త, సంస్కృత కళాశాల, పొన్నూరు, గుంటూరు జిల్లా—522124.]

కవి వ్రాసినదంతా కవితకాదు, కాని కవిత వ్రాసిన వారంతా కవులే—అన్న సంజీవదేవుని నిర్వచనం ఆమోదయోగ్యం. కవి వ్రాసిం దంతా కావ్యమనే వాదం నిలువదు; చివరకు రమ్యపదమే కావ్య మంటున్నారు. ఈ కొలతకందే రచనలు ఎన్ని ఉన్నవో ఇక, పది పది హేనేండ్లు పోతేగాని తేలదు.

ఈ జనగీతం అభ్యుదయానికి స్వాగతం. ఈ కవికి అర్థ వంతమైన గంభీర అనుప్రాస కుదిరి ఉన్నది; శైలి మధురము. ఈ రచనలోని కమ్మటి సంస్కృత సమాసాలు "ప్రజల భాష" కాదంటాడు—ఒక మిత్రుడు, ఈ గ్రంథపీఠికలో. పాతచింతపండు అనే సంస్కృతానికి బదులు, తెనుగుపదం వాడితే బూజుపట్టిన బాస అంటారు; ఇక వీరికి ఇంగిలీసు ముక్కలే గతి ఏమో! ఎదిగే భాష పాత పదాలను వదలక కొత్త పదాలను చేర్చుకొంటుంటేనే గదా పెరిగేది. సంస్కృతమే వద్దంటే తమిళనాడు ద్రవిడ కళగం వారి వాదమవుతుందేమో! ఆ నాయకుడు — కరుణానిధి తనపేరు మార్చుకోలేదు.

ఈ కవి హేతువాదం నాస్తికవాదం తట్టే మొగ్గుతున్నది. హేతువాదం చేసి, మూఢాచారాలపై పిడుగులు కురిపించిన వేమన యోగి నాస్తికుడుకాదు. ఈయన—సీత పరిపూర్ణదేహ—అనగలిగిన సంస్కారి. జాషువాను గురించి మంచి పొగడ్తలున్నవి. కొత్త పాతల మధ్య వంతెనగా ఉన్నది—ఈ రచన.

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామరెడ్డి

## తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ సాహిత్య విమర్శన గ్రంథము

[రచన : కోడూరి శ్రీరామమూర్తి. ప్రచురణ : కిరణ్ కిశోర్ పబ్లికేషన్స్, శ్రీమతి కోడూరి భారతీ శ్రీరామ్, పోస్టాఫీసు రోడ్, బొబ్బిలి, విజయనగరం జిల్లా అన్న చిరునామా నుంచి ఈ గ్రంథాన్ని పొందవచ్చును. పేజీలు 272. వెల: ఇరవై రూపాయలు]

'నిన్ను నీవు తెలుసుకో' అన్నాడు సోక్రటీసు. విజ్ఞానశాస్త్ర రీత్యా మనిషి ఎంత ప్రగతిని సాధించినా — అతడు తనకు తాను సమస్యగానే మిగిలిపోతున్నాడు. మానవుడి విజ్ఞానానికి అదొక అవధి అయింది. అందువలన మనిషి తనను తాను అర్థం చేసుకోవటం కన్నా గొప్ప విషయం మరొకటి వుండబోదు. మనస్తత్వశాస్త్రమూ, ఆ శాస్త్రాన్ని ఆలంబనగా చేసుకొని వచ్చిన సాహిత్యమూకూడా కృషి చేసేది ఈపరమార్థాన్ని సాధించేటందుకే. కాదనేదిలేదు. అయితే-

'సాహిత్యానికీ, సామాజిక ప్రయోజనానికీ విడదీయరాని బంధం వుంది. అందువలన ప్రజా సాహిత్యానికే ప్రాముఖ్యత వుంది. ప్రజా సాహిత్యమంటే ప్రజలని గుర్తించేది. ప్రజలకి మంచిచేసి, వారికి అవసరమయ్యేది అందువలన ప్రాథమిక సాంఘిక సమస్య అయిన వర్గ స్వభావాన్ని తెలుసుకోకుండాచేసే 'అర్థవంతమయిన రచనలు' కూడా ప్రజాసాహిత్యం కానేరవు. వ్యక్తివాదం వర్గ స్వభా వాన్ని దాచే ముసుగు మాత్రమే. వ్యక్తివాదులు మార్పుని వ్యతిరే కిస్తారు. సాహిత్యానికీ సమాజానికీ రాజకీయాలతో వుండే 'సంబం ధాన్ని' తెలుసుకోలేకపోతే రచయిత శక్తి సమాజానికి వుపయోగ పడదు. అందువలన వ్యక్తి వాదంతో కూడిన మనో వైజ్ఞానిక నవలలు 'బూర్జువా నవల'లు. మనిషి తన కనీసావసరాల్ని తీర్చుకో లేక అలమటిస్తూవున్న సమయంలో, ఆసమస్యల పరిష్కారమార్గాన్ని వదిలేసి, తనకు తెలియకుండా 'అచేతన' లో దాగివున్న సమస్యల గురించి బుర్రలు బ్రద్దలు కొట్టుకుని చీకట్లో చిందులాడుతూ, మనో వైజ్ఞానిక నవలల్ని రాయవలసిన అవసరమేముంది? ఇది ముఖ్యమయిన ప్రశ్న.

ఈ ప్రశ్నకి — మనో వైజ్ఞానిక నవలలని కేవలం 'ప్రయో జనపు' కొలబద్దతో కొలవలేము !! సంఘంలోని ప్రజల సామూహిక సమస్యలు ఎంత ముఖ్యమైనవో ఆ సంఘంలో భాగమైన వ్యక్తి అంతరంగ సమస్యలు కూడా, అంత ముఖ్యమయినవే (?) అన్న విమర్శక రచయిత సమాధానంలో అంత 'పస' అగుపించదు. పాత్రల మనో విశ్లేషణ అన్నది నవలా రచనలో ముఖ్యమైన స్థానాన్ని ఆక్ర మించుకున్నది గదా అనటం మాత్రాన మనో విశ్లేషణా ప్రధాన మయిన నవలల ప్రాముఖ్యతని వివరించలేకపోయారు రచయిత. అందువలన రచయితయొక్క ఆ సమర్థన తేలిపోతుంది.

"మనో వైజ్ఞానిక నవలలకు 'వ్యక్తి' ముఖ్యమయినంత మాత్రాన సంఘం ఎదుర్కొంటున్న సమస్యలు వీటిలో నిర్లక్ష్యం

చెయ్యిబడతాయని అనుకోవలసిన అవసరం లేదు. మనో విశ్లేషణా ప్రధానమయిన రచనలు చేసే రచయితలు సామాజిక సమస్యం పైనా తమ దృష్టిని ఫోకస్ చేయవచ్చును." అన్న రచయిత వాదనలోని బలహీనత స్పష్టంగా కానవస్తున్నది ఇంత పెద్ద విమర్శనా గ్రంథంలో — సాంఘిక సమస్యను నిర్లక్ష్యం చేయకుండా, ఆ సమస్యల పైనా, సామాజికవ్యవస్థా వికృతాకృతులపైనా, తమదృష్టిని బాగా ఫోకస్ చేసిన మనో వైజ్ఞానిక నవలల దృష్టాంతాన్ని చూపించలేక పోయారు రచయిత.

అందువలన — సామాజిక ప్రయోజనం దృష్ట్యా మనో వైజ్ఞానికమయిన నవలలు ఒక్కీవంతనుయినవి కావు. మనిషియొక్క విభిన్నమయిన ప్రవృత్తులలో మానవ మనస్తత్వమున్నది. ఈ మనస్తత్వాన్ని, అందుకు కారణమయిన వాతావరణాన్ని విశ్లేషించటమే ఈ తరహా నవలల ధ్యేయం. ఈ పనిని ఇవి ఒక ప్రత్యేకమయిన ధోరణిలో — నెరవేరుస్తాయి. మనిషి తనని తాను తెలుసుకొనే 'ప్రయోజనా'న్ని నెరవేరుస్తాయి ఇవి. ఈ 'ప్రయోజనాన్ని' ఇవి ఎంతవరకు నెరవేర్చాయి అన్న కొలమానాన్ని ఉపయోగించి ఇటువంటి నవలలకి విలువను నిర్ణయించవలసి వుంటుంది—అనవచ్చును. ఆత్మ పరిశీలనాత్మకమయిన, ఆత్మక్షోభతో కూడిన 'అన్వేషణ'మనో వైజ్ఞానికమయిన నవలల ప్రధాన లక్షణం.

తెలుగు నవలా పరిణామంలో విశ్వ సాహిత్యం యొక్క ప్రభావం వుందంటారు రచయిత. 16వ శతాబ్దంలో అవిర్భవించిన 'కాల్పనిక' నవలలు, ఆ తర్వాత 19వ శతాబ్దంలో ప్రవర్తిల్లిన 'రియలిస్టిక్' నవలలు, నేచురలిస్టు నవలలు — వాటిని ఖండించే 'సింబాలిజము' గలిగిన నవలలూ ఆనాటి సాహిత్యంగా చలామణీ అవగా — విశ్వ సాహిత్యంలో రెండు ధోరణులు ప్రధాన స్థానాన్ని ఆక్రమించాయి 20వ శతాబ్దపు తొలి దశాబ్దాలలో. అవే ఇప్పటికీ చలాయిస్తూ వున్నాయి.

అవి 1) అస్తిత్వ దం 2) మార్క్సిజమ్

వ్యక్తికీ, వ్యవస్థకీ తరతరాలుగా జరుగుతున్న పోరాట ఫలితంగా అస్తిత్వవాదం పుట్టుకొచ్చింది. అస్తిత్వ వాదానికి వ్యక్తి ముఖ్యం. అందర్నీ ఒకే మూసలోపోసే పద్ధతికీ, అందరి విలువల్నీ ఒకేరీతిలో కొలిచే ధోరణికీ ఇది వ్యతిరేకం. ఈ సిద్ధాంతం ప్రకారం మానవునికి తన ఇష్టప్రకారం ఆలోచించుకొనడానికీ, అనిశ్చితమయిన విషయాలలోంచి ఏదో ఒకటి ఎంచుకొనటానికీ — దేనినీ ఎంచుకొనకపోవటానికీ స్వేచ్ఛ వుంది. జీన్ పాల్ సార్త్రే ఈ వాదాన్ని వివరిస్తూ మనిషి తనలో తాను వుండటానికీ, తన కోసం తాను వుండటానికీ గల భిన్నత్వాన్ని గురించి చెప్పాడు. నవలలు వ్రాశాడు.

మార్క్సిజమ్‌లో వ్యవస్థకివున్న ప్రాధాన్యత వ్యక్తికిలేదు.

అస్తిత్వవాద ప్రధాన సూత్రం కార్యకారణ భావ శూన్యత. జీవితంలోనూ, అంతరంగంలోనూ అసంబద్ధత దీని లక్షణం.

కలవాంకీ లేనివారికీ మధ్య నానాటికి పెరిగిపోతున్న అగాథం మేధావుల ఆలోచనలలో మార్పు తే మార్క్సిజమ్ ప్రభావం వ్యాప్తి చెందింది. వర్గ సంఘర్షణల గురించి, సమకాలిక జీవిత చిత్రణల గురించి చర్చ జరిగిన వాటిలో ఒక గొప్ప ఆదర్శం ప్రతిబింబించిన మార్క్సిస్టు ధోరణిలో వచ్చిన నవలల వలన విశిష్ట సాహిత్య ప్రయోజనం సమకూరడం ప్రారంభమయింది. మాక్సిమ్ గోర్కీ నవలలు ఇందుకు ఉదాహరణ అనవచ్చును.

విశ్వ సాహిత్యంలో వచ్చిన ఈ పరిణామాలు- తెలుగు నవలా సాహిత్యం పైన ప్రత్యక్షంగానో పరోక్షంగానో తమ ప్రభావాన్ని చూపాయి. చూపుతున్నాయి. కాగా—

ఈ గ్రంథంలో మనో విశ్లేషణ పయిన కొందరు ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన సిద్ధాంతాలు — మనో వైజ్ఞానిక నవలలపై వాటి ప్రభావమును గురించిన వివరణా వున్నది.

జంతు ప్రవృత్తిగల, ఆదిమ భావాలుగల 'Id', తార్కిక భావాలకు ప్రతీక అయిన 'Ego', ఇగో మీద యాజమాన్యం వహించే 'Super Ego' ల గురించీ, అచేతన మనస్థితీ, దాని అణచివేతా, ప్రతిఘటనా, లైంగిక ప్రవృత్తి ప్రాముఖ్యతా, ఈడిపస్‌కాంప్లెక్సూ గురించిన ఫ్రాయిడ్ సిద్ధాంతాలూ —

ఆత్మ న్యూనతా భావనా, ఆత్మ ఆధిక్యతా భావనా, వీటి సమ్మేళనమూ, సంపూర్ణతా గురించిన ఆడ్లర్ సిద్ధాంతాలూ -

వైయక్తిక అచేతన, సామూహిక అచేతనలూ, 'లిబిడో', అంతర్ముఖంగా వుండే 'ఇంట్రోవెర్ట్', తద్విరుద్ధంగా వుండే 'ఎక్స్ట్రోవెర్ట్'-వాటి సంఘర్షణా ఫలితమయిన 'న్యూరోసిస్' గురించిన యూంగ్ సిద్ధాంతాలూ —

మనస్తత్వశాస్త్రంలో ప్రధానమయినవీ, మనో వైజ్ఞానిక నవలలకు అవసరమయినవి అయినందున-వాటిని గురించిన సమగ్రమయిన వివరణ ఈ గ్రంథంలో ఇవ్వబడింది.

తరువాత- సంప్రదాయ పద్ధతిలో వచ్చిన నవలల్ని, చైతన్య స్రవంతి ధోరణిలో వచ్చిన నవలలు ఎలాగ రూపొందించారన్నయన్న విషయమూ వివరింపబడింది.

ఈ చైతన్య స్రవంతి ధోరణి మనోవైజ్ఞానిక నవలల ధోరణికి ప్రాతిపదిక. ఈ రకం రచనల్లో పొందిక వుండదు. సభ్యత అసభ్యత అనేది భావాలకు అక్కరలేదు. ఆయా వాక్యాలు కర్త, కర్మ, క్రియలు లేక అయోమయంగా వుండగలవు. తుదీ మొదలూ లేకుండా వుండే ఈ భావాలు సామాన్య పాఠకునికి అందనవసరం లేదు. జేమ్సు జాయిస్, వర్జీనియా వుల్ఫ్‌లు ఈధోరణిలో అందించిన రచనల వివరణ బాగా వుంది. వీరేగాక ఆల్డస్ హక్స్లీ, సామ్యూల్ బకెట్ రచనల్లో మనోవైజ్ఞానిక సిద్ధాంతాల ప్రభావం వివిధరీతుల్లో వుండటం గమనించిన కొందరు తెలుగు నవలాకారులు కొన్ని మంచి మనోవైజ్ఞానిక నవలల్ని అందించటం జరిగింది.

కందుకూరి, చిలకమర్తి, అడివి బాపిరాజు, శ్రీపాద, జి.వి. కృష్ణారావుల నవలలలో, మనస్తత్వశాస్త్రానికి సంబంధించిన వివిధ విషయాలు రకరకాలుగా చోటు చేసుకోగా — విశ్వనాథ, చలం, బుచ్చిబాబు, గోపీచంద్, రా. వి. శాస్త్రిగారల నవలలలోని ప్రధాన పాత్రల గురించిన విశేష మనస్తత్వ విషయాల గురించిన ప్రత్యేక వివరణ ఇవ్వడం — ఈ గ్రంథంలో జరిగింది.

విశ్వనాథ వారి నవలల్లో ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ — సిద్ధాంతాలకు సంబంధించిన అవగాహన వుందంటారు రచయిత. ఏకవీర, చెలియలికట్ట, వేయి పడగలు నవలలలోని పాత్రల మనస్తత్వాన్ని గురించి వివరణ ఇచ్చారు. వీరి నవలల్లో మనస్తత్వ విశ్లేషణకు సంబంధించిన స్థూల దృష్టిని గమనించి, వివరిస్తారు రచయిత.

చలం 'నేను, నాది' అన్న సంకుచిత భావాలకు విరోధి వ్యక్తికీ అతనిలోని 'పొసెసివ్ ఇన్‌స్టిన్‌క్ట్' కీ ఘర్షణ జరగటం వారి నవలల్లో గమనించగలము.

అమీనా, జీవితాదర్శం, మైదానం, బ్రాహ్మణీకం నవలల్లోని స్త్రీ పాత్రల్లో పురుషుని 'పొసెసివ్ ఇన్‌స్టిన్‌క్ట్' తో ఘర్షణలూ, స్వేచ్ఛ కోసం పోరాటాలూ జరిపి, చివరికి నశించిపోయే ధోరణి, పొయెటిక్ ప్రోజ్‌లాగా కనపడే శైలిగల చైతన్య స్రవంతి విధానం ద్వారా వెల్లడి చేయబడుతుందంటారు.

బుచ్చిబాబు నవల 'చివరకు మిగిలేది' తెలుగులోవచ్చిన మనోవైజ్ఞానిక నవలలలో అతి ముఖ్యమయిందంటారు — రచయిత. అస్తిత్వవాద ధోరణిలో నడిచిన ఈనవలలో 'ఈడిపస్ కాంప్లెక్సు' సిద్ధాంత ప్రభావము కన్పడుతుంది. అచేతనలోని 'ఇన్‌సెస్ట్ సెంట్స్'కు పాత్ర చిత్రణలో చక్కగా చోటు కల్పించబడుతుంది. పాత్రల అంతరంగిక సంక్షోభాలు సమర్థంగా చిత్రించబడతాయి. పాత్రల అంతరంగపు లోతులను తరచి కథ నడపడంలో బుచ్చిబాబు ప్రశంసనీయమయిన నైపుణ్యాన్ని చూపిన ఈ నవల అంతర్జాతీయ ప్రమాణాలతో వెలువడిన గొప్ప మనో వైజ్ఞానిక నవల—అంటారు శ్రీ శ్రీరామమూర్తి.

గోపీచంద్ నవల అసమర్థుని జీవయాత్రలో గొప్ప తాత్విక భావనా, మంచి మనో విశ్లేషణా వున్నాయి. 'ఎందుకు' అనే ప్రశ్న మనిషిచేత మంచిపనులు చేయించటానికి సహాయకారకంగాపుట్టింది. రీజన్‌కన్నా ఇంట్యూషన్ ప్రధానం — అని చివరకు సీతారామారావు గ్రహిస్తాడు. వారసత్వంగా వచ్చిన భావాలమధ్య సంఘర్షణా, హేతు జ్ఞానానికీ, సహజ జ్ఞానానికీ మధ్య ఘర్షణా, ఆదర్శానికీ ఆచరణకీ మధ్య ఘర్షణా జరిగి అతను 'ఆత్మన్యూనతా భావం'లో నలిగిపోతాడు. ఒక అసమర్థుడి ఆత్మన్యూనతా దృక్పథంలో మంచి తాత్విక చింతనపు లోతులను స్పృశించి అంతరంగ మథనాన్ని కావించిన ఈ నవల ఒక గొప్ప మనో వైజ్ఞానిక మయిన నవల అని అంగీకరించటానికి ఎవరూ సందేహించరు.

రా. వి. శాస్త్రిగారి అల్పజీవి నవలలో పిరికివాడి మనస్తత్వం అందుకుగల కారణాలతో సహా కన్పడుతుంది. ఆ కారణాలు కూడ ఆడ్లర్ సిద్ధాంతాలకు సన్నిహితంగా వుంటాయి. ఈ నవలా నాయకుడు సుబ్బయ్య ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సుతో సతమతమవుతాడు. పగటి కలలు కంటాడు. వాటిలో 'కాంకరింగ్ హీరో డ్రీమ్సూ', 'సఫరింగ్ హీరో డ్రీమ్సూ', వుంటాయి. సుబ్బయ్య అంతరంగంలో చెలరేగే సంక్షోభాలకు అద్దం పట్టడానికి రచయిత చైతన్య స్రవంతి విధానాన్ని (స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్) బాగా వుపయోగించుకున్నారు.

పైన పేర్కొనబడిన గొప్ప నవలల రచయితలేగాక—జేమ్స్ జాయిస్ ధోరణిలో నవీన్, వినుకొండ నాగరాజు, పరిమళాసోమేశ్వర్ తదితరులు చైతన్య స్రవంతి ధోరణిలో మనోవిశ్లేషణాత్మక నవలలు అందించే ప్రయత్నం చేయగా, అనేకంగా తెలుగు నవలాకారులు సంప్రదాయ ధోరణిలో నవలను వ్రాసి, అవసరానుగుణ్యంగా పాత్రల అంతఃకరణను తెలుపటానికి చైతన్య స్రవంతి విధానాన్ని వుపయోగించుకున్నారంటారు ఈ విమర్శకులు. వడ్డెర చండీదాస్ గారి హిమజ్వాల ఇటువంటి రచన అంటారు.

తెలుగు సాహిత్యంపై ఫ్రాయిడ్ ప్రభావం పడటంతో— చైతన్య స్రవంతి విధానం అనేక సందర్భాలలో తెలుగు నవలలలో తొంగి చూసింది. మనోవిశ్లేషణాత్మక గుణప్రధానమయిన ఇటువంటి రచనలను పఠించటం చాలా కష్టం. సామాన్య పాఠకుడు ఇదంతా గందరగోళం, వట్టి చెత్త అనుకునే ప్రమాదంవుంటుంది. ఉద్రిక్తతకులోనై సంక్షోభానికి గురయిన మనుషుల ఆలోచనల 'డిసార్డర్'ను పాఠకులముందుంచటం చైతన్య స్రవంతి విధానపు లక్ష్యమయితే—సమర్థంగా ఈ లక్ష్యాన్ని సాధించడానికి జీవితానుభవమూ, భావవ్యక్తీకరణశక్తీ, రచనా సామర్థ్యమూ రచయితకు వుండాలనీ, వీటిలో ఏది కొరవడినా ఆ విధానం నవ్వుల పాలవుతుందనీ అనవచ్చును. మనిషి చేతనపైవున్న పొరను తొలగించి, అచేతన అగాధాలలో దాగివున్న నమ్మలేని నిజాలని వెలికితీసి, మనిషిలోని మరో మనిషిని మనముందు వుంచేందుకూ, అతని మనస్తత్వాన్ని సమగ్రంగా పరిచయం చేసేందుకూ చైతన్య స్రవంతి విధానం వుపకరిస్తుందంటారు విమర్శకులు. ఆ ప్రయోజనం నెరవేరనినాడు, ఆ పేరుతో చలామణీ అయ్యే అన్ని రచనలూ కేవలం పిచ్చిరాతలే అనాలి. ఈ పుస్తకంలో—మానవ మనస్తత్వంలోని వైచిత్రిని వెల్లడించే సాంసారిక జీవితంలోని ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు, సుపీరియారిటీ కాంప్లెక్సులూ, స్త్రీ విమోచన నుద్దేశించిన ప్రయత్నాల లోని కొన్ని విపరీత ప్రవృత్తులు రంగనాయకమ్మగారి నవలల్లో ఎలాగ చిత్రించబడినాయన్న వివరణ ఇవ్వబడింది. రంగనాయకమ్మ పాత్రలన్నింటిలోనూ 'కాస్ట్రేషన్ కాంప్లెక్సు' ఫలితంగా వచ్చిన ఆత్మన్యూనతాభావమూ, 'డయానా కాంప్లెక్సూ' చోటు చేసుకుని వికృతరూపం దాల్చిందంటారు. రచయిత్రి కసి విపరీతంగా చెలరేగిందంటారు. కసి రగుల మిగిలేది...?

ఈ విధంగా—తెలుగు నవలా సాహిత్యంపై ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ మొదలయిన ప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రవేత్తల సిద్ధాంతాల ప్రభావము, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వుందన్న శాస్త్రీయ విశ్లేషణ కావించిన విమర్శక రచయిత—అసలు ఈ మనో వైజ్ఞానిక నవలలు బూర్జువా నవలలనీ, వాటి వుత్పత్తి పెరుగుదలా ఆధునిక వర్తమాన సమాజానికి అనావశ్యకమనీ అన్న మాటని సమర్థంగా ఖండించలేకపోయారు. అందువలన-ఎంతో శ్రమపడి, ఎన్నో పుస్తకాల్ని తరచి చూసి ఇంత మంచిపని చేసిన రచయిత (విమర్శకులు) కృషి ఫలితమయిన ఈ 'బృహద్గ్రంథం'యొక్క ప్రయోజనాన్ని గురించిన సందేహం పొడసూపక మానదు.

ఈ పుస్తకంనిండా ఎన్నో అచ్చు తప్పులు వున్నాయి. ఇటువంటి 'శాస్త్రీయమయిన' గ్రంథాలలో అటువంటివి పరిహరింపబడాల్సిన అవసరం చాలా ముఖ్యమనాలి. కేవలం 'కేటలాగులవంటి పుస్తకాల'కి బహుమతులనందజేయకలిగిన సాహిత్య అకాడమీవారు బృహత్తరమయిన కృషీ, సమర్థతా, పాండిత్యమూ పెట్టిన సొమ్ములుగా కలిగిన ఈ పుస్తకానికి బహుమతిని అందించటం అన్న విషయం ఆశ్చర్యంతోపాటు ఆనందాన్ని కూడా కలిగించుతుంది! తెలుగులో అరుదుగా వచ్చిన మంచి విమర్శనా గ్రంథాలలో ఇది ఒకటి అన్నమాట. రచయితకి అభినందన పురస్కారమే అవుతుంది.

*శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు*

## కుల నిర్మూలన ఎలా ?

[రచన: జె. వీరాస్వామి, వెల : పదిరూపాయలు, ప్రతులకు: ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ కులనిర్మూలన సంఘం, 7 1–617/A2, అమీర్‌పేట, హైదరాబాద్–500016.]

ఆంధ్రలో సంస్కరణోద్యమాన్ని కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించగా గురజాడ అప్పారావు, రఘుపతి వేంకటరత్నం, త్రిపురనేని రామస్వామి, ఉన్నవ లక్ష్మీనారాయణ, ఆవుల గోపాలకృష్ణమూర్తి, గోరావంటివారు ఆ ఉద్యమాన్ని ముందుకు కొనిపోవడానికి కృషిచేశారు. ఈ కృషి ఫలితంగా ఆంధ్రప్రదేశ్‌లో 1971లో కుల నిర్మూలన సంఘం రాష్ట్ర స్థాయిలో యేర్పడినది. ఈ సంఘం కార్యకలాపాలలో ఈ గ్రంథరచయిత శ్రీ జాగర్లమూడి వీరాస్వామి చురుకుగా పాల్గొంటున్నారు. ఈ ఉద్యమం లక్ష్యం కులాలు లేకుండా చేయడమని ఈ గ్రంథం పేరునుబట్టీ, అందులోని విషయాలనుబట్టి అనుకొనడం తప్పుకాదనుకుంటాను. ఈ లక్ష్యాన్ని సాధించేందుకు 1975 ఏప్రిల్‌లో కులనిర్మూలన రాష్ట్ర సంఘం వార్షిక మహాసభ జరిగింది. సర్వోదయ నాయకులు ప్రభాకర్‌జీ అధ్యక్షత వహించారు. ఈ వివరాలన్నీ యీ పుస్తకంలో వున్నాయి. సరే. అంతవరకూ బాగానే వున్నది. ఈ ఉద్యమం ఆశయం ఎన్నటి కయినా నెరవేరుతుందా? నెరవేరే అవకాశాలున్నవా ?

ఇలా ప్రశ్నించే వ్యక్తిని మితవాదిగా, కులవ్యవస్థను బలపరచే ఛాందసుడుగా పరిహసించి ప్రయోజనంలేదు. 'కులరహిత సంఘ నిర్మాణము' అనే ఉపశీర్షికని ఈ రచయిత వెలువరించిన వ్యాసంలోని "...ప్రస్తుతం అమలులో ఉన్న షెడ్యూలు కులాలు జాతుల తదితర వెనుకబడిన వర్గాలవారికి ఇస్తూవున్న రక్షణలను కొంతకాలం కొనసాగిస్తూ చేయవలసి ఉంటుంది" అన్నారు. ప్రత్యేక రక్షణలనూ, సౌకర్యాలనూ కొంతకాలం పొందే యేకులంవారూ, ఆ తర్వాత ఆ సౌకర్యాలను వదులుకొనడానికి ఇష్టపడరని అనుభవంలో తెలిసి రాలేదా? అయినప్పుడు ఈ సూచన ప్రయోజనం ఏమిటి ?

ఈ పుస్తకం 7వ పేజీలో "హిందూమత గ్రంథాలపై ఆధారపడినది వర్ణాశ్రమ ధర్మము కాగా కులవ్యవస్థ సాంఘిక అవసరాలకులోనైన ఏర్పాటు మాత్రమే" అని రచయిత అన్నారు. సాంఘిక అవసరాలు మారినప్పుడు కులవ్యవస్థ అవసరం లేనిపక్షంలో దానంతట అదే సహజంగా వాడిపోతుంది. వాడిపోతున్నది కూడా.

గతి తార్కిక భౌతికవాదం ప్రకారం మన షుల అవసరాలకు ఉపయోగపడని వ్యవస్థలో అంతరించక తప్పదుగదా. అదే నియతివాదం అంటారు. ఇంత ఎందుకు చెప్పవలసి వస్తున్నదంటే కులాలు అంతరించాలి అని అదే పనిగా ఇంతకాలం నినాదాలు ఇచ్చిన పర్యవసానంగా నేడేమో కులతత్వం ఆనాటి కానాటికి ఇంకా యింకా బలపడుతున్నట్టుకనిపించుతుంది. అది అలా వుండగా అంతరించాల్సినది కులవ్యవస్థయా లేక కులాల పట్టింపులూ, ఆవేశ కావేశాలూ, అహంకారాలూనా? పని విభజన పద్ధతిలో కులాలుండి ఒక కులంవారు మరొక కులంవారితో సామరస్యంగా వ్యవహరించే పద్ధతి వాంఛనీయంకాదా?

ఇలాంటి నిత్యసమస్యల సంగతి ఎలావున్నా ఇది మంచి పుస్తకమే. రచయిత అవిరళకృషిని పరిచయం చేయడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది. యువకులు—సాంఘిక సమస్యలు, సాంఘిక విప్లవము—ప్రజలు, ప్రభుత్వము, సమాజము, కులము, సాంఘిక ప్రగతి, కులరహిత సమాజమువంటి వ్యాసాలలో ఈ రచయిత పెక్కు మంచి విషయాలనే చర్చించారు. ఈ పుస్తకం 127వ పేజీలో యీ రచయిత చేసిన సూచనలు పరిశీలించదగినవి. అయితే ఒక కులంవారు మరొక కులంలోని వారిని వివాహమాడినా, లేక మాంసాహార విధానాన్ని అందరూ అనుసరించినా కులాలు పోతయ్యా! వివాహం చేసుకొనవచ్చు. అయినా తన కులమే గొప్పదన్న పట్టింపు ఉండవచ్చు. అలాగే మాంసాహారం అలవాటు చేసుకొనవచ్చు. అదేమంటే ఆరోగ్యంకోసం అని వాదించవచ్చు. కుల పట్టింపు పోకపోవచ్చు. కాబట్టి కులాలు పోవాలంటే వివాహాలూ, మాంసాహారంకంటే అందుకుతగిన విద్య, సంస్కారం ప్రజలకు అలవడాలన్న సూచన ఒకటి ఉన్నది.

కుల నిర్మూలన ఎలా? అనే ఉపశీర్షికకింద యీ రచయిత చేసిన 17 సూచనలూ గమనించదగినవే. సంఘ సంస్కర్తలందరూ పరిశీలించదగినవే. ఇది మంచి పుస్తకాలలో ఒకటి. సంఘసేవకులూ

తదితరులూ చదివి ఆలోచించవలసిన పెక్కు అంశాలు ఇందులో ఉన్నాయి.

## సమానతా నువ్వెక్కడ?

[వెల : అయిదు రూపాయలు, ప్రచురణ : 21స్ట్ సెంచరీ రైటర్స్, విశేష ప్రచురణ, 26-3-22, దాసన్నపేట, విజయనగరం-531202 ]

21స్ట్ సెంచరీ రైటర్స్ సంస్థ అయిదవ వార్షికోత్సవం సందర్భంగా 'ఇనీక్వాలిటీ ఎమాంగ్ మాన్‌కైండ్ : కాజెస్ అండ్ వేస్ అవుట్' అనే అంశం గురించి చర్చ 1978 ఏప్రిల్‌లో జరిగింది. అందులో పాల్గొన్న వక్తల ప్రసంగాలను ఈ సంకలనంగా ప్రచురించారు. శ్రీయుతులు మహీధర రామమోహనరావు, పుప్పాల చిట్టి సాయిబాబు, గంటి శ్రీరామమూర్తి, గుంటుపల్లి రామారావు, మంధా వెంకటరమణరావు, అడవికొలను పార్వతి, కె. వి. రమణారెడ్డి, మల్లాది వెంకటసుబ్బమ్మ, అల్లం రాజయ్య, ఎమ్. వి. రామమూర్తి, జ్వాలాముఖి, నిష్టల వెంకటరావుగారు ప్రసంగాలున్నయ్ ఈ సంకలనంలో. వీరందరూ సాహిత్య ప్రపంచానికి బాగా తెలిసిన వారే. వారి వారి అభిప్రాయాలను స్పష్టంగా వెల్లడించారు ప్రసంగాలలో. శ్రీ మహీధరరామమోహనరావు కమ్యూనిస్టు రచయిత. సాహితీపరుడు. అయినా సాహితీపరుడుగా కాక కమ్యూనిస్టుగానే యీ విశ్లేషణ జరిపి ''ఉత్పత్తి సాధనాలూ, ఉత్పత్తీ ఈ దశ వరకూ పెరగడానికి తోడ్పడిన సామాజికము లయిన ఏర్పాట్లు (వ్యవస్థ) మారాలి. అప్పుడు ఆ ఏర్పాట్లతో వచ్చిన అసమానతలూ పోతాయి'' అన్నారు. ''శాంతి, సౌఖ్యం, తృప్తి, ఆనందం మొదలయిన విలువలను సాధించాలంటే సమానత్వం అంతగా దోహదం చెయ్యదనే చెప్పాలి'' అని శ్రీ గంటి శ్రీరామమూర్తి అనడం సమంజసంగా ఉన్నది. ఈ అంశం గురించి విజ్ఞులు చర్చించడం అవసరం ''ఇన్ని అసమానతలకు మూలం ఆర్థికంగా అందరూ ఒకే విధంగా ఉండకపోవడం'' అని శ్రీ గుంటుపల్లి రామారావుగారి అభిప్రాయం. సమానతను సాధించడానికి శ్రీ మంధా వెంకటరమణారావు పన్నెండు సూచనలుచేశారు. వాటిని అమలుజరపడం ఎలాగో? ఎంతవరకూ సాధ్యమో హేతువాదులూ, సాంఘిక సంస్కర్తలూ, తత్త్వవేత్తలూ ఆలోచించవలసి వున్నది. అడవికొలను పార్వతి స్త్రీ సమస్యలు కొన్నింటిని చర్చించారు. సమానతా స్థాపనకు ఎంత సుదీర్ఘమైన గతిక్రమం వున్నదో శ్రీ కె. వి. రమణారెడ్డి తన ప్రసంగంలో వివరించారు. సంఘటనా విప్లవాయుత కార్యక్రమాలతో సమిష్టి కృషిని సాగిస్తే సమానత్వం సాధించగలం. కనీసం అసమానతలను చాలా వరకూ తగ్గించగలం అన్నారు శ్రీ ఎమ్. వి. రామమూర్తి, జ్వాలాముఖి, శ్రీ నిష్టల వెంకటరావు గారల ప్రసంగాలు ఈ సంకలనంలో ప్రథమస్థానం పొందుతాయి. విశేషించి శ్రీ వెంకటరావు ''సాధించడం ఇష్టంలేనివి – లేదా ఒకరి జీవితకాలంలో సాధ్యంకావు అనే ప్రణాళికలని ఉటోపియా (Utopia) అనేస్తారు. అన్నీ అనుకున్నట్లు జరగవు. అయినా ప్రయత్నం మానకూడదు కదా'' అన్నారు. ఇలా చెప్పటం చాలా బాగున్నది. సమానత్వం అంటే ఏమిటి? ఎందులో సమానత్వం? ఎవరికి సమానత్వం? ఇలాంటి ప్రశ్నలు వివిధ దేశాలలోనూ, వివిధ కాలాలలోనూ వుంటాయి. అవి అలా ఉండడమే అభ్యుదయానికి మార్గం వాటి సమాధానాలకోసం కృషిచేయడంలోనే మానవత వికసిస్తుంది. ఆ దృష్టితో యీ పుస్తకం అందరూ చదవాలి. చదివి ఆలోచించగలగాలి. ఆలోచించగలవారికి అంకితం ఇచ్చారు ఈ పుస్తకాన్ని. మంచిదేగదా.

**శ్రీ వి. ఎస్. అవధాని**

## శక్తి

[రచయితలు : సర్వశ్రీ కొమరవోలు వేంకటాచలపతిరావు, వేదాంతం మురళీకృష్ణశాస్త్రి, చామర్తి దుర్గాప్రసాద్. ప్రచురణ : పురోగామి (తెలుగు), ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, మద్రాసు – 36, పేజీలు : 112, (1979) వెల : మూడు రూపాయలు.]

గత రెండు మూడు దశాబ్దాలుగా భూగోళపు సహజ సంపదను విచ్చలవిడి వాడకం (విచ్చలవిడి వాడకం కూడా ఒక విధమైన దుర్వినియోగమే)నుంచి రక్షించాలనే తాపత్రయం అన్ని దేశాల్లోనూ కనిపిస్తోంది. ముఖ్యంగా గత అయిదారేళ్లుగా 'శక్తి' విషయంలో ప్రపంచ వ్యాప్తంగా చర్చలు మొదలయినయ్; కొన్ని పథకాలు కూడా వస్తున్నయ్ ఎంతో అభివృద్ధి చెందిన దేశాల్ని, యింకా యెంతో అభివృద్ధి చెందాల్సిన దేశాల్ని – అన్నిటికీ ప్రస్తుత శక్తి వనరులు కలవర పెడుతున్నయ్. పురోగామికూడా తన అయిదవ ప్రచురణగా తెలుగులో (?) 'శక్తి'ని వెలువరించింది; తనూ మరింత వెలుగులోకి వచ్చిందని కూడా చెప్పవచ్చు. ఈ ప్రచురణ ముఖ్యోద్దేశ్యం ''శక్తి వాడకంలో పొదుపు గురించి అందరూ అంతో యింతో తెలుసుకోవాలనే తపనతో వ్రాసిన వ్యాసాలను పదిమంది ముందు వుంచటం.'' ఈ వుద్దేశ్యానికీ యింధనపు నూనె వాడకాలలో ఆంధ్రప్రదేశ్‌కూ, ప్రక్కనేవున్న తమిళనాడుకూ మధ్యగల వ్యత్యాసాన్ని సూచించే అంకెలు (పేజి 12) వేసి 'పొరుగువాడిని చూసి

యేద్వవలదోయ్' అంటూ ఆంధ్రప్రదేశ్‌ను 'మరి' మేలుకోవోయ్ అని చెన్నపురి నుంచి చెప్పటానికి సమన్వయం అంత తేలిగ్గా దొరకదు.

'పురోగామి' ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, మద్రాసులోని కొంతమంది తెలుగువారిచే ఒక రకమైన సహకార ప్రాతిపదికపై తెలుగులో అనేక విషయాలపై పుస్తకాలను ప్రచురించే వుద్దేశ్యంతో స్థాపించబడిన సంస్థ. ఈ పుస్తకంలో డాక్టరు వేదాంతం మురళీకృష్ణశాస్త్రి, డాక్టరు చామర్తి దుర్గాప్రసాద్, శ్రీ కొమరవోలు వేంకటాచలపతిరావు గార్ల వ్యాసాలున్నయ్. వీరి రంగంలో శాస్త్రీయ పరిశోధన చేసినవారు; యింకా చేస్తున్నవారు కూడాను. ఇందులో కొన్ని వ్యాసాలు ఆకాశవాణి మద్రాసు 'బి' కేంద్రం నుంచి తెలుగు ప్రసంగ కార్యక్రమంలో ప్రసారం అయినవి **కూడాను.**

'శక్తి' ముఖ్యంగా యీ క్రింద చెప్పిన వాటి ద్వారా లభిస్తుంది : 1. బొగ్గు; 2. నూనె – చమురు బావుల నుంచి; 3. అణ శక్తి; 4. సౌరశక్తి; 5. వాయుశక్తి; 6. విద్యుచ్ఛక్తి; 7. భూగర్భ ఉష్ణశక్తి. ఈ వనరుల ప్రస్తుత పరిస్థితి, శక్తిని ప్రసాదించే యీ విధానాల ప్రభావం వాతావరణంపై యెట్లా వుంటుంది (వాతావరణ కాలుష్యం), వుత్పాదన కయ్యే మొదలైనవన్నీ వివరంగా యిచ్చారు.

'ఈ పుస్తకం పాప్యులర్ పద్ధతిలో కులాసాగా సాంకేతిక విజ్ఞానాన్ని చదివేలా చెయ్యాలనే దృక్పథంతో రాయబడింది' అని ముందు మాటలోనే చెప్పారు గనుక వ్యాకరణరీత్యా నిషిద్ధమయిన పదాలు కొన్ని, ఆంగ్ల పదాలు మరిన్ని కనిపించటంలో తప్పులేదు; ఆశ్చర్యపడనక్కర్లేదు (ముందుమాటలోనే ఆ వరవడి కనిపిస్తుంది). కానీ వుపయోగించిన కొన్ని తెలుగు పదాలు ఆంగ్ల పదాల అర్థాన్ని అందించలేకపోవడమేగాక పాఠకుడికి వకంతట కొరుకుడు పడవేమోనని **కూడా** అనుమానం కలిగిస్తయ్. ఉదా : గొలుసుకట్టు మార్పు ఛైన్‌రియాక్షన్‌కు అనువాదం (పేజి. 4 ). శృంఖలా ప్రతిక్రియ అన్న పదం యెప్పటినుంచో వాడుకలో వున్నది కదా. అలాగే "తూకంగా అభివృద్ధి" (పేజీ 97) అనటం కంటే "సమీకృతాభివృద్ధి" అంటే తేలిగ్గా అర్థమవుతుంది. గాలిశక్తి – వాయుశక్తి మొదలైనవి. కొన్ని పదాలను నిర్ణయించుకుని అందరూ వాటిని క్రమబద్ధంగా వుపయోగిస్తే పాఠకుడికి తలకాయ బ్రద్దలు కొట్టుకునే పరిస్థితి రాదు. తెలుగులో సాంకేతిక రచనలు విరివిగా వచ్చే అవకాశం కూడా అప్పుడే వుంటుంది. వాటికి మరింత వుపయోగమూ వుంటుంది. తెలుగులో సాంకేతిక రచనలు చేసేవారందరూ యీ విషయంలో ఒక వప్పందానికి రావాలి. అలాంటి ప్రయత్నాలు జరిగినయ్ (పదకోశ నిర్మాణం మొదలైనవి); కానీ మళ్ళీ యెవరికి వారేగా వ్రాస్తున్నారు.

ఏయే రంగాలలో యీ వినియోగాన్ని తగ్గించాలి అన్న దాని మీద కూడా కొంత వివరణ వుంటే బాగుండేది. కిరోసిన్ దొరక్కపోతే గ్యాసుకూ, అదీ దొరక్కపోతే మరో విద్యుత్తు పరికరాలకు పోయే యీ నాగరికతకు పైచూపే కానీ క్రింద చూపు, ప్రక్క చూపు లేని పరిస్థితుల్లో కొన్ని రంగాలలో కొన్ని శక్తి సాధనాలను నిషేధించాల్సిన అవసరం కూడా వుంది.

ప్రతిదేశం తన ఆర్థికాభివృద్ధికి రూపొందించే ప్రణాళికలలో యీతరం అవసరాలను తీర్చే విధానాలతోబాటు, ముందు తరాల అవసరాలకు కొంత సహజ సంపదను మిగులుచేసే విధానాలను కూడా చేపట్టి వాటిని తప్పనిసరిగా ప్రణాళికలలో చూపించాల్సిన సమయం వచ్చింది. అంతర్జాతీయ సంస్థ (ఐక్యరాజ్య సమితికి చెందిన యే విభాగం లాంటిదో) పటిష్ఠంగా యీ కార్యక్రమాన్ని చేపట్టాలి. ముందు తరాలకు సంజాయిషీ యిచ్చే పరిస్థితి మనకు రాదు గదా అని గాక, వారిపట్ల బాధ్యతాయుతంగా ప్రవర్తించాల్సిన ఆవశ్యకత వున్నదని ఆర్థికవేత్తలు, శాస్త్రజ్ఞులు, రాజకీయ నాయకులు గ్రహించాలి.

ఈ పుస్తకం ప్రతి విద్యాసంస్థలోనూ వుండతగ్గది.

డాక్టర్ తేళ్లపల్లి

# గ్రంథస్వీకారాలు

* అపదుద్ధారక స్తోత్రము. రచన : శ్రీ రంగుడు వేంకట రమణమూర్తి. పేజీలు : 16, వెల : 50 పైసలు, ప్రతులకు : ఆర్. వి. ఆర్. మూర్తి, భారతభారతి, శ్రీ గీతా పవర్ ప్రెస్, విజయనగరం-2.

* మృత్యుంజయమ్. రచన : శ్రీ రంగుడు వేంకట రమణ మూర్తి. పేజీలు : 36, వెల : ఒకరూపాయి, ప్రతులకు : ఆర్. వి. ఆర్. మూర్తి, భారతభారతి, శ్రీ గీతాపవర్ ప్రెస్, విజయనగరం 531202.

* శతకద్వయి. రచయిత : శ్రీ తావుల పురుషోత్తము కవి. పేజీలు : 22, ప్రతులకు : రచయిత, మామిళ్ళగూడెం వీధి, నెం. 1–2–78, ఖమ్మం.

* మందాకినీ శాప విమోచనము అను గంగా కళ్యాణము (నాలుగు అంకముల పౌరాణిక నాటకము). రచయిత : కవి కంఠీరవ డా. మానేపల్లి కుమారస్వామి. పేజీలు : 46, వెల : రు. 3/–, ప్రతులకు : డా. మానేపల్లి తారకాలింగం (డా. మల్లిబాబు), సోమలతా పబ్లిషర్స్, నరసాపురం–534 275. ప. గో. జిల్లా.

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M156 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1 B61 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినవారు | Navya |
| పేజీలు విడదీసినవారు | Srinisha |
| స్కాన్ చేసినవారు | Harsha |
| పరీక్ష చేసినవారు | HEMA |
| పేజీలు సరిచూసినవారు | |
| బైండింగు చేసినవారు | |
| ప్యాకింగు చేసినవారు | |
| పరిస్థితి | Good |